శ్రీ మధుసూదన సరస్వతీ విరచిత

# సిద్ధాన్తబిన్దుః

భావదీపికాఖ్య

ఆన్ధ్రవివరణ సమలఙ్కృతః

భావదీపిక :

'బ్రహ్మవిద్యాలఙ్కార'

శ్రీ సూరి రామకోటిశాస్త్రి

ప్రకాశకులు :

శ్రీ రామకృష్ణాశ్రమము-అశోకనగ

SIDDĀNTHABINDU BHĀVADEEPIKA

వైశాఖము- 1997

కాపీలు : 500



మూల్యము : రు. 70/-

ప్రాప్తిస్థానము :

1. బ్రహ్మశ్రీ సూరి రామకోటిశాస్త్రి గారు
   1-10-5 అశోకనగర్,
   హైద్రాబాదు-500 020.

2. శ్రీ ఆకెళ్ళ శివరామబ్రహ్మం గారు
   జాయింట్ సెక్రటరి,
   శ్రీ రామకృష్ణాశ్రమము,
   3-6-66.4 upstairs,
   వీధి నెం. 9, హిమాయత్‌నగర్,
   హైద్రాబాదు - 520 029.

3. డా॥ కె. గోవిందశర్మ గారు
   6-4-491/5, కృష్ణనగర్,
   సికింద్రాబాదు - 500 080.

ముద్రణ :
[illegible] ఆర్ట్ ప్రింటర్స్,

# సమర్పణము

తర్క, వేదాన్తశాస్త్ర నిష్ణాతులు

బ్రహ్మశ్రీ వేమూరి రామబ్రహ్మశాస్త్రి

బ్రహ్మశ్రీ మండలీక వేంకటశాస్త్రి

బ్రహ్మశ్రీ ఉప్పులూరి పున్నయ్యశాస్త్రి

బ్రహ్మశ్రీ దెందుకూరి నరసింహశాస్త్రి

బ్రహ్మశ్రీ పూజ్యశ్రీ సున్దరశాస్త్రి

మహోదయుల

శ్రీ గురుచరణారవిందములకు

భక్తిశ్రద్ధాపరిప్లుత హృదయముతో—

రచయిత.

# వన్దే గురుపరంపరామ్

శ్లో॥ నారాయణం పద్మభువం వశిష్ఠం
శక్తిం చ తత్పుత్ర పరాశరం చ।
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం
గోవిన్దయోగీన్ద్రి మథాస్య శిష్యమ్॥

శ్లో॥ శ్రీ శఙ్కరాచార్య మథాస్య పద్మపాదం చ
హస్తామలకం చ శిష్యమ్।
తం త్రోటకం వార్తికకార మన్యాన్
అస్మద్గురూన్ సన్తత మానతోఽస్మి॥

శ్లో॥ శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్।
నమామి భగవత్పాదశఙ్కరం లోకశఙ్కరమ్॥

శ్లో॥ శఙ్కరం శఙ్కరాచార్యం కేశవం బాదరాయణమ్।
సూత్రభాష్యకృతౌ వన్దే భగవన్తౌ పునః పునః॥

శ్లో॥ సదాశివ సమారంభాం శఙ్కరాచార్య మధ్యమామ్।
అస్మదాచార్య పర్యన్తాం వన్దే గురుపరంపరామ్॥

# దశశ్లోకీ

- శ్రీ శఙ్కరభగవత్పాదాః

శ్లో॥ న భూమి ర్న తోయం న తేజో న వాయుః
న ఖం నేన్ద్రియం వా న తేషాం సమూహః ।
అనైకాన్తికత్వాత్ సుషుప్త్యేకసిద్ధః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౧

శ్లో॥ న వర్ణా న వర్ణాశ్రమాచారధర్మాః
న మే ధారణా ధ్యాన యోగాదయోఽపి ।
అనాత్మాశ్రయాహంమమాధ్యాసహానాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౨

శ్లో॥ న మాతా పితా వా న దేవా న లోకా
న వేదా న యజ్ఞా న తీర్థం బ్రువన్తి ।
సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౩

శ్లో॥ న సాంఖ్యం న శైవం న తత్పాఞ్చరాత్రం
న జైనం న మీమాంసకాదే ర్మతం వా ।
విశిష్టానుభూత్యా విశుద్ధాత్మకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౪

శ్లో॥ న చోర్ధ్వం న చాధో న చాన్త ర్న బాహ్యం
న మధ్యం న తిర్యఙ్ న పూర్వాపరా దిక్ ।
వియద్వద్వ్యాపకత్వా దఖండైకరూప
స్తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౫

శ్లో॥ న శుక్లం న కృష్ణం న రక్తం న పీతం
న కుబ్జం న పీనం న హ్రస్వం న దీర్ఘమ్ ।
అరూపం తథా జ్యోతిరాకారకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౬

శ్లో॥ న శాస్తా న శాస్త్రం న శిష్యో న శిక్షా
న చ త్వం న చాహం న వాఽయం ప్రపఞ్చః ।
స్వరూపావబోధో వికల్పాసహిష్ణు
స్తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౭

శ్లో॥ న జాగ్రన్న మే స్వప్నకో వా సుషుప్తిః
న విశ్వో న వా తైజసః ప్రాజ్ఞకో వా ।
అవిద్యాత్మకత్వాత్ త్రయాణాం తురీయ
స్తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౮

శ్లో॥ అపి వ్యాపకత్వాత్ హితత్వప్రయోగాత్
స్వతఃసిద్ధభావా దనన్యాశ్రయత్వాత్ ।
జగత్తుచ్ఛ మేతత్సమస్తం తదన్యత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౯

శ్లో॥ న చైకం తదన్యద్ ద్వితీయం కుతః స్యాత్
న వా కేవలత్వం న చాకేవలత్వమ్ ।
న శూన్యం న చాశూన్య మద్వైతకత్వాత్
కథం సర్వవేదాన్తసిద్ధం బ్రవీమి ॥ ౧౦

ఓమ్ తత్సత్

ఓమ్
శ్రీగురుభ్యో నమః
హరిః ఓమ్

# సిద్ధాన్తబిన్దుః
# వేదాన్తశాస్త్రప్రకరణగ్రన్థః

## ఉపోద్ఘాతము

అద్వైత మత ప్రతిష్ఠాపనాచార్యులైన శ్రీ శఙ్కర భగవత్పాదులు ఉపనిషత్, సూత్ర, గీతా ప్రస్థానత్రయ భాష్యములను రచించిరి. ఆటుతరువాత, మంద, మధ్యమాధికారులు తరించుటకై 'వివేకచూడామణి', 'శ్రీ దక్షిణామూర్తి స్తోత్రాది' గ్రంథములను గూడ, ఆత్మతత్త్వావబోధకై రచించినారు. ఇవిగాక, 'ఏకశ్లోకి', 'దశశ్లోకి', 'శతశ్లోకి' మొదలగు ముక్తకములు మొదలగువానిని సులభముగా ఆత్మస్వరూపమును గ్రహించి కృతార్థులగుటకు రచనము చేసిరి. అందు, 'దశశ్లోకి' శ్రీ మధుసూదనసర్వతీ ప్రణీత 'సిద్ధాన్తబిన్దు' నామక వేదాన్తశాస్త్ర ప్రకరణగ్రంథమునకు మూలము అయి ఉన్నది.

అపౌరుషేయములు, స్వతః ప్రమాణములు, నిత్యములు, నిర్దోషములు, సర్వజ్ఞ ఈశ్వర ప్రవర్తితములును అగు ఋగ్యజుస్సామాథర్వణవేదములు కర్మకాండ, జ్ఞానకాండ ద్వయాత్మకముగా విభక్తములై అతీంద్రియములు (ప్రత్యక్ష, అనుమాన ప్రమాణాది అగోచరములు) అగు ధర్మ, బ్రహ్మలను ప్రతిపాదించుచున్నవి. జ్ఞానకాండ, వేదాన్తములు, వేదములయొక్క చివరి భాగములు. అందు, పరమతాత్పర్యవిషయమైన బ్రహ్మవస్తువును (ఆత్మ

తత్త్వమును) నిరూపించు వాక్యములలో జీవబ్రహ్మైక్యబోధకము లగు మహావాక్యములు 'ప్రజ్ఞానం బ్రహ్మ' (ఐతరేయ), 'అహం బ్రహ్మాస్మి' (బృహదారణ్యక), 'తత్త్వమసి' (ఛాందోగ్య), 'అయమాత్మా బ్రహ్మ' (మాండూక్య) అను నాలుగు మహా వాక్యములు ప్రధానములు, ప్రసిద్ధములు. అందు, 'తత్త్వమసి' అను వాక్యమును గ్రహించి, శ్రీశఙ్కరభగవత్పాదులు లోకానుగ్రహ బుద్ధితో సారభూతమైన మహావాక్యార్థమును సంక్షిప్తముగా 'దశశ్లోకి'యందు వివరించినారు. గంభీరమైన శ్రీ శఙ్కరసూక్తి తాత్పర్యమును శ్రీ మధుసూదనసరస్వతీయతీంద్రులు ఈ 'సిద్ధాన్తబిందువు' నందు వ్యాఖ్యానించి యున్నారు. 'అద్వైత సిద్ధికారు'లగు శ్రీ మధుసూదనసరస్వతి, ముఖ్యములైన అద్వైత శాస్త్రప్రమేయములను (ముఖ్య విషయములను) సమగ్రముగా ఇందు, పొందుపరచినారు.

ఉపనిషత్తులలో జ్ఞానాఙ్గముగా అచ్చటచ్చట వచ్చు ఉపాసనలను గుఱించి వీరు ఈ గ్రంథమున, విచారణ చేయలేదు. మహావాక్యములలో 'ప్రజ్ఞానమ్, అహమ్, త్వమ్, ఆత్మా' అను పదములు జీవబోధకములు. బ్రహ్మ, బ్రహ్మ, తత్, బ్రహ్మ పదములు, పరమాత్మబోధకములు. సామానాధికరణ్యముచేతను (ఏకవిభక్త్యంతములుగా పదప్రయోగముచేతను), 'అసి, అస్మి' పదములచేతను, జీవాత్మ, పరమాత్మలకు స్వరూపఏకత్వము బోధింపబడుచున్నది. ఈ మహావాక్యార్థజ్ఞానముచేత 'న అహం బ్రహ్మ' నేను బ్రహ్మను కాను అను భేదబుద్ధి, బాధింపబడుచున్నది, ''అహం అసంసారీ, అకర్తా, అభోక్తా, సచ్చిదానన్దస్వరూపః, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావః' అను బ్రహ్మాత్మానుభవము

కలిగి, మానవుడు కృతార్థుడగుచున్నాడని మహావాక్యములకు సామాన్యార్థము.

కాని, లోకమున, మహావాక్యములను వినినప్పుడు సామాన్య అర్థము తెలిసినను, బ్రహ్మాత్మానుభవము దూరముగా ఉన్నది. ఆ అనుభవము కలుగుటకై, బ్రహ్మవిచారాత్మక శాస్త్రము ప్రవృత్తమైనది. అందు, మహావాక్యార్థవిచారము ముఖ్యమైనది. శ్రీశఙ్కర భగవత్పాదకృత 'దశశ్లోకి'యందలి మొదటి మూడు శ్లోకములు 'త్వమ్' పదార్థ వివరణరూపములు. వాక్యార్థజ్ఞానమునకు పదార్థ జ్ఞానము కారణము గనుక, మహావాక్యములోని 'త్వమ్'పదమునకు అర్థమును వివరించినారు. 'త్వం తదసి'అని జీవుని ఉద్దేశించి ఈశ్వర భావము బోధింపబడినది. మోక్షమును పొందువాడు జీవుడుగనుక పాఠక్రమమును వదలి అర్థక్రమమును ఆశ్రయించి, యోజన చేయబడినది. శ్రుతియందు సంసారిగా తోచు జీవునకు ఈశ్వర స్వరూపత్వ ప్రతిపాదనమే అభిమతము. అసంసారి యగు ఈశ్వరునకు సంసారి జీవస్వరూపత్వ ప్రతిపాదనము తాత్పర్యము కాదు. అట్లే అయినచో, 'తత్ త్వం అస్తి' అని వాక్యము ఉండి ఉండును.

ఇచట, కొంత విచారణీయాంశము కలదు. 'తత్ త్వం అసి' అను మహావాక్యములో ఈశ్వరబోధకము అగు 'తత్' పదము, ముందు ఉన్నది. తరువాత, జీవబోధక మగు 'త్వమ్' పదము వచ్చుచున్నది. ''అనువాద్య మనుక్త్వైవ న విధేయ ముదీరయేత్'' అను వచనమును అనుసరించి, ముందు అనువాద్యమును (ఉద్దేశ్యమును) నిర్దేశించవలయును. 'ప్రజ్ఞానం బ్రహ్మ', 'అహం బ్రహ్మాస్మి', 'అయమాత్మా బ్రహ్మ' అను మహావాక్యములలో జీవ

బోధకములగు 'ప్రజ్ఞానమ్', 'అహమ్', 'అయమాత్మా' పదములు ముందు, నిర్దేశింపబడినవి.

ఈ 'తత్త్వమసి' వాక్యమునందే, జీవబోధక పదములు ముందు, రాలేదు. 'దశశ్లోకి'లోని మొదటి మూడు శ్లోకములు 'త్వం' పదార్థ నిరూపణపరములు. కనుక, తరువాత వచ్చిన 'త్వం'పదమును ముందు, యోజన చేసి, 'త్వమ్' పదార్థమును వర్ణించవలసివచ్చినది. వాక్యమునందు ఉద్దేశ్యభాగము, విధేయ భాగము అని రెండు భాగములు ఉండును. (Subject, Predicate) 'తత్త్వమసి' వాక్యమున, జీవుని, ఉద్దేశించి, ఈశ్వరభావము ఉపదేశింపబడుచున్నది. అనగా, 'త్వమ్'పదార్థమున, ఉద్దేశ్యతాఖ్య విషయత, 'తత్'పదార్థమున, విధేయతాఖ్య విషయత, భాసించుచున్నది. ఈ విషయతలు మారినచో, వాక్యార్థము మారిపోవును.

'ఆదిత్యో బ్రహ్మ' ఆదిత్యుడు బ్రహ్మ. అనగా, ఆదిత్యుని ఉద్దేశించి, బ్రహ్మదృష్టి విధింపబడుచున్నది. బ్రహ్మ, ఆదిత్యుడు అని చెప్పినచో, బ్రహ్మను ఉద్దేశించి, ఆదిత్యదృష్టి చెప్పినట్లగును. 'బ్రహ్మదృష్టి రుత్కర్షాత్' అను బ్రహ్మసూత్రములో బ్రహ్మ, ఉత్కృష్టమైనవాడు, ఆదిత్యుడు అపకృష్టమైనవాడు. అపకృష్టుని యందు ఉత్కృష్ట దృష్టి లోకమునందు గూడ, ఫలప్రదము. కనుక, ఆదిత్యునియందు, బ్రహ్మదృష్టి చేయవలయును అని నిర్ణయమును చేసినారు. ఇపుడు, బ్రహ్మోపాసన అగును.

బ్రహ్మయందు ఆదిత్యదృష్టి చేసినచో, ఉత్కృష్టమునందు అపకృష్టదృష్టి చేసినట్లగును. ఇది, కార్యహానికరము. కావున, 'బ్రహ్మ ఆదిత్యః' అని ఉపాసన చేయరాదు. ముందు, ప్రతీత

మగు పదార్థమునందు, ఉద్దేశ్యత (అనువాద్యత) అను విషయత భాసించును. అపరిచితము ఉద్దేశ్యము, నూతనముగా బోధింపబడు అంశము విధేయము. 'విధేయత' అను విషయత తరువాత ప్రతీతమగు పదార్థమునందు భాసించును. ఉద్దేశ్యత, విధేయతలు మారినచో, వాక్యార్థములు భిన్నములు అగును. ప్రకృతమున జీవోద్దేశేన ఈశ్వరత్వము విధేయము. అందువలన, జీవునకు అసంసారిత్వము సిద్ధించుచున్నది. అట్లుగాక, పాఠక్రమమును పాటించి తత్పదార్థమును, ఉద్దేశ్యముగా గ్రహించినచో, ఈశ్వరునకు జీవత్వము ఉపదేశింపబడినట్లగును. దానివలన, ఈశ్వరునకు సంసారిత్వము ప్రాప్తమగును. కనుక, 'త్వమ్' అను పదమును ముందు, యోజన చేయుట జరిగినది. దీనికి గమకము 'అసి' పదము. 'యుష్మది మధ్యమః' మధ్యమపురుష క్రియాపదమునకు కర్తృపదము 'త్వమ్' పదము అయి ఉన్నది. ఇది, విశేష్య సమర్పకము. 'తత్'అనునది విధేయవిశేషణ సమర్పకము. ఇట్లు గాక, 'తత్'పదము ముందు, ఉన్నది కదా, అని విశేష్యకర్తృ సమర్పకపదము అని అనుకొనినచో, 'శేషే ప్రథమః'అని క్రియా పదము ప్రథమపురుషలో ఉండవలయును. అపుడు 'తత్ త్వమ్ అస్తి' అని వాక్యము ఉండును. శ్రుతియందు 'అసి'అను మధ్యమ పురుష ఉండుటచే, 'త్వమ్' పదమే, కర్తృపదముగా స్వీకరించ వలయును. ఈవిధముగా ఆలోచించి 'త్వమ్'పదము పూర్వము నందు యోజన చేయబడినది. ఇట్లు చేయుటవలన, జీవేశ్వరైకత్వ సిద్ధాంతమున, ఈశ్వరునకు జీవగత సంసారిత్వము ప్రాప్తమగును అను ఆశంకకు సమాధానము చెప్పినట్లైనది. ఎట్లనగా, జీవునకే, సంసారిత్వము లేనపుడు, ఈశ్వరునకు ఎట్లు వచ్చును? జీవాత్మ యందు సంసారిత్వము, అహఙ్కార తాదాత్మ్యాధ్యాస వలన, ప్రతీత మగుచున్నదే గాని, వాస్తవముగా లేదు అని భావము.

ఇపుడు, పదములయొక్క అర్థము ముందుగా, తెలిసికొనవలసి యున్నది. సాధారణముగా వాక్యమునందు పదశ్రవణానంతరము పదార్థోపస్థితి (స్మృతి), వాక్యార్థబోధ క్రమము అయి ఉన్నది. పదార్థోపస్థితి, సవికల్పక జ్ఞానమై యున్నది. వాక్యార్థబోధ గూడ సవిశేష్యకము, సప్రకారకము, ససంసర్గకము అగు సవికల్పక జ్ఞానమే అయిఉన్నది. మఱియు, ఈ వాక్యార్థబోధ (శాబ్దబోధ) పరోక్షజ్ఞానమై ఉన్నది. మహావాక్యములందు సవికల్పకజ్ఞానము 'ఏకమేవాద్వితీయమ్' అను బ్రహ్మాత్మాద్వైత వాక్యార్థబోధకు అనుగుణము కాదు. కనుక, నిర్వికల్పక బ్రహ్మాత్మైక్య వాక్యార్థ బోధకు అనుగుణముగా నిర్వికల్పక పదార్థోపస్థితియే, శ్రుతి సాహాయ్యముచే స్వీకరింపబడినది. శాస్త్రప్రమేయమగు బ్రహ్మ (ఆత్మ)

'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ', 'య ఆత్మా సర్వాన్తరః' అని అపరోక్షస్వప్రకాశక్షస్వభావము కలది యగుటచే వాక్యము వలన కలిగిన బ్రహ్మాత్మబోధ కూడ, అపరోక్షమై అజ్ఞాననివర్తక మగుచున్నది.

బ్రహ్మవిద్యయే, ఆత్మవిద్య. 'బృహ బృహి వృద్ధౌ' అను ధాతువునకు 'మనిన్' ప్రత్యయము చేరగా, 'బ్రహ్మ'శబ్దము నిష్పన్నమగును. సర్వవ్యాపకము అని అర్థము. 'ఆప్నోతీతి ఆత్మా' వ్యాపించునదిగాన, ఆత్మ. కనుక, 'ఆత్మ'శబ్దమునకు సర్వ వ్యాపకమనియే అర్థము. కనుక 'బ్రహ్మ, ఆత్మ'శబ్దములు 'ఘటః, కలశః' అనునట్లుగా పర్యాయపదములు, ఏకార్థకములు. ఇట్లయినచో, బ్రహ్మవిద్యకొఱకు విచారము అనావశ్యకము. సందేహము, ప్రయోజనము, ఉన్న స్థానములందు విచారణ ఆవశ్యకమగును. పట్టపగలు వెలుతురులో ఉన్న ఘటమును చూచి

సందేహము లేదు గనుక, ఎవరును విచారించరు. కాకికి పళ్ళు ఎన్ని ఉండునని ఎవరును విచారణ చేయరు, నిష్ప్రయోజనము గనుక. అట్లే, ఆత్మ 'అహమ్' 'అహమ్' అని అందఱకు నిస్సంశయముగా తెలియుచునే ఉన్నది. నేను ఉన్నానా, లేనా? అని ఎవరును అనుకొనరు. కనుక, సందేహము లేదు. మఱియు, ఆత్మవిచారణ వలన, ఏమియు ప్రయోజనము లేదు. ఎన్నాళ్ళు విచారించినను, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావ, సచ్చిదానంద ఆత్మస్వరూప అనుభవము ఎవరికిని కలుగుట లేదు. ఆత్మవిచారణ చేయువారు గూడ, సంసారక్లేశములను అనుభవించుచున్నారు అను పూర్వ పక్షము రాగా–

శ్లో॥ న భూమి ర్న తోయం న తేజో న వాయుః
న ఖం నేంద్రియం వా న తేషాం సమూహః।
అనైకాన్తికత్వాత్ సుషుప్త్యైకసిద్ధః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥

అను శ్లోకముచే విప్రతిపత్తి వాక్యములచే సంశయాస్పదమైన 'అహమ్' ప్రత్యయాలంబనమగు (నేను అను స్ఫురణలో గోచర మగు) ఆత్మ, శివః=చిదానందస్వరూపుడు, అని భగవత్పాదులు నిరూపించుచున్నారు.

విప్రతిపత్తి వాక్యములు అనగా, విరుద్ధార్థ ప్రతిపాదక వాక్యములు. కొందఱు దేహమే, ఆత్మ యని, మఱికొందఱు ప్రాణేంద్రియాదులు ఆత్మయని పలుకగా, శ్రోతలకు సంశయము కలుగును. ఆ సంశయమును నివారించుటకు 'త్వమ్' పదార్థవిచారణ

చేయబడినది. ఈ 'త్వమ్' పదమునకు రెండు అర్థములు కలవు- వాచ్యార్థము, లక్ష్యార్థము. జాగ్రత్స్వప్న సుషుప్తి వర్ణన చేయు శ్రుతులు 'త్వమ్' పద వాచ్యార్థమును బోధించును.

"యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది అన్తః జ్యోతిః
పురుషః న దృష్టేః ద్రష్టారం పశ్యేః।"

ప్రాణేంద్రియ వ్యతిరిక్తుడు, విజ్ఞానమయుడు, జ్యోతిఃస్వరూపుడు అగు పురుషుడు హృదయములోపల గలడు. దృష్టిని చూచు వానిని నీవు చూడలేవు- ఈ మొదలగు శ్రుతులు 'త్వమ్' పద లక్ష్యార్థమును బోధించును. ఇవి అవాంతరవాక్యములు, పదార్థ బోధక వాక్యములు. ఇట్లే, 'తత్'పదమునకు గూడ, వాచ్యార్థ లక్ష్యార్థములు కలవు. 'యతో వా ఇమాని భూతాని జాయన్తే' మొదలగు జగత్కారణశ్రుతులు 'తత్' పద వాచ్యార్థమును బోధించును. 'సత్యం జ్ఞాన మనన్తమ్, విజ్ఞాన మానన్దం బ్రహ్మ' మొదలగు వాక్యములు 'తత్' పద లక్ష్యార్థమును బోధించును. తత్త్వము, వాచ్యార్థమగు ఈశ్వరుడు ఉపాసనకొఱకు ఉపయోగించును. 'తత్త్వమసి'మహావాక్యముచేత బోధింపబడిన ఐక్యము 'తత్, త్వమ్' పద లక్ష్యార్థములకే గాని, వాచ్యార్థములకు కాదు. వాచ్యార్థవేళయందు కించిజ్జ్ఞత్వ, సర్వజ్ఞత్వ, సంసారిత్వ, అసంసారిత్వాది విరుద్ధ ధర్మములు భాసించుచుండును గనుక, వాచ్యార్థములకు ఐక్యము ఉపపన్నము కాదు. కనుకనే, లక్షణను ఆశ్రయించి,కించిజ్జ్ఞత్వోపలక్షిత చైతన్యమునకును, సర్వజ్ఞత్వోపలక్షిత చైతన్యమునకును అభేదము చెప్పబడుచున్నది. ఉత్కృష్ట అపకృష్ట ఉపాధి వినిర్ముక్త అఖండ చైతన్యబోధ మహావాక్యముల వలన, కలుగుచున్నది. జీవుడు, అవిద్యాన్తఃకరణోపాధ్యభిమాన

మును జయించుటకు ముందు, కర్మోపాసనలు సాధనములుగా చెప్పబడినవి. ఈశ్వరుడు, శుద్ధసత్త్వప్రధాన మాయోపాధితో జగత్సర్జనాదులు చేయుచు, సాధకానుగ్రహము కొఱకు లీలా విగ్రహములను ధరించును. ఉపాధి, ఆయన వశమునందు ఉండుటచే, స్వతంత్రుడు. కర్మోపాసనాభూమిక వఱకు 'తత్'పద వాచ్యార్థ ఈశ్వరస్వరూపముతో కర్మఫలప్రదాతయై, భక్తులను అనుగ్రహించుచు, సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్య రూపచతుర్విధముక్తులను ప్రసాదించుచున్నాడు. కైవల్యముక్తి కొఱకు విచారణమార్గముచే జీవబ్రహ్మైక్యజ్ఞానమును సంపాదించుకొనవలెను. ఆ స్వరూపజ్ఞానము కొఱకు జీవ, ఈశ్వర, బ్రహ్మస్వరూపవిచారణ చేయవలయును. ఆభాసవాదము, ప్రతిబింబవాదము, అవచ్ఛేదవాదము అను ప్రక్రియలను ఆశ్రయించి, బ్రహ్మాద్వైతము బోధింపబడుచున్నది.

ఆభాసవాదమునకు, ప్రతిబింబవానమునకు ప్రమాణములగు శ్రుతి, స్మృతి, సూత్రములు ఉదహరింపబడుచున్నవి. 'రూపం రూపం ప్రతిరూపో బభూవ' ప్రతి అంతఃకరణమున ఆత్మ, ప్రతిబింబరూపమును ధరించును. 'తదస్య రూపం ప్రతిచక్షణాయ' ఆ ప్రతిబింబము 'అహమ్' అను వ్యవహారము కొఱకు ఏర్పడినది. 'మాయా ఆభాసేన జీవేశౌ కరోతి' అవిద్య తనయందలి ప్రతిబింబముచే జీవేశ్వరులను ఏర్పరచుచున్నది – మొదలగు శ్రుతియు, 'ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్' ఆత్మ పరమార్థముగా ఏకరూపమైనను, జలచంద్ర న్యాయముచేత ప్రతిబింబరూపముతో నానావిధములుగా కన్పట్టుచున్నాడు అను స్మృతియు,

చేయబడినది. ఈ 'త్వమ్' పదమునకు రెండు అర్థములు కలవు- వాచ్యార్థము, లక్ష్యార్థము. జాగ్రత్స్వప్న సుషుప్తి వర్ణన చేయు శ్రుతులు 'త్వమ్' పద వాచ్యార్థమును బోధించును.

> ''యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది అన్తః జ్యోతిః పురుషః న దృష్టేః ద్రష్టారం పశ్యేః।''

ప్రాణేంద్రియ వ్యతిరిక్తుడు, విజ్ఞానమయుడు, జ్యోతిఃస్వరూపుడు అగు పురుషుడు హృదయములోపల గలడు. దృష్టిని చూచువానిని నీవు చూడలేవు- ఈ మొదలగు శ్రుతులు 'త్వమ్' పద లక్ష్యార్థమును బోధించును. ఇవి అవాంతరవాక్యములు, పదార్థ బోధక వాక్యములు. ఇట్లే, 'తత్'పదమునకు గూడ, వాచ్యార్థ లక్ష్యార్థములు కలవు. 'యతో వా ఇమాని భూతాని జాయన్తే' మొదలగు జగత్కారణ శ్రుతులు 'తత్' పద వాచ్యార్థమును బోధించును. 'సత్యం జ్ఞాన మనన్తమ్, విజ్ఞాన మానన్దం బ్రహ్మ' మొదలగు వాక్యములు 'తత్' పద లక్ష్యార్థమును బోధించును. తత్త్వము, వాచ్యార్థమగు ఈశ్వరుడు ఉపాసనకొఱకు ఉపయోగించును. 'తత్త్వమసి'మహావాక్యముచేత బోధింపబడిన ఐక్యము 'తత్, త్వమ్' పద లక్ష్యార్థములకే గాని, వాచ్యార్థములకు కాదు. వాచ్యార్థ వేళయందు కించిజ్జ్ఞత్వ, సర్వజ్ఞత్వ, సంసారిత్వ, అసంసారిత్వాది విరుద్ధ ధర్మములు భాసించుచుండును గనుక, వాచ్యార్థములకు ఐక్యము ఉపపన్నము కాదు. కనుకనే, లక్షణను ఆశ్రయించి,కించిజ్జ్ఞత్వోపలక్షిత చైతన్యమునకును, సర్వజ్ఞత్వోపలక్షిత చైతన్యమునకును అభేదము చెప్పబడుచున్నది. ఉత్కృష్ట అపకృష్ట ఉపాధి వినిర్ముక్త అఖండ చైతన్యబోధ మహావాక్యముల వలన, కలుగుచున్నది. జీవుడు, అవిద్యాన్తఃకరణోపాధ్యభిమాన

మును జయించుటకు ముందు, కర్మోపాసనలు సాధనములుగా చెప్పబడినవి. ఈశ్వరుడు, శుద్ధసత్త్వప్రధాన మాయోపాధితో జగత్సర్జనాదులు చేయుచు, సాధకానుగ్రహము కొఱకు లీలా విగ్రహములను ధరించును. ఉపాధి, ఆయన వశమునందు ఉండుటచే, స్వతంత్రుడు. కర్మోపాసనాభూమిక వఱకు 'తత్'పద వాచ్యార్థ ఈశ్వరస్వరూపముతో కర్మఫలప్రదాతయై; భక్తులను అనుగ్రహించుచు, సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్య రూపచతుర్విధముక్తులను ప్రసాదించుచున్నాడు. కైవల్యముక్తి కొఱకు విచారణమార్గముచే జీవబ్రహ్మైక్యజ్ఞానమును సంపాదించుకొనవలెను. ఆ స్వరూపజ్ఞానము కొఱకు జీవ, ఈశ్వర, బ్రహ్మస్వరూపవిచారణ చేయవలయును. ఆభాసవాదము, ప్రతిబింబవాదము, అవచ్ఛేదవాదము అను ప్రక్రియలను ఆశ్రయించి, బ్రహ్మాద్వైతము బోధింపబడుచున్నది.

ఆభాసవాదమునకు, ప్రతిబింబవానమునకు ప్రమాణములగు శ్రుతి, స్మృతి, సూత్రములు ఉదహరింపబడుచున్నవి. 'రూపం రూపం ప్రతిరూపో బభూవ' ప్రతి అంతఃకరణమున ఆత్మ, ప్రతిబింబరూపమును ధరించును. 'తదస్య రూపం ప్రతిచక్షణాయ' ఆ ప్రతిబింబము 'అహమ్' అను వ్యవహారము కొఱకు ఏర్పడినది. 'మాయా ఆభాసేన జీవేశౌ కరోతి' అవిద్య తనయందలి ప్రతిబింబముచే జీవేశ్వరులను ఏర్పరచుచున్నది – మొదలగు శ్రుతియు, 'ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్' ఆత్మ పరమార్థముగా ఏకరూపమైనను, జలచంద్ర న్యాయముచేత ప్రతిబింబరూపముతో నానావిధములుగా కన్పట్టుచున్నాడు అను స్మృతియు,

'ఆభాస ఏవ చ, అత ఏవ చ ఉపమా సూర్యకాదివత్'

జీవుడు పరమాత్మయొక్క ఆభాసము, ప్రతిబింబమై ఉన్నాడు. జలమునందు సూర్యప్రతిబింబమువంటివాడు. ఆభాసుడగు ఈ జీవుడు సాక్షాత్తు ఆ పరమాత్మయే యని అనుకొనుటకు వీలులేదు. పరమాత్మకంటె వేఱగు వస్తువు కాడు, ఉపాధిపరతంత్రుడు- మొదలగు సూత్రములు ప్రమాణములుగా గ్రహింపదగును. ప్రతిబింబము, స్వరూపముచే మిథ్యాభూతము అనెడివాదము ఆభాసవాదము. ప్రతిబింబము స్వరూపతః సత్యము, ప్రతి బింబత్వ, దర్పణస్థత్వ రూపములతో మిథ్యాభూతము అనునట్టి వాదము ప్రతిబింబవాదము. ఆభాసవాదమును వార్త్తికకారులు స్వీకరించిరి. ప్రతిబింబవాదమును పద్మపాద, వివరణాచార్యులు స్వీకరించిరి. దర్పణము అను ఉపాధిచే ప్రతిబింబము, బింబము అను వ్యవహారము, ముఖమునందు కలిగినను, వస్తువు, ముఖ స్వరూపము ఒకటియే అయినటుల, అంతఃకరణ ప్రతిబింబముగా గాని, అవిద్యాప్రతిబింబముగా గాని, ఉన్న జీవుడు, బింబ భూతుడుగా ఉన్న ఈశ్వరుడు, శుద్ధబ్రహ్మస్వరూపులే అయి ఉన్నారని బ్రహ్మాద్వైతమును గ్రహించుటకు ఈ వాదములు ఉపకరించుచున్నవి. ఆభాసవాదమునందు చిదాభాసుడు సంసారి. ఆభాసాశ్రయాన్తఃకరణాధిష్ఠాన కూటస్థ చైతన్యమునకు 'తత్'పదలక్ష్యార్థముతో ఏకత్వము. ప్రతిబింబవాదమున, ప్రతిబింబము, బింబస్వరూపము సత్యమే. కనుక, ముఖ్య స్వరూపైకత్వము.

అవచ్ఛేదవాదమునకు ప్రమాణములు -

శ్లో॥ ఘట సంవృతమాకాశం నీయమానే ఘటే యథా।
ఘటో నీయేత న ఆకాశం తద్వ జ్జీవో నభోపమః॥

జీవుడు ఘటాకాశమువంటివాడు. బ్రహ్మ, మహాకాశము వంటిది. అంతఃకరణావచ్ఛేదము కలవాడు జీవుడు. ఘటాకాశము కరకాకాశము (కమండలు ఆకాశము) కాదు అను పరిమితి చేయబడునది ఘటాకాశము. ఇట్లే, అంతఃకరణముచేత అవచ్ఛేదము (పరిమితి), తాదాత్మ్యము పొందిన ఆత్మ, జీవుడు అనెడి వాదము అవచ్ఛేదవాదము. ఈ ఉపాధులచేత జీవులు, భిన్నవ్యవహారములకు లోనగుచున్నను, 'తత్త్వమసి', 'అహం బ్రహ్మాస్మి' మొదలగు మహావాక్యములవలన కలిగిన అఖండాత్మాకార చరమవృత్త్యారూఢ చైతన్యప్రకాశము చేత ఆత్మావరకమగు మూలాజ్ఞానము నశించగా, అనిర్వచనీయ అజ్ఞానోపాదాన కారణజన్య అంతఃకరణములు గూడ, (అవిద్యా తత్కార్యములు) నశించుటవలన, అవిద్యాకల్పిత సకలానర్థములు నివర్తించగా, పరమానందస్వరూపుడగుచు, స్వరూపప్రకాశముతో కృతార్థుడగుచున్నాడు.

## కృతజ్ఞతాభినందనలు:

బ్రహ్మశ్రీ ఆకెళ్ళ శివరామబ్రహ్మంగారి కుమారుడు శ్రీ వెంకటకృష్ణగారు, వారి మిత్రులు కలిసి, శ్రీ శివరామబ్రహ్మంగారి ప్రోత్సాహముచే ఉదారహృదయముతో సహకరించుటవలన, నాచే రచింపబడిన జీవన్ముక్తివివేక, పఞ్చపాదికాతత్త్వప్రకాశికాది ఆధ్యాత్మిక గ్రంథములన్నియు, ప్రకాశములోనికి వచ్చుటకు మార్గము సుగమమయినది. అధ్యాత్మవిషయములందు అత్యంత

శ్రద్ధాసక్తులతో గ్రంథముద్రణకార్యమునకు అనేక విధములుగా సహకరించుచున్న బ్రహ్మశ్రీ శివరామబ్రహ్మంగారికి, వారి పుత్రులకు దీర్ఘాయురారోగ్యములను, శాన్తిసౌఖ్యములను, స్వస్వరూపానుభూతిని పరమేశ్వరుడు ప్రసాదించుగాక!

నా ఆధ్యాత్మవ్యాసంగము తెలిసిన బ్రహ్మశ్రీ పళ్ళాప్రగ్గడ వెంకటరమణశర్మగారు, చిరంజీవులు, ఆధ్యాత్మవిద్యాభిమానులు, ఉదారాశయులు వారి కుమారుడు పి. ఆర్. కె. శర్మగారు, ఇట్లే, ఉదారస్వభావులు, నిరంతరము తత్త్వవిద్యాశ్రవణాభిలాషులు బ్రహ్మశ్రీ దువ్వూరి ద్వారకావిశ్వనాథశర్మగారు, బ్రహ్మశ్రీ మాగంటి రామలింగశర్మగారు, అటులనే, చిరంజీవులు చెరువు శంకరస్వామిగారు, చిరంజీవులు కామరాజుగడ్డ పూర్ణానందశర్మ గారు, శ్రీ ఎ, రెడ్డిగారు, శ్రీ వింజమూరి లక్ష్మణరావుగారు, వక్తలు, భక్తులు, అధ్యాత్మసంప్రదాయవిదులునగు బ్రహ్మశ్రీ కోనాపురం రామారావుగారు, ఇంకను, ఎందరో ఉదారహృదయులు ఈ బృహత్కార్యమునకు - నాచే రచింపబడిన ఆధ్యాత్మిక గ్రంథములు వెలుగులోనికి వచ్చుటకు తోడ్పడియున్నారు. వీరందఱు, పరమేశ్వరానుగ్రహముచే దీర్ఘాయుష్మంతులై శాన్తి సౌఖ్యములతో వర్ధిల్లుదురుగాక!

నాచే రచింపబడిన ఈ గ్రంథములు వెలుగులోనికి వచ్చుటకు నిరంతరము సహకరించినవారు డా॥ కొలచన గోవిందశర్మ, M.Sc., Phd. గారు. వీరు ప్రాచ్య, ప్రాశ్చాత్య విజ్ఞాన సంప్రదాయము లను తెలిసిన సునిశిత మేధావంతులు, తత్త్వజిజ్ఞాసువులు. నాకు చేదోడు వాదోడుగా ఉండి, నాకు సహకారమందించుటయే గాక, చతుస్సూత్రీ, పఞ్చపాదికా, జీవన్ముక్తివివేక, సిద్ధాన్తబిన్దు గ్రంథములను ఆంధ్రభాషలోనికి అనువదించుటకు అత్యన్త ప్రోత్సాహ మొసగినవారు వీరు, ఆన్ధ్రానువాదమును తమ లేఖినితో

అహరహము శ్రమించి ఓర్పుతో, నేర్పుతో వ్రాతప్రతిని సిద్ధము చేసినవారు. బహువత్సరములనుండి నాఅధ్యాత్మవ్యాసంగమునకు, సద్గోష్ఠికి నిరంతరము సహకరించుచున్న డా॥కె. గోవిందశర్మగారికి అభినందనపురఃసరముగా హార్దికమైన ఆశీస్సుల నొసగుచున్నాను.

జీవన్ముక్తివివేక, పఞ్చపాదికాతత్త్వప్రకాశకాది గ్రంథ ముద్రణ భారమును వహించిన చిరంజీవులు బ్రహ్మశ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, హరి వెంకటేశ్వరశర్మగారు ఈ 'సిద్ధాన్తబిన్దు భావదీపికా' గ్రంథముద్రణభారమును గూడ, వహించి సమర్థముగా నిర్వహించినారు.

శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, వేద, శాస్త్ర సంప్రదాయవిదులు. వీరు, వ్యాకరణ, వేదాన్తశాస్త్రప్రవక్తలయిన, బ్రహ్మశ్రీ జనస్వామి వేంకటేశ్వరశాస్త్రిగారి జ్యేష్ఠపుత్రులు. మా శాస్త్రిగారు అనేక ఆధ్యాత్మిక గ్రంథములు రచించినవారు, ఇంతియేగాక, శ్రీ శ్రీ శ్రీ కరపాత్రీస్వామివారి 'భక్తిసుధా' గ్రంథమును తెలుగుభాషలోనికి అనువదించి ఆంధ్రపాఠకలోకమునకు అందించుచున్నవారు. నేను తెనాలి నగరమునందు ప్రస్థానత్రయభాష్యప్రవచనము చేయుచున్నపుడు, చిరంజీవులు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పెక్కు సంవత్సరములు నాయొద్ద భాష్య శ్రవణము చేసినవారు, సహృదయులు.

బ్రహ్మశ్రీ హరి వెంకటేశ్వరశర్మగారు ఆబాల్యము సంస్కృత భాషాభ్యసనము చేసి కావ్య, నాటక, వేదాన్తశాస్త్ర గ్రంథములను అధ్యయనము చేసిన ప్రతిభావంతులు. వీరు Phslosophy లో M.A., పట్టము నందుకొనినవారు. వీరు ఆత్మగుణ సంపన్నులు. శ్రీ శర్మగారు నాయందు ఆదరాభిమానములు కలవారు. ఈ గ్రంథముద్రణవిషయమున, శ్రీ జనస్వామి

సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి ఎంతయో చేదోడు వాదోడుగా నుండి గ్రంథముద్రణకు సహకరించినవారు.

వీరిరువురి పర్యవేక్షణలో ఈ ఆధ్యాత్మిక గ్రంథముల ముద్రణము నయనానందకరముగా సాగినది. వీరు నాయందుగల భక్తిప్రపత్తులతో సమర్థముగా, ఈ కార్యభారమును నిర్వహించిరి. ఇది వారికి నాయందుగల భక్తిప్రపత్తులకు, వారి సౌజన్యమునకు అద్వైతవేదాన్తమునందు గల అభినివేశమునకు నిదర్శనము. పరమేశ్వరుడు చిరంజీవులు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, వెంకటేశ్వర శర్మగారికి సంపూర్ణ ఆయురారోగ్యములనొసగి, బ్రహ్మనందానుభూతిని, శాన్తిసౌఖ్యములను ప్రసాదించుగాక ! అని ఆశీస్సుల నొసగుచున్నాను.

ఈ గ్రంథముద్రణము చేసిన 'వాణీ ఆర్టు ప్రింటర్స్' యజమానులు, చిరంజీవులు నయిన శివశంకరరావుగారు, వారి కార్యకర్తలయిన పి. నారాయణరెడ్డిగారు, బి. శశిధర్‌గారు పరమేశ్వరానుగ్రహముచేత ఇతోధిక సుఖసంతోషములతో, ఆయురారోగ్య ఐశ్వర్యములతో వర్ధిల్లుదురుగాక ! యని ఆశీస్సుల నందజేయుచున్నాను.

ముద్రితములయిన గ్రంథములను అందముగా బైండుచేసి ఇచ్చుచున్న శిల్పి, బి. వెంకటేశ్వర్లుగారికి, ఆ పరమేశ్వరుడు వారి మనఃక్లేశమును తొలగించి, సుఖసంతోషములను ప్రసాదించు గాక!

హైదరాబాదు,<br>ఈశ్వరనామ సంవత్సర<br>వైశాఖమాసము, 1997

ఇట్లు<br>సుధీవిధేయుడు<br>సూరి రామకోటిశాస్త్రి



బ్రహ్మవిద్వరిష్ఠులు
శ్రీ కాంచీ కామకోటిపీఠ పరమాచార్యులు
**శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి**
శ్రీచరణులు

ఓమ్
శ్రీగురుభ్యో నమః
హరిః ఓమ్

# శ్రీ మధుసూదన సరస్వతీ విరచిత

# సిద్ధాన్తబిన్దుః

## భావదీపికాఖ్య

### అన్ధ్ర వివరణ సమలఙ్కృతః

### మఙ్గలాచరణమ్

శ్లో॥ శ్రీశఙ్కరాచార్య నవావతారం విశ్వేశ్వరం
విశ్వగురుం ప్రణమ్య ।
వేదాన్తశాస్త్ర శ్రవణాలసానాం బోధాయ కుర్వే
కమపి ప్రబన్ధమ్ ॥

### భావదీపిక

శ్రీ మధుసూదనసరస్వతి, శ్రీ శఙ్కరాచార్యవిరచిత 'దశశ్లోకి' గ్రంథమునకు 'సిద్ధాన్తబిన్దుః' అను నామముతో వ్యాఖ్యానము చేయుటకు ప్రారంభమున, మంగళాచరణము చేయుచున్నారు. శ్రీ మధుసూదనసరస్వతికి విశ్వేశ్వరయతీన్ద్రులు విద్యాగురువులు.

శ్రీ శఙ్కరభగవత్పాదుల నవావతారము, జగద్గురువు అగు విశ్వేశ్వరాచార్యుని, భక్తిశ్రద్ధలతో నమస్కరించి, వేదాన్త శాస్త్రమును (శారీరక మీమాంస, బ్రహ్మసూత్రభాష్య వాచస్పత్య, కల్పతరు, పరిమళ గ్రంథములను) అధ్యయనము చేసి, వాని తాత్పర్యమును పూర్తిగా గ్రహించలేని అలస మతులకు, సంక్షేపముగా వేదాన్తసారమును బోధించుటకొఱకు ఒకానొక ప్రయత్నమును (ప్రబంధమును) చేయుచున్నాను.

## సి ద్ధా న్త బి న్దుః

ఇహ ఖలు సాక్షాత్ పరంపరయా వా సర్వాన్ జీవాన్ సముద్దిధీర్షుః భగవాన్ శ్రీ శఙ్కరః అనాత్మభ్యః వివేకేన ఆత్మానం నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావం సంక్షేపేణ బోధయితుం దశశ్లోకీం ప్రణినాయ।

## భా వ దీ పి క

భూతలమున, శఙ్కరావతారమూర్తి యగు శ్రీ శఙ్కర భగవత్పాదులు సర్వజీవులను (త్రైవర్ణికులను, శూద్రులను, కృమికీటాదులను) సాక్షాత్తుగా గాని, పరంపరయా గాని, దుఃఖము నుండి అత్యన్తము విముక్తిని కలిగింప కోరిక గలవారై అనాత్మలు అగు దేహేన్ద్రియ, మనోబుద్ధి, చిత్తాహంకారాదులకంటె భిన్నమగు నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావము గల ఆత్మను బోధించుటకు 'న భూమి ర్న తోయమ్' మొదలుకొని 'న చైకం తదన్యత్ ద్వితీయం కుతః స్యాత్' అను శ్లోకము వఱకు దశశ్లోకీ (పది శ్లోకములు) గ్రంథమును రచించిరి.

ఆత్మ, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావము. నిత్యము అనగా, కాలపరిచ్ఛేదము (పరిమితి) లేనిది. శుద్ధము అనగా, రాగద్వేషాది దోషరహితము. బుద్ధము అనగా, స్వప్రకాశ నిరతిశయానందము. ముక్తము అనగా, అవిద్యాసంబంధశూన్యము. స్వభావము అనగా, ఇతరానధీన (స్వతంత్ర) సత్త కలది. దేహేంద్రియ మనః ప్రాణాది భేదోపలక్షితములు, అనాత్మ పదార్థములు అవిద్యాకల్పితములు; ఆత్మవస్తువు ఒక్కటే, పరమార్థ సత్యము అను బోధ ఆత్మబోధ అయి ఉన్నది.

## సిద్ధాన్తబిన్దుః

నను, ఇదఙ్కారాస్పదేభ్యః అనాత్మభ్యః వివేకేన అహఙ్కారాస్పదం ఆత్మానం సర్వో లోకః అహమస్మీతి ప్రత్యేతి, దుఃఖం చ అనుభవతి । తేన జ్ఞాత జ్ఞాపకత్వాత్ నిష్ప్రయోజనత్వాచ్చ ఆత్మతత్త్వప్రతిపాదనం వ్యర్థమితి చేత్, న ।

## భావదీపిక

ఓయీ। ఆత్మబోధ అనవసరము. 'అహమ్' 'నేను' అను ప్రత్యయములో ఆత్మవస్తువు అందఱికి తెలియుచునే యున్నది. 'ఇదమ్' 'ఇది' అను ప్రత్యయములో (జ్ఞానములో) అనాత్మ పదార్థములు గోచరించుచున్నవి. కావున, 'ఇది' అని వ్యవహరింపబడు దృశ్యపదార్థములు అనాత్మలు. 'అహమ్' అని వ్యవహరింపబడునది, వానికంటె భిన్నమైనది ఆత్మ. ఇట్లు తెలిసినను, దుఃఖమును అనుభవించుట తప్పుటలేదు. చెప్పదలచుకొనిన ఆత్మవస్తువు అందఱికి జ్ఞాతమైనదే కదా। కనుక, శాస్త్రమునకు అజ్ఞాతమగు (అనన్యలభ్యమగు) విషయము లేదు. మఱియు, ఆత్మ

జ్ఞానము ఉన్నను, దుఃఖనివృత్తి కలుగుటలేదు. కనుక, శాస్త్రమునకు ప్రయోజనము కూడ, సిద్ధించదు. ఈవిధముగా విషయ, ప్రయోజనములు లభించనందున, ఆత్మతత్త్వప్రతిపాదనము వ్యర్థము అనినచో, అట్లు కాదు.

## సిద్ధాన్తబిన్దుః

చిద్భాస్యత్వేన లక్షణేన ఇదఙ్కారాస్పదానామపి దేహేంద్రియ మనసాం ప్రతిభాసతః అహఙ్కారాస్పదత్వేన తదవివేకాత్। తేన చ శుద్ధేఽపి ఆత్మని దుఃఖిత్వాద్యభిమానాత్ శాస్త్రీయేణ చ బ్రహ్మాత్మైక్యజ్ఞానేన సమూలస్య తస్య నివృత్తేః। తస్మాత్ అజ్ఞాతజ్ఞాపకత్వాత్ సప్రయోజనత్వాచ్చ ఆత్మతత్త్వ ప్రతిపాదనం న వ్యర్థమ్।

## భావదీపిక

'అహమ్' అను ప్రత్యయములో ఆత్మతత్త్వము స్పష్టముగా గోచరమగుటలేదు. దృశ్యములగు అనాత్మపదార్థములైన దేహేంద్రియ మనస్సులు జడము లగుటచే 'చిద్భాస్యత్వమ్' చేతనముచే ప్రకాశింపబడుట అను లక్షణముచే 'ఇదమ్' ప్రత్యయమునకు యోగ్యములైనను,

'అహం మనుష్యః, పశ్యామి, సంకల్పయామి'

నేను మనుష్యుడను, చూచుచున్నాను, సంకల్పించుచున్నాను అను ప్రతీతి వలన, 'అహమ్' ప్రత్యయములో గోచరములగుచున్నవి. అందుచేత ఆత్మ, శుద్ధమైనను 'అహం దుఃఖీ' నేను దుఃఖమును అనుభవించుచున్నాను అనెడి అనుభవమునకు లోనగుచున్నది. శాస్త్రముచేత 'అయమాత్మా బ్రహ్మ' అని బ్రహ్మాత్మైక్యజ్ఞానము

చేత అజ్ఞానమూలకమగు దుఃఖము నివర్తించుటచే ఆత్మకు బ్రహ్మ స్వరూపము అదివఱకు తెలియబడుచున్నది. అందువలన, ఆత్మ తత్త్వ ప్రతిపాదనము వ్యర్థము కానేరదు.

సిద్ధాన్తబిన్దుః

తస్య చ ఆత్మతత్త్వస్య 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది వేదాన్తమహావాక్యమేవ ప్రమాపకమ్ । వాక్యం చ పదార్థ జ్ఞానద్వారేణైవ జ్ఞాపకమితి 'తత్త్వం' పదార్థయోః, ప్రకృత వాక్యార్థానుకూలయోః అన్యతః అసిద్ధత్వాత్ తావపి శాస్త్రేణైవ ప్రమాతవ్యౌ। యూపాహవనీయాది పదార్థవత్।

భావదీపిక

ఆ ఆత్మతత్త్వమునకు (యథార్థస్వరూపమునకు) 'తత్త్వమసి', 'అహం బ్రహ్మాస్మి' మొదలగు వేదాన్తమహావాక్యమే ప్రమాణము (యథార్థవాక్యజనకము). వాక్యము, పదార్థజ్ఞానము ద్వారా వాక్యార్థబోధకము. కనుక 'తత్త్వమసి'అను మహావాక్యము నందు బ్రహ్మాత్మైక్య లక్షణమగు వాక్యార్థమునకు అనుకూలముగా 'తత్' పదార్థ, 'త్వం' పదార్థముల యొక్క జ్ఞానము అవశ్యకమై యున్నది. కాని, ఈ 'తత్త్వం' పదార్థములు లోకప్రసిద్ధములు కావు. కర్మకాండయందు

''యూపం తక్షతి', 'యూపే పశుం బధ్నాతి', 'ఆహవనీయే జుహోతి''

మొదలగు వాక్యములందు యూపస్తంభ, ఆహవనీయాగ్ని పదార్థములు శాస్త్రము (వేదము) చేతనే తెలియబడినట్లు, జ్ఞానకాండ యందు ఈ 'తత్త్వమ్' పదార్థములు కూడ, శాస్త్రముచేతనే తెలియ దగియున్నవి.

## సిద్ధాన్తబిన్దుః

తతశ్చ 'యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి' ఇత్యాద్యాః సృష్ట్యాదిశ్రుతయః 'తత్'పద వాచ్యార్థస్య సమర్పికాః। 'సత్యం జ్ఞాన మనన్తమ్' ఇత్యాదయస్తు లక్ష్యార్థస్య। ఏవం జాగ్రత్స్వప్నసుషుప్త్యాది శ్రుతయః తద్యథా 'మహామత్స్యః ఉభే కూలే అనుసంచరతి పూర్వం చ అపరం చ। ఏవమేవ అయం పురుషః ఏతావుభావన్తౌ అనుసఞ్చరతి స్వప్నాన్తం చ బుద్ధాన్తం చ' ఇత్యాద్యాః 'త్వం' పదవాచ్యార్థస్య సమర్పికాః। 'యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది అన్తర్జ్యోతిః పురుషః, న దృష్టేః ద్రష్టారం పశ్యేః' ఇత్యాదయస్తు లక్ష్యార్థస్య।

## భావదీపిక

అందువలన, 'తత్'పదవాచ్యార్థ, లక్ష్యార్థములు 'త్వం'పద వాచ్యార్థ, లక్ష్యార్థములు శ్రుతిమూలకములుగా తెలియజేయబడుచున్నవి. 'యతో వా ఇమాని భూతాని జాయన్తే' మొదలగు జగత్సృష్టి, స్థితి సంహార శ్రుతులు 'తత్' పదవాచ్యార్థమును సమర్పించును. జగత్ సృష్టి, స్థితి, లయకారణము వాచ్యార్థము. 'సత్యం జ్ఞాన మనన్తమ్' మొదలగు శ్రుతులు 'తత్' పదలక్ష్యార్థమును సమర్పించును. ఇదేవిధముగా, జాగ్రత్, స్వప్న, సుషుప్తి శ్రుతులు 'తద్యథా మహామత్స్యః' మొదలైనవి (ఒక మహామత్స్యము నదియొక్క ఇవతలి ఒడ్డునకు, అవతలి ఒడ్డునకు సంచరించు విధముగా ఈ పురుషుడు (జీవుడు) జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను అనుభవించి, తిరిగి జాగ్రనాది అవస్థలకు వచ్చును. 'త్వం'పదవాచ్యార్థమును సమర్పించును.

''యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది అన్తర్జ్యోతిః
పురుషః న దృష్టేః ద్రష్టారం పశ్యేః ।''

విజ్ఞానమయుడగు ఈ శుద్ధ జీవుడు ప్రాణ (ఇంద్రియ మనో బుద్ధి) వ్యతిరిక్తుడు; హృదయదేశమున, లోపల ప్రకాశించునట్టి పురుషుడు. దృష్టిని చూచువానిని – దృష్టియొక్క ద్రష్టను – సాక్షిని – నిత్య దృష్టిని చూడలేవు మొదలగు శ్రుతులు 'త్వం' పదలక్ష్యార్థమును సమర్పించును.

### సిద్ధాన్తబిన్దుః

తేన ప్రథమం అవాన్తరవాక్యేభ్యః అనుభూతయోః శుద్ధయోః జీవబ్రహ్మణోః తత్త్వమస్యాది వాక్యే ముఖ్యార్థ అన్వయానుపపత్త్యా లక్షణయా స్మరణోపపత్తిః । సుషుప్తౌ నిర్వికల్పక సాక్షిచైతన్యానుభవాంగీకారాచ్చ। అద్వితియబ్రహ్మ జిజ్ఞాపయిషయా ప్రవృత్తానాం సత్యజ్ఞానాదిపదానాం ఉపాధివిశిష్ట చైతన్యే శక్తత్వేఽపి చైతన్యమాత్రే తాత్పర్యేణ తత్రైవ తదంశే ఏవ సంస్కారోద్బోధాశ్చ ।

ఇచ్ఛన్తి హి ఆకాశాదిపదాదపి నిర్వికల్పకం స్మరణం తాత్పర్యాధీనత్వాత్ శబ్దవృత్తేః ।

### భావదీపిక

వాక్యార్థబోధకు పదార్థోపస్థితి (స్మరణము) కారణము. 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములకు నిర్వికల్పక అఖణ్డ మహావాక్యార్థబోధ అజ్ఞాననివర్తకము, ఇష్టము. నిర్వికల్పక వాక్యార్థబోధకు నిర్వికల్పక పదార్థస్మృతియే, కారణమై యున్నది. మొదట, అవాంతర వాక్యముల వలన, సవికల్పక వాచ్యార్థోపస్థితి

కలుగును. తరువాత, లక్ష్యార్థస్థితి కలుగును. 'తత్త్వమసి' మహా వాక్యములో తత్పదవాచ్యార్థమునకు, 'త్వం'తిదవాచ్యార్థమునకు అభేదాన్వయము కుదరదు గనుక, లక్ష్యార్థముయొక్క స్మరణము నిర్వికల్పము ప్రకృత వాక్యార్థమునకు అనుకూలముగా కలుగు చున్నది. సుషుప్తియందు నిర్వికల్పక సాక్షిచైతన్యానుభవము అంగీకరింపబడుచున్నది. సత్యజ్ఞానాదిపదములు సత్యత్వ జ్ఞానత్వాది చైతన్యమునందు శక్తి కలవి అయినను, అద్వితీయ బ్రహ్మబోధనార్థము ప్రవృత్తములగుటచే కేవల శుద్ధ చైతన్యము నందు తాత్పర్యముచేత శుద్ధ చైతన్యాంశమునందే, సంస్కారము ఉద్బుద్ధము అగుచున్నది.

పదములవలన, నిర్వికల్పక పదార్థస్మరణము కలుగనేరదు అని శఙ్కించరాదు. మణికారాదులు ఆకాశపదము వలన నిర్వికల్పక స్మరణమును అంగీకరించి ఉన్నారు. శబ్దవృత్తి, తాత్పర్యము ననుసరించి ప్రసరించును.

కనుక, మహావాక్యములందు నిర్వికల్పక పదార్థస్మరణ పూర్వకముగా నిర్వికల్పక మహావాక్యార్థబోధ కలుగుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

ఏతేన ప్రమితి ప్రమాత్రోః మహావాక్యార్థబోధే భాన మపాస్తమ్। అసంప్రజ్ఞాత సమాధేః శ్రుతిస్మృతిసిద్ధత్వాచ్చ ఇతి।

పారోక్ష్య సద్వితీయత్వాభ్యాం చ న తత్త్వం పదార్థ మాత్రానుభవాదేవ కృతకృత్యతా। వాచ్యార్థ భేదావభాసాచ్చ న పౌనరుక్త్యమ్। లక్ష్యస్య చార్థస్య చ ఏకత్వాత్ అఖణ్డార్థతా। పదజన్యస్య స్మరణస్య నిర్వికల్పక వాక్యార్థానుకూలస్య నిర్వికల్పకత్వం అనుభవాదేవ అవిరుద్ధమ్ ।

## భా వ దీ పి క

తాత్పర్యము ననునరించి మహావాక్యార్థజ్ఞానము కలుగును గనుక, మహావాక్యార్థబోధలో ప్రమితి గాని, ప్రమాత గాని, (సవికల్పకమైనది) భాసించుట నిరాకరింపబడినది. అసంప్రజ్ఞాత సమాధి శ్రుతి, స్మృతిసిద్ధము, నిర్వికల్పకముగా ప్రసిద్ధము.

'తత్'పద, 'త్వం' పదముల రెంటిలోను శుద్ధ చైతన్యమే, లక్ష్యార్థ మగుటచేత 'పదాన్తం ప్రతిపదార్థ ప్రతిపాదకత్వమ్'అను పునరుక్తిదోషమును శజ్కించరాదు. 'తత్' పద 'త్వం'పదవాచ్యార్థ ములు భిన్నములు గనుక, పునరుక్తిదోషము లేదు. లక్ష్యార్థము ఒకటియే అయినపుడు, 'తత్, త్వం' పదములలో ఒకటియే చాలునుగదా! అను శజ్కయు, యుక్తము కాదు. కేవల 'తత్' పదమునే ప్రయోగించినచో, బ్రహ్మ, పరోక్షముగా భాసించును. కేవల 'త్వం' పదమునే ప్రయోగించినచో, సద్వితీయత్వము (రెండవ వస్తువు ఉన్నది అను భావము) కలుగును. కనుక, 'తత్, త్వం' పదములు రెండును ఆవశ్యకములైనవి. లక్ష్యార్థమగు చైతన్యము అఖండము, ఏకము గనుక, వాక్యము అఖండార్థకము. మహావాక్యములందు పదజన్యస్మరణము నిర్వికల్పముగా అనుభవ సిద్ధము. ఈ నిర్వికల్పక పదార్థస్మరణ వలననే, బ్రహ్మాత్మైక్య లక్షణ అఖండ వాక్యార్థబోధ కలుగుచున్నది.

## సి ద్ధా న్త బి న్దుః

సవికల్పక వాక్యార్థబోధే చ సవికల్పక పదార్థోపస్థితిః అఙ్గమ్। నిర్వికల్పక వాక్యార్థబోధే చ నిర్వికల్పక పదార్థోపస్థితిః అఙ్గమ్

ప్రకృతే చ నిర్వికల్పకో వాక్యార్థబోధః। తస్యైవ ప్రమాత్వేన అజ్ఞాననివర్తన సామర్థ్యాత్। అతః న లక్ష్యతావచ్ఛేదక మన్తరేణ లక్షణానుపపత్తిః। ప్రకృత వాక్యార్థానుకూల పదార్థోపస్థితేరేవ శక్తిలక్షణసాధ్యత్వాత్।

## భావదీపిక

'సప్రకారకం జ్ఞానం సవికల్పకమ్, నిష్ప్రకారకం జ్ఞానం నిర్వికల్పకమ్।'

ప్రకారము అనగా, విశేషణము. విశేషణత, విశేష్యత, సంసర్గత అని విషయత త్రివిధము. విషయతానిరూపకము జ్ఞానము. ఏ జ్ఞానమందు ఈ విశేషణతా, విశేష్యతాదులు ఆశించబడునో, అది సవికల్పక జ్ఞానము.'అయం ఘటః' ఇది ఘటము అను జ్ఞానములో ఘటము విశేష్యము, ఘటత్వము విశేషణము, సమవాయము సంసర్గము. ఇది సవికల్పక జ్ఞానము. 'అయమాత్మా బ్రహ్మ', 'తత్త్వమసి' మొదలగు మహావాక్యార్థబోధలో ఆత్మయందు విశేష్యత గాని, విశేషణత గాని, భాసించదు. సంసర్గత అసలే భాసించదు. కనుక, అఖణ్డబ్రహ్మాత్మాకార చరమవృత్తిజ్ఞానము నిర్వికల్పకము. ఈ జ్ఞానము చేతనే, అజ్ఞానము నివర్తించును. వాక్యార్థబోధ నిష్ప్రకారక మగుటచే పదార్థోపస్థితియు (స్మరణయు) నిష్ప్రకారకముగానే తాత్పర్యానుసారముగా అంగీకరింపబడుచున్నది. లోకమునందు పదార్థోపస్థితి సవికల్పక వాక్యార్థబోధతా శక్యతావచ్ఛేదక పరిచ్ఛేదముగా గాని, లక్ష్యతావచ్ఛేదక పరిచ్ఛేదముగా గాని ఉండును, వేదాన్తమహావాక్యములందు అట్లు కాదు. మహావాక్యములందు విశిష్టముగాని, సంసర్గము గాని, వాక్యార్థము కాదు.

వాక్యమువలన, బ్రహ్మాత్మానుభవము వాక్యార్థబోధగా అంగీకరింపబడుచున్నది.

మహావాక్యములందు 'అహం బ్రహ్మాస్మి' అని మొదట, విశిష్టబోధ, తరువాత, ఉపలక్షితబోధ, పిమ్మట, అఖండార్థబోధ కలుగుచున్నది. ఈ బోధచేతనే 'నాహం బ్రహ్మ', 'అహమజ్ఞః' మొదలగు భేదప్రతీతి, అజ్ఞానము నశించుచున్నవి.

## సి ద్ధా న్త బి న్దుః

నను, తర్హి వేదాన్తవాక్యేభ్య ఏవ పదార్థోపస్థితౌ వాక్యార్థ బోధే చ సతి, తస్య స్వత ఏవ ప్రామాణ్యాత్ తేన అజ్ఞాన తత్కార్య నివృత్త్యుపపత్తౌ కిం విచారేణ? ఇతి చేత్, సత్యమ్। వేదాన్తాః యద్యపి స్వతః ప్రామాణ్యాత్ నిర్వికల్పకం ఆత్మసాక్షాత్కారం జనయన్తి, తథాఽపి తస్య మన్దబుద్ధీనాం వాదివిప్రతిపత్తిజ సంశయప్రతిబంధేన అజ్ఞాన నాశకత్వసామర్థ్యాత్। విచారేణ తు సంశయనివృత్తౌ నిరపవాదం అజ్ఞాననివృత్తిః ఇతి సంశయబీజ భూతవాది విప్రతిపత్తినిరాసార్థం విచారః ఆరభ్యతే।

## భా వ దీ పి క

ఓయీ ! వేదాన్తవాక్యము వలననే, నిర్వికల్పకపదార్థోపస్థితి, నిర్వికల్పక వాక్యార్థబోధయు కలుగగా, వేదములు స్వతః ప్రమాణములు గనుక, ఉపనిషద్వాక్యములచేతనే అజ్ఞానము, అజ్ఞాన కార్యములు నివర్తించుట సంభవము గాన, బ్రహ్మ విచారాత్మకమగు వేదాన్తమీమాంసాశాస్త్రముతో(బ్రహ్మసూత్రములతో) గాని, ఈ ప్రకరణగ్రంథములతోగాని, విచారము ఎందులకు? అని

ప్రశ్నించినచో, నిజమే. ఎవరికో ఈశ్వరకృపాకటాక్షము గల వారికి విచారశాస్త్రముతో పని లేకయే, కేవల వేదాన్తవాక్యముల వలన కలిగిన జ్ఞానముచేతనే, అజ్ఞాన, తత్కార్యములు నశించును. అట్లయినను. కొందఱు మందబుద్ధులు, వాది విప్రతిపత్తివాక్యముల వలన (విరుద్ధార్థ ప్రతిపాదక వాక్యద్వయం విప్రతిపత్తిః) సంశయగ్రస్తులగుటచే వారికి ఆ సంశయప్రతిబంధముచేత వేదాన్తవాక్యజన్య జ్ఞానము అజ్ఞానమును నశింపజేయునట్టి సామర్థ్యము గలది కాదు. అపుడు, ఈ విచారము (శాస్త్రము, ప్రకరణగ్రంథములు) వారి సంశయమును తొలగించును. అపుడు, ప్రతిబంధము తొలగిపోయినది గావున, వేదాన్తవాక్యజన్యజ్ఞానము నిరాటంకముగా అజ్ఞానమును నివర్తింపజేయుగలుగును. కనుక, సంశయమూలకారణమగు వాదివిప్రతిపత్తిని నిరసించుటకొఱకు విచారము ఆరంభింపబడుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

తత్ర 'త్వం' పదార్థే ప్రథమం విప్రతిపత్తయః ప్రదర్శ్యన్తే। 'తత్'పదార్థస్య శాస్త్రతాత్పర్యవిషయతయా అభ్యర్హితత్వేఽపి 'త్వం'పదార్థస్య శాస్త్రఫల మోక్షభాగితయా తతోఽపి అభ్యర్హితత్వాత్। తత్ర దేహాకారేణ పరిణతాని చత్వారి భూతాన్యేవ 'త్వం' పదార్థః ఇతి చార్వాకాః। చక్షురాదీని ప్రత్యేకమ్ ఇత్యపరే। మిలితానీతి అన్యే। మనః (ఇతి) ఏకే। ప్రాణః ఇత్యపరే। క్షణికం విజ్ఞానమితి సుగతాః। శూన్యమితిమాధ్యమికాః। దేహేన్ద్రియాతిరిక్తః దేహపరిమాణః ఇతి దిగంబరాః। కర్తా భోక్తా జడః విభుః ఇతి వైశేషిక తార్కిక ప్రాభాకరాః। జడబోధాత్మకః ఇతి భాట్టాః।

భోక్తైవ కేవల బోధాత్మకః ఇతి సాంఖ్యాః పతఞ్జలిశ్చ। అవిద్యయా కర్తృత్వాదిభాక్ పరమార్థతః నిర్ధర్మకః పరమానంద బోధరూప ఏవ ఇతి ఔపనిషదాః। ఏవం సామాన్యతః అహం ప్రత్యయసిద్ధే చిదాత్మని వాదివిప్రతిపత్తిభిః సందిగ్ధే అహం ప్రత్యయస్య ఆలంబనవిశేషనిర్ణయాయ ఆహ భగవాన్ ఆచార్యః।

భా వ దీ పి క

ఆ విచారమున, 'తత్త్వమసి' వాక్యమునందు మొదట 'త్వం'పదార్థమునందు విప్రతిపత్తులు ప్రదర్శింపబడుచున్నవి. మొదట, 'తత్'పదము ఉన్నది. ఆ 'తత్'పదార్థము శాస్త్రతాత్పర్య విషయమగు బ్రహ్మ అగుటచే, అభ్యర్హితము. మిక్కిలి ఇష్టమై స్వీకరింపదగినది. అయినను, 'త్వం'పదార్థమగు జీవుడే, శాస్త్రఫల మగు మోక్షమును అనుభవించువాడగుటచే అంతకంటె గూడ, అభ్యర్హితుడు, ఆదరముతో స్వీకరింపదగినవాడు అగుచున్నాడు.

అందు, చార్వాకులు దేహాకారముగా పరిణమించిన పృథివ్యప్తేజోవాయురూపములగు నాలుగు భూతములే, 'త్వం' పదార్థము అని చెప్పుదురు. చక్షుస్సు మొదలగు ఇంద్రియములు ఒక్కొక్కటి 'త్వం'పదార్థము అని కొందఱు అందురు. మఱి కొందఱు చక్షురాదీంద్రియములు అన్నియు కలసి 'త్వం' పదార్థము అని చెప్పుదురు. మనస్సే 'త్వం' పదార్థము అని కొందఱు; ప్రాణమని మఱికొందఱు ; క్షణికవిజ్ఞానమని యోగాచార్యులు (సుగతులు); శూన్యమని మాధ్యమికులు; దేహేన్ద్రియవ్యతిరిక్తము, దేహపరిమాణము గలది అని దిగంబరులు (జైనులు) వచించుచున్నారు. వైశేషికతార్కికులు, ప్రాభాకర

ప్రశ్నించినచో, నిజమే. ఎవరికో ఈశ్వరకృపాకటాక్షము గల వారికి విచారశాస్త్రముతో పని లేకయే, కేవల వేదాన్తవాక్యముల వలన కలిగిన జ్ఞానముచేతనే, అజ్ఞాన, తత్కార్యములు నశించును. అట్లయినను, కొందఱు మందబుద్ధులు, వాది విప్రతిపత్తివాక్యముల వలన (విరుద్ధార్థ ప్రతిపాదక వాక్యద్వయం విప్రతిపత్తిః) సంశయగ్రస్తులగుటచే వారికి ఆ సంశయప్రతిబంధముచేత వేదాన్తవాక్యజన్య జ్ఞానము అజ్ఞానమును నశింపజేయునట్టి సామర్థ్యము గలది కాదు. అపుడు, ఈ విచారము (శాస్త్రము, ప్రకరణగ్రంథములు) వారి సంశయమును తొలగించును. అపుడు, ప్రతిబంధము తొలగిపోయినది గావున, వేదాన్తవాక్యజన్యజ్ఞానము నిరాటంకముగా అజ్ఞానమును నివర్తింపజేయగలుగును. కనుక, సంశయమూలకారణమగు వాదివిప్రతిపత్తిని నిరసించుటకొఱకు విచారము అరంభింపబడుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

తత్ర 'త్వం' పదార్థే ప్రథమం విప్రతిపత్తయః ప్రదర్శ్యన్తే। 'తత్'పదార్థస్య శాస్త్రతాత్పర్యవిషయతయా అభ్యర్హితత్వేఽపి 'త్వం'పదార్థస్య శాస్త్రఫల మోక్షభాగితయా తతోఽపి అభ్యర్హితత్వాత్। తత్ర దేహాకారేణ పరిణతాని చత్వారి భూతాన్యేవ 'త్వం' పదార్థః ఇతి చార్వాకాః। చక్షురాదీని ప్రత్యేకమ్ ఇత్యపరే। మిలితానీతి అన్యే। మనః (ఇతి) ఏకే। ప్రాణః ఇత్యపరే। క్షణికం విజ్ఞానమితి సుగతాః। శూన్యమితిమాధ్యమికాః। దేహేన్ద్రియాతిరిక్తః దేహపరిమాణః ఇతి దిగంబరాః। కర్తా భోక్తా జడః విభుః ఇతి వైశేషిక తార్కిక ప్రాభాకరాః। జడబోధాత్మకః ఇతి భాట్టాః।

భో క్తైవ కేవల బోధాత్మకః ఇతి సాంఖ్యాః పతఞ్జలిశ్చ। అవిద్యయా కర్తృత్వాదిభాక్ పరమార్థతః నిర్ధర్మకః పరమానంద బోధరూప ఏవ ఇతి ఔపనిషదాః । ఏవం సామాన్యతః అహం ప్రత్యయసిద్ధే చిదాత్మని వాదివిప్రతిపత్తిభిః సందిగ్ధే అహం ప్రత్యయస్య ఆలంబనవిశేషనిర్ణయాయ ఆహ భగవాన్ ఆచార్యః।

## భా వ దీ పి క

ఆ విచారమున, 'తత్త్వమసి' వాక్యమునందు మొదట 'త్వం'పదార్థమునందు విప్రతిపత్తులు ప్రదర్శింపబడుచున్నవి. మొదట, 'తత్'పదము ఉన్నది. ఆ 'తత్'పదార్థము శాస్త్రతాత్పర్య విషయమగు బ్రహ్మ అగుటచే, అభ్యర్హితము. మిక్కిలి ఇష్టమై స్వీకరింపదగినది. అయినను, 'త్వం'పదార్థమగు జీవుడే, శాస్త్రఫల మగు మోక్షమును అనుభవించువాడగుటచే అంతకంటె గూడ, అభ్యర్హితుడు, ఆదరముతో స్వీకరింపదగినవాడు అగుచున్నాడు.

అందు, చార్వాకులు దేహాకారముగా పరిణమించిన పృథివ్యప్తేజోవాయురూపములగు నాలుగు భూతములే, 'త్వం' పదార్థము అని చెప్పుదురు. చక్షుస్సు మొదలగు ఇంద్రియములు ఒక్కొకక్కటి 'త్వం'పదార్థము అని కొందఱు అందురు. మఱి కొందఱు చక్షురాదీంద్రియములు అన్నియు కలసి 'త్వం' పదార్థము అని చెప్పుదురు. మనస్సే 'త్వం' పదార్థము అని కొందఱు; ప్రాణమని మఱికొందఱు ; క్షణికవిజ్ఞానమని యోగాచార్యులు (సుగతులు); శూన్యమని మాధ్యమికులు; దేహేన్ద్రియవ్యతిరిక్తము, దేహపరిమాణము గలది అని దిగంబరులు (జైనులు) వచించుచున్నారు. వైశేషికతార్కికులు, ప్రాభాకర

మీమాంసకులు 'త్వం'పదార్థము కర్త, భోక్త, జడము, విభువు అని తలంచుచున్నారు. భాట్టులైతే, 'త్వం'పదార్థము చిజ్జడస్వరూపము అందురు. కాపిల సాంఖ్యులు, పతంజలి 'త్వం'పదార్థము కేవల బోధాత్మకము; భోక్త; కర్త కాదు అని వచింతురు. ఔపనిషదులు ఈ 'త్వం'పదార్థము అవిద్యచేత కర్తృత్వ, భోక్తృత్వాదులు అనుభవించుననియు, వాస్తవముగా నిర్ధర్మకము – ఎట్టి ధర్మము లేనిది. పరమానందబోధ(చిత్ప్రకాశ) స్వరూపము అని నిరూపించు చున్నారు. ఈ విధముగా 'అహం' ప్రత్యయమున, సామాన్యముగా గోచరించు చిదాత్మ, వాదివిప్రతిపత్తివాక్యములచే సంశయమునకు గురి కాగా, 'అహం' ప్రత్యయమునకు ఆలంబనమగు వస్తుస్వరూప విశేషనిర్ణయము కొఱకు పూజ్యులగు శంకరభగవత్పాదులు 'న భూమిః న తోయమ్' మొదలుగా గల 'దశశ్లోకి'ని రచించినారు. అందు మొదటి శ్లోకము —

శ్లో॥ న భూమి ర్న తోయం న తేజో న వాయుః
న ఖం నేంద్రియం వా న తేషాం సమూహః।
అనైకాన్తికత్వాత్ సుషుప్త్యైకసిద్ధః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥౧॥

సిద్ధాన్తబిన్దుః

అస్యార్థః - అహమ్ అహంప్రత్యయాలంవనమ్, ఏకః అద్వితీయః, అవశిష్టః సర్వద్వైతబాధేఽపి అబాధితః, శివః పరమానన్దబోధరూపః తస్యైవ మంగళరూపత్వాత్, కేవలః। నిర్ధర్మకః, తేన అద్వితీయః సర్వప్రమాణాబాధ్యః పరమానన్దబోధ ఏవ అహం ప్రత్యయాలంబనమితి ఔపనిషదపక్ష ఏవ శ్రేయాన్

ఇత్యర్థః । ఏతదుపపాదనాయ ఇతరవాదిమతాని నిరాకరిష్యన్ ప్రథమం దేహాత్మవాదం నిరాకరోతి – న భూమిః న తోయం న తేజో న వాయుః న ఖం ఇతి ।

### భా వ దీ పి క

ఈ మొదటి శ్లోకమునకు అర్థము వివరింపబడుచున్నది. 'అహం' నేను అను ప్రతీతికి విషయమగు వస్తుస్వరూపము, ఏకః = అద్వితీయము. (రెండవది లేనిది). అవశిష్టః = సమస్త ద్వైత ప్రపంచము బాధింపబడినను, తాను బాధింపబడనిదై మిగిలి ఉండునది. శివః = పరమానన్దబోధరూపము. నిరతిశయ అనన్ద స్వరూపమ్ముగా ఉండు చిత్ప్రకాశము. లోకమున, 'శివ'పదము 'శివమ్ అస్తు' మంగళము అగుగాక అను అర్థములో ప్రయోగింపబడుచున్నది. అ మంగళము, ఇష్టమైనది, ఆనందము, చిత్ప్రకాశము. కేవలః = ఇదివఱకు రెండవ వస్తువు లేనిది అని చెప్పబడినను, ఉన్న ఒక వస్తువునకు ధర్మములు ఉండునను భావమును నిరాకరించుటకు 'కేవలః' అను పదము ప్రయుక్తము. ఏ ధర్మములును లేనిధి అని అర్థము. ఈ విధముగా అహం ప్రత్యయములో గోచరమగు వస్తువు, అద్వితీయ; సర్వప్రమాణాబాధ్య పరమానన్ద చిద్రూపమే అని ఔపనిషద పక్షము (ఉపనిషత్తులు ప్రమాణము అని అంగీకరించువారి పక్షము) మాత్రమే, ఆదరింపదగినది, ప్రశస్తమైనది అని అర్థము. విషయమును వివరముగా యుక్తులతో నిరూపించుటకొఱకు ఇతర వాదులయొక్క మతములను నిరాకరించుటకు పూనుకొని మొదట దేహాత్మవాదమును– శరీరమే ఆత్మ, అనునట్టి వాదమ్మును –

''న భూమిః న తోయం న తేజో న వాయుః న ఖమ్''
అను శ్లోకభాగముచే నిరాకరించుచున్నారు. ఇచట, 'అహమ్' అను పదమును ప్రతి వాక్యమునందును సంబంధింపజేసికొనవలయును.

## సిద్ధాన్తబిన్దుః

అత్ర అహమితి సర్వత్ర నఞా సంబధ్యతే। యా భూమిః సోఽహం న భవామి। యః అహం సః భూమిః న భవతి ఇతి చ పరస్పరతాదాత్మ్యాభావో ద్రష్టవ్యః। యద్యపి వాదినా ప్రత్యేకం భూమ్యాదిః ఆత్మత్వేన న అభ్యుపగమ్యతే, సంఘాతస్యైవ తదభ్యుపగమాత్। తథాఽపి తన్మతే అవయవ్యనంగీకారాత్ పంచమతత్త్వాభ్యుపగమప్రసజ్గత్వేన చ సంయోగాది సంబంధానభ్యుపగమాత్ సంహన్తురభావాచ్చ సంఘాతో నోపపద్యతే ఇతి అభిప్రేత్య ప్రత్యేకభూతనిరాకరణేన భౌతికదేహాత్మవాదః నిరాకృతః।

## భావదీపిక

'అహం'పదార్థవిచారణ జరుగుతున్నది. ఇందు మొదటివారు దేహాత్మవాదులు. శరీరమే, ఆత్మ. శరీరముకంటె వేఱుగా ఆత్మ అనునది లేదు అని వారి అభిప్రాయము. దీనికి ప్రవర్తకుడు చార్వాకుడు. 'చారు వక్తీతి చార్వాకః' మనోహరముగా లోకసమ్మతముగా చెప్పువాడు. భూమి, జలము, తేజస్సు, వాయువు అను నాలుగు భూతములే తత్త్వములు. ఆ భూతములనుండి పరిణమించిన కర,చరణ, శిరఃపర్యన్త సంఘాతము (అనేక పదార్థములతో గూడిన సముదాయము) 'అహమ్' అని వ్యవహరింపబడుచున్నదని వాని భావము.

ఈ శ్లోకమున, 'అహమ్' అని ఒక్కమారే ప్రయుక్తమై యున్నను, ప్రతి వాక్యమున, ఆ 'అహమ్' అను పదమును, 'నఞ్' తో చేర్చి అర్థమును చెప్పికొనవలయును. 'అహం న భూమిః' భూమి ఏదికలదో అది నేను కాను. అహం పదార్థము ఏది కలదో, అది భూమి కాదు అనురీతిగా పరస్పరము తాదాత్మ్యము లేదు అని గ్రహించవలయును. ఇచట, ఒక విషయమును గ్రహించవలయును. దేహాత్మవాది, భూమి ఆత్మ, జలము ఆత్మ, తేజస్సు ఆత్మ, వాయువు ఆత్మ అని చెప్పిఉండలేదు. ఇచట, అహం పదార్థము ఆ ప్రత్యేక భూతములు కావని నిరాకరింప బడుచున్నది. ఏలననగా, ఆ దేహాత్మవాది అవయవములకంటె వేఱుగా అవయువిని అంగీకరించడు. ఆకాశమను భూతము గూడ, అతనిచే అంగీకరింపబడలేదు. అందువలన,ఆకాశము లేని అవయవ సంయోగము చెప్పుటకు వీలులేదు గనుక, అవయవి పుట్టనేరదు. అవయవుల సంయోగము గూడ, అంగీకరింపబడలేదు. కనుక, సముదాయము గూడ, లేదు. ఇదిగాక, కొన్ని పదార్థములు ఒకచోట చేరుటకు ఆ పదార్థ సముదాయములో చేరనివాడు సంహంత (చేర్చువాడు) ఒకడు ఉండవలెను. ఆ సంహంత గూడ, అతనిచే అంగీకరింపబడలేదు. దీనివలన, తేలిన పర్యవసాన మేమనగా, ప్రత్యేకభూతములే మిగిలి ఉన్నవి. దేహాదిసంఘాతము ఉపపన్నము (యుక్తిసహము) కాదను అభిప్రాయముతో ప్రత్యేక భూతనిరాకరణముతో, ఈ భౌతిక దేహాత్మవాదము నిరాకరింపబడినది.

## సిద్ధాన్తబిన్దుః

యద్యపి భూతచతుష్టయ తత్త్వవాదినో మతే ఆవరణాభావత్వేన అభిమతస్య స్థిరస్య అసతః ఆకాశస్య దేహ అనుపాదానత్వమ్। తథాఽపి సిద్ధాన్తే తస్య భావత్వమ్- దేహోపాదానత్వాది అంగీకారాత్। తత్రాపి ఆత్మత్వప్రసక్త్యా తత్ నిరాకృతమ్। అథవా, న వాయుః ఇత్యన్తమేవ దేహాత్మవాదస్య నిరాకరణమ్। 'న ఖం' ఇతి తు శూన్యవాదస్య। 'ఖ' శబ్దస్య శూన్యవాచకత్వాత్।

## భావదీపిక

చార్వాకమతమున, నాలుగు భూతములనే నాలుగు తత్త్వములుగా (పదార్థములుగా) అంగీకరించుటవలన, ఆకాశభూతము 'అహం' పదార్థము కాదని నిరాకరించుట ప్రసక్తము కాదు. చార్వాకుడు ఆవరణాభావమే, ఆకాశము అని అనును. అభావము వస్తువు కాదు, నిఃస్వరూపము (స్వరూపము లేనిది), అసత్తు (లేనిది). ఆకాశమే లేనప్పుడు, అది దేహమునకు ఉపాదానకారణము కానేరదు.

అయినను, ఉపనిషత్సిద్ధాన్తమున, ఆకాశము అయిదవ భూతము, భావపదార్థముగా దేహాదులకు ఉపాదానకారణము అని అంగీకరించుటవలన, జిజ్ఞాసువులకు ఆకాశమునందు గూడ, ఆత్మత్వము (అహం పదార్థత్వము) ప్రసక్తము కాగా, 'న ఖమ్' ఆకాశము గూడ, ఆత్మ కాదు అని చెప్పబడినది.

మఱియొక పక్షము చెప్పబడుచున్నది. 'న వాయుః' అను పర్యంతమే, దేహాత్మవాద నిరాకరణము. 'న ఖమ్' అనునది 'ఖ'

శబ్దార్థము శూన్యమగుటచే, ('ఆకాశం గగనం శూన్యమ్') శూన్యమే, తత్త్వ మను మాధ్యమికుల (బౌద్ధుల) వాదము నిరాకరింపబడినది.

### సి ద్ధా న్త బి న్దుః

నేంద్రియమితి ప్రత్యేకం ఇంద్రియాణాం ఆత్మత్వ నిరాసః। న తేషాం సమూహ ఇతి మిలితానాం భూతానాం దేహ అవయవ్యాకారేణ పరిణతానాం ఇంద్రియాణాం చ మిలితానాం నిరాసః। పూర్వం సంఘాతం అనభ్యుపగమ్య ప్రత్యేకం భూతాని నిరాకృతాని। అధునా తు సంఘాతం అభ్యుపగమ్యాపి నిరాకృతానీతి భేదః। భూతనిరాకరణేన భౌతికయోః ప్రాణ మనసోః నిరాసః। మనో నిరాకరణేన మనోవృత్తేః క్షణికవిజ్ఞానస్య దేహాతిరిక్తస్య కర్తృత్వ భోక్తృత్వవిశిష్టస్య నిరాసః। సిద్ధాన్తే జ్ఞానేచ్ఛా సుఖాదీనాం అన్తఃకరణాశ్రయత్వాభ్యుపగమాత్। కామ సంకల్పాదీన్, ప్రకృత్య ఏతత్సర్వం మన ఏవ ఇతి శ్రుతేః। తేన దేహమారభ్య కేవల భోక్తృపర్యన్తానాం తత్త్వాది అభ్యుపగతానాం అనాత్మత్వం ప్రతిజ్ఞాతం భవతి।

### భా వ దీ పి క

'నేంద్రియం వా' అను వచనముచే చక్షురాదింద్రియములు ప్రత్యేకముగా అహం పదార్థము (ఆత్మ) కావని నిరసింపబడినది. 'న తేషాం సమూహః' అను వచనముచే పంచభూతములు మిళితములై దేహము అను అవయవి ఆకారముగా పరిణమించును అనెడి వాదము, చక్షుశ్శ్రోత్రాది ఇంద్రియము లన్నియు మిళితములై అహం పదార్థము (ఆత్మ) అగుచున్నవను వాదము

నిరసింపబడుచున్నది. పూర్వము సంఘాతమును ఒప్పుకొనక, ప్రత్యేక భూతములు ఆత్మ కాదని నిరాకరింపబడినవి. ఇప్పుడైతే, సంఘాతమును ఒప్పుకొని గూడ, మిళితములగు భూతములు ఇంద్రియములు అహం పదార్థమగు ఆత్మ కావు అని నిరాకరింపబడినవని భేదము. ఈ భూతనిరాకరణముచేతనే, భౌతికములగు ప్రాణ, మనస్సులు గూడ, అహం పదార్థము అగు ఆత్మ కావు అని చెప్పినట్లైనది. మనస్సు, ఆత్మ కాదని నిరాకరించుటచేతనే, మనోవృత్తిఅగు క్షణికవిజ్ఞానము ఆత్మ కాదనియు, దేహముకంటె వేఱై, కర్తృత్వ, భోక్తృత్వాది ధర్మములు కలది (అహంకారము) ఆత్మ కాదనియు, నిరాకరింపబడినది.

సిద్ధాన్తమున జ్ఞానము, ఇచ్ఛ, సుఖము మొదలగునవి అంతఃకరణమును (మనోబుద్ధి చిత్తాహంకారములు) ఆశ్రయించునని అంగీకరింపబడినది.

''కామః సంకల్పః విచికిత్సా ఏతత్సర్వం మన ఏవ''

అను శ్రుతి, జ్ఞానేచ్ఛా సుఖాదులు, మనోవృత్తులని పేర్కొనినది. అందుచేత ఇంతవఱకు దేహము మొదలుకొని, కేవల భోక్త అహం పదార్థము ఆత్మయని ఆ యా వాదులు అంగీకరించిన దేహ, ఇంద్రియ, ప్రాణ, మనః, క్షణికవిజ్ఞాన, శూన్య, అహంకార, కేవల భోక్తలు ఆత్మ కావు అని ప్రతిజ్ఞ చేయబడినది.

## సిద్ధాన్తబిన్దుః

తత్ర హేతుమాహ। అనైకాన్తికత్వాదితి వ్యభిచారిత్వాత్ వినాశిత్వాదితి యావత్। ఆత్మనః దేశ కాల అపరిచ్ఛిన్నత్వాత్ తత్ పరిచ్ఛిన్నానాం ఘటాదివత్ అనాత్మత్వాత్। ధ్వంస

ప్రాగభావయోశ్చ గ్రహీతుం అశక్యత్వాత్। అనాత్మనాం జడత్వాత్ స్వభిన్నస్య చ ఆత్మత్వాభావాత్। ఆత్మనః ఏకత్వేఽపి సుఖ దుఃఖాద్యాశ్రయాణాం అన్తఃకరణానాం వేదాభ్యుపగమాత్ వ్యవస్థోపపత్తేః। స్వస్యైవ స్వాభావాగ్రహణే విరోధాత్ గ్రాహ్యకాలే గ్రాహక అసత్వాత్, గ్రాహకసత్వే గ్రాహ్యాభావాత్ కృతహాని అకృతాభ్యాగమ ప్రసఙ్గాచ్చ, న తస్య ధ్వంస ప్రాగభావౌ। సద్రూపస్య ఆత్మనః సర్వత్ర అనుగమాచ్చ న అత్యన్తాభావ సంభవః। ద్వైతస్య మిథ్యాత్వేన అధిష్ఠాన సత్తాదాత్మ్యాపన్నత్వైవ సిద్ధత్వాత్ శుక్తిరజతాదివత్ అధ్యస్తస్య తత్తాదాత్మ్యాభావా నుపపత్తేః। తేన ఆత్మా న అభావప్రతియోగీ అభావప్రతి యోగినశ్చ దేహేంద్రియాదయః తేన అమీ నాత్మానః। కింతు స్వప్రకాశబోధరూపాఖ్యే ఆత్మని అద్వైతేఽపి అనాది అనిర్వచ నీయఅవిద్యాకల్పితాః అనిర్వచనీయా ఏవ ఇతి సిద్ధాన్తరహస్యమ్।

## భావదీపిక

దేహేంద్రియ, శూన్య, క్షణికవిజ్ఞాన, అహంకారాదులు అహం ప్రత్యయాలంబనమగు ఆత్మ కావు అనుటకు హేతువును 'అనైకాన్తికత్వాత్' అని తెలుపుచున్నారు. ఏకాన్తికము అనగా, ఎల్లప్పుడు ఉండునది. అనైకాన్తికము కొంతకాలము మాత్రమే ఉండునది, నశించునది. ఆత్మ, దేశపరిచ్ఛేదము, కాలపరిచ్ఛేదము లేనిది. ఒకచోట ఉండి, మఱియొకచోట లేనిది కాదు. భూత, భవిష్య ద్వర్తమానకాలములలో ఒక కాలమునందు ఉండి, మఱి యొక కాలమునందు ఉండనిది కాదు. ఘట పటాది పదార్థములు దేశ, కాల పరిచ్ఛిన్నములు. అనగా, ఒక దేశమునందు, ఒక

కాలమునందు మాత్రమే ఉండునవి. అవి ఆత్మ కానేరవు. ఆత్మ, సర్వదేశ, సర్వకాలములందు ఉండునది. ఆత్మకు, ఘటాదులకు వలె ధ్వంసము గాని, ప్రాగభావము గాని లేదు. చేతనమగు ఆత్మ, తన ధ్వంసమును గాని, తన ప్రాగభావమును గాని గ్రహించుట సంభవము కాదు, అశక్యము. గ్రహించునపుడు ఆత్మ ఉండును గనుక, ఆత్మధ్వంస ఉండదు. తన ప్రాగభావ మును, తాను పుట్టలేదు గనుక, గ్రహించుట గూడ సంభవము కాదు. జన్యములగు పదార్థములకు మాత్రమే, ప్రాగభావము ఉండును. ఆత్మధ్వంస, ప్రాగభావములను ఆత్మ గ్రహించలేక పోయినను, అనాత్మపదార్థములు గ్రహించవచ్చును గదా! అనుటయు, పొసగదు. ఆ అనాత్మపదార్థములు జడములు గనుక, వానికి గ్రహణశక్తియే లేదు. ఒకవేళ, ఒక ఆత్మ, తనకంటె భిన్నమగు మఱియొక ఆత్మయొక్క ధ్వంస, ప్రాగభావములను గ్రహించవచ్చును గదా యను శంక కూడ, యుక్తము కాదు. ఆత్మకంటె భిన్నమైనది అనాత్మయే అగును. ఆత్మ, ఒక్కటియే అయి ఉన్నది. లోకమున, కొందఱు సుఖమును, మఱికొందఱు దుఃఖమును తారతమ్యముతో అనుభవించుచున్నారు గనుక, సుఖ దుఃఖ వ్యవస్థకై అనేక ఆత్మలను అంగీకరించవలయు ననుట గూడ, సమంజసము కాదు. ఆత్మవస్తువు ఒక్కటియే అయినను, అన్తఃకరణములు, ఉపాధులు కొన్ని సుఖమునకు ఆశ్రయములు, మఱికొన్ని దుఃఖమునకు ఆశ్రయములు అని అన్తఃకరణభేదము ననుసరించి సుఖదుఃఖవ్యవస్థ కుదుర్చుకొనవచ్చును. తానే తన అభావమును గ్రహించుట విరుద్ధము. గ్రాహ్యమగు ఆత్మాభావ కాలమున, గ్రాహకమగు ఆత్మ ఉండదు. గ్రాహకమగు ఆత్మ,

ఉన్నప్పుడు గ్రాహ్యమగు ఆత్మాభావము లేదు. ఆత్మకు ధ్వంస, ప్రాగభావములను అంగీకరించినచో, కృతహాని, అకృతాభ్యాగమము అను దోషములు వచ్చును. చేసిన కర్మయొక్క ఫలము అనుభవించకనే నశించుట ఆత్మధ్వంసయందు దోషము. చేయని పనికి ఆత్మ, ఫలమును అనుభవించుట (జన్మాదులచే) ఆత్మ ప్రాగభావమున దోషము. 'ఘటస్సన్, పటస్సన్' ఘటము ఉన్నది, పటము ఉన్నది అని సద్రూపముగా అంతట అనుస్యూతముగా ఉండుటవలన, ఆత్మయొక్క అత్యంతాభావము సంభవము కాదు.

ఇంతవఱకు ఆత్మకు ప్రాగభావ, ప్రధ్వంసాభావ, అత్యంతాభావములు లేవని నిరూపింపబడినది. అభావములలో మిగిలి ఉన్నది, అన్యోన్యాభావము. అనగా భేదము. 'ఘటః పటో న'– ఘటము పటము కాదు, పటభిన్నము అనుచోట, అన్యోన్యాభావము భాసించుచున్నది. అట్లే, ఆత్మకు, అనాత్మ నామరూపాత్మక ద్వైతప్రపంచమునుండి భేదము చెప్పవచ్చును గదా? అను ప్రశ్నకు ప్రత్యుత్తరమును చెప్పుచున్నారు. ఆత్మవస్తువు ఒక్కటే సత్యమైనది, ఆత్మయందు నామరూపాత్మక ద్వైతప్రపంచము, దేహేంద్రియాదులు రజ్జువునందు సర్పమువలె అధ్యస్తములు అని వేదాన్తసిద్ధాన్తము. ఆరోపితమగు రజ్జుసర్పము గాని, శుక్తి రజతము గాని, అధిష్ఠాన రజ్జుతాదాత్మ్యముతోను, శుక్తి తాదాత్మ్యముతోను 'అయం సర్పః', 'ఇదం రజతమ్' అని అధిష్ఠానతాదాత్మ్యముతో భాసించును. అట్లే, 'ఘటః సన్, పటః సన్' అని సద్రూప ఆత్మ తాదాత్మ్యముతో ఘట, పటాది ద్వైత

ప్రపంచము భాసించుచున్నది. అన్యోన్యాభావము, భేదము. అనగా, తాదాత్మ్యసంబంధముతో అభావము. (తాదాత్మ్య సంబంధావచ్ఛిన్న ప్రతియోగితాక అభావము). అనాత్మయగు ద్వైతప్రపంచమునందు అధిష్ఠానమగు ఆత్మయొక్క సద్రూప తాదాత్మ్యమే ఉన్నందున, తాదాత్మ్య భావము రాదు. 'ఆత్మైవేదం సర్వమ్' ఆత్మేతరమగు వస్తువు లేదు. తాదాత్మ్యాభావమే అన్యోన్యాభావము (భేదము) గనుక, ఆత్మకు అన్యోన్యాభావము గూడ, లేదని తేలినది.

ఈవిధముగా, ఆత్మకు చతుర్విధాభావములు లేనందున, ఘటాభావమునకు ఘటము ప్రతియోగి అయిన విధముగా (యస్య అభావః సః ప్రతియోగీ) ఆత్మాభావము లేదు గనుక, ఆత్మ, అభావప్రతియోగి కానేరదు. దేహేంద్రియాదులకైతే ప్రాగభావ, ప్రధ్వంసాభావాదులు ఉన్నందున, ఇవి, అభావప్రతియోగులు అగుచున్నవి. కనుక, దేహేంద్రియాదులు ఆత్మ కానేరవు. ఇక ఏమనగా, స్వప్రకాశబోధస్వరూపము అద్వయమగు ఆత్మయందు అనాదియు, అనిర్వచనీయయును అగు అవిద్యచే కల్పింపబడినవి దేహేంద్రియాదులు, అనిర్వచనీయములే అయి ఉన్నవి (సద్రూపములు కావు) అని అద్వైతవేదాన్తసిద్ధాన్త రహస్యము.

సిద్ధాన్తబిన్దుః

నను, బోధరూపః ఆత్మేతి తవ అభ్యుపగమాత్ సుషుప్తౌ చ బోధాభావాత్ గాఢం మూఢోఽహ మాసమ్। న కించిదవేదిష మితి సుప్తోత్థితస్య పరామర్శాత్, కథమ్ అవ్యభిచారితా తస్య? ఇతి

ఆశంక్య, సుషుప్త్యైకసిద్ధ ఇతి। అయమర్థః— ఆత్మనః సుషుప్తి సాక్షిత్వాత్ న తత్ర తదభావః। అన్యథా, మూఢోఽహ మాసమితి పరామర్శానుపపత్తేః । మాతృమానమితి మేయానాం వ్యభిచారిత్వేఽపి తద్భావాభావసాక్షిణః కాలత్రయేఽపి అవ్యభిచారాత్।

## భా వ దీ పి క

ఓయీ ! ఆత్మ, జ్ఞానస్వరూపమని గదా, నీ సిద్ధాంతము. అట్లయినచో, సుషుప్తిలో జ్ఞానము లేదు. 'నేను సుషుప్తిలో మూఢుడనై ఉంటిని, ఏమియు తెలిసికొనకపోయితిని' అని నిద్ర నుండి లేచినవాడు వ్యవహరించుచున్నాడు. కనుక, ఆత్మ ఎల్లప్పుడు ఉండునది (అవ్యభిచారిత = లేకపోవుట లేనిది) ఎట్లగును? అని ఆశంకించుకొని, సమాధానము చెప్పుచున్నారు— 'సుషుప్త్యైకసిద్ధః'. దీనికి ఇది అర్థము. సుషుప్తిలో గూడ, ఆత్మ, ప్రకాశించుచునే ఉన్నాడు. సుషుప్త్యవస్థకు సాక్షిగా ఉన్నాడు. ఆత్మ లేకపోవుట లేదు. సాక్షియగు ఆత్మ లేనిచో, సుషుప్తావస్థయే సిద్ధించదు. 'నేను అపుడు మూఢుడనుగా ఉంటి'నను పరామర్శ కుదరదు. సుషుప్తిదశయందు ప్రమాత, ప్రమాణము, ప్రమితి, ప్రమేయము లేకపోయినను, వానియొక్క అభావమునకు సాక్షిగాను, జాగ్రత్తునందు ప్రమాత, ప్రమాణాదులయొక్క భావమునకు సాక్షిగాను, కాలత్రయమునందును, సాక్షియగు ఆత్మ, ప్రకాశించుచునే ఉన్నాడు, సుషుప్తిలో లేకపోవుట లేదు.

## సి ద్ధా న్త బి న్దుః

నను, ప్రమాశ్రయః ప్రమాతా, స ఏవ కర్తా, భోక్తా

ప్రదీపవత్ స్వపరసాధారణ సర్వభాసకశ్చ ఇతి। న ఘటాదివత్ సాక్షిసాపేక్షః ఇతి చేత్– న, వికారిత్వేన స్వసాక్షిత్వానుపపత్తేః। దృశ్యస్య ద్రష్టృత్వాభావాత్ ప్రమాతుశ్చ పరిణామిత్వేన దృశ్యత్వాత్ ఏకస్య కూటస్థస్యైవ సర్వసాక్షిత్వాత్।

నను, ఏకః కూటస్థః నిర్ధర్మకః సాక్షీ నాద్రియతే, అప్రామాణికత్వాత్ ఇతి చేత్, న। 'తమేవ భాన్త మనుభాతి 'సర్వమ్, తస్య భాసా సర్వమిదం విభాతి', 'న దృష్టేః ద్రష్టారం పశ్యే', 'అదృష్టో ద్రష్టా', 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా' ఇత్యాది వదతా వేదాన్తప్రమాణరాజేన తస్యైవ సర్వసాక్షిత్వేన అభిషిక్తత్వాత్।

## భావదీపిక

ఓయీ! ప్రమకు, అనగా యథార్థ అనుభవమునకు ఆశ్రయుమైనవాడు ప్రమాత. అతడే, కర్త, అతడే భోక్త (సుఖ దుఃఖములను అనుభవించువాడు). ప్రదీపమువలె తనను ప్రకాశింపజేసికొనుచు, సమస్తమును ప్రకాశింపజేయువాడు. ఘటాదులకు ప్రకాశకాపేక్ష (సాక్షిసాపేక్ష) ఉండును గాని, ప్రమాతకు సాక్షితో పని యేమి? ప్రదీపమును ప్రకాశింపజేయుటకు మఱియొక దీపము అవసరము కాదుగదా! అనినచో, అట్లు కాదు. ప్రమాత, సుఖదుఃఖాది ధర్మములను పొందువాడగుటచే, వికారి అగుచున్నాడు. తన సుఖదుఃఖాది పరిణామమును అనుభవించునే గాని, సాక్షి కాడు. ఆ సుఖదుఃఖాదులు అంతఃకరణమునందు (ప్రమాత యందు) దృశ్యము లగుచున్నవి. ప్రమాత, ఇపుడు ఆ సుఖదుఃఖధర్మములతో దృశ్యకోటిలోనికి చేరినవాడు. ద్రష్టృత్వము

లేదు. దృశ్యమునకు ద్రష్ట (చూచువాడు)యొక్క అపేక్ష కలదు. కనుక, కూటస్థుడు (నిర్వికారుడు) అగు ఒకడు సర్వసాక్షిగా పూర్వాపరధర్మములను ప్రకాశింపజేయువాడు అవశ్యక మగుచున్నాడు. అతడే, సాక్షి. ప్రమాతృభావములో పూర్వాపర అనుసంధానము ఉండదు. సాక్షియే, దృశ్యమును నిర్లిప్తుడుగా ప్రకాశింపజేయుచున్నాడు.

ఓయీ ! మేము, ఒకడు కూటస్థుడు, ధర్మములు లేనివాడగు మీ సాక్షిని ఒప్పుకొనము. అందుకు ప్రమాణము లేదు. మీ సాక్షి చేయు పనులకు మా ప్రమాతయే, నిర్వహించును - అనినచో, అట్లు కాదు. ఈ సాక్షియందు ప్రమాణరాజమగు వేదాన్తవాక్యమే, ప్రమాణమై యున్నది. ఆ ఆత్మ (సాక్షి) ప్రకాశించుచుండగనే, ఈ ప్రపంచము అంతయు సూర్యచంద్రాదులతో సహా అనుసరించి ప్రకాశించుచున్నది. ఆ ఆత్మప్రకాశము చేతనే, ఈ జగత్తు అంతయు, విస్పష్టముగా ప్రకాశించుచున్నది. స్వతః ప్రకాశము జగత్తునకు లేదు. దృష్టిని చూచువానిని (నిత్యదృగ్రూపుని) చూడలేవు. అతడు కన్పడకుండగనే, చూచుచుండును. ఈ చూచు జీవుడు, అంతర్యామియగు ఆ సాక్షికంటె భిన్నుడు కాడు గూడ. ఈ రీతిగా సర్వసాక్షి, కూటస్థుడు (నిర్వికారుడు) ఒకడు కలడని ఈ సాక్షి పట్టాభిషేకము చేయుబడియున్నాడు.

## సిద్ధాన్తబిన్దుః

నను, మహదేతదింద్రజాలమ్ ప్రమాశ్రయాన్ అకూటస్థాన్ విహాయ కూటస్థం అప్రమాశ్రయమేవ ప్రమాణరాజః సర్వసాక్షిణం కరోతి। బాఢమ్। ఇంద్రజాలమేవైతత్, స్వప్నవత్ అవిద్యావిలసిత

త్వాత్। తథాఽపి దృశ్యస్య ఘటాదివత్ జడత్వేన కథం ప్రమాశ్రయత్వమ్? ఇతి చేన్న। దర్పణాదివత్ స్వచ్ఛత్వేన చిత్ప్రతిబింబ గ్రాహకత్వాత్ చిత్ తాదాత్మ్యాధ్యాసాద్వా।

## భావదీపిక

ఓయీ! ఇది, మహేంద్రజాలముగ నున్నదే! ప్రమకు ఆశ్రయమైనవారు, అకూటస్థులు, సుఖ దుఃఖాది వికారముల ననుభవించువారును అగు ప్రమాతలను వదలిపెట్టి, ఎవరో నిర్వికారుడు ప్రమాజ్ఞానమునకు ఆశ్రయుడు- ప్రమాత కానివాడు సర్వసాక్షిగా నీ ప్రమాణరాజము, ప్రభువును చేసినది అనుట, యుక్తము కాదు. ప్రమ అనగా, జ్ఞానము. అది కలవాడు ప్రమాత. అతడు సుఖదుఃఖములకు ప్రకాశకుడు కాడు. ప్రమ లేనివాడు సాక్షి; సర్వమును ప్రకాశింపజేయుననుట విరుద్ధముగా లేదా? ఇంద్రజాలమనగా, ఉన్నదానిని కనిపించకుండా చేయునట్టి, లేనిదానిని చూపించునట్టి శక్తి, మాయ అయిఉన్నది. అవును, ఇది ఇంద్రజాలమే. ఈ ప్రపంచమంతయు, స్వప్నము వలె అవిద్యావిలసితము. అనగా, ప్రమాత కూడ, అజ్ఞానావృతుడు గనుక, యథార్థవిషయమును గ్రహించలేని స్థితిలో దృశ్యధర్మములను పైన వేసికొని ఉంటున్నాడు గనుక, అవిద్యావృతుడు కాని సాక్షిచే విషయప్రకాశము జరుగుచున్నది. ఇచట, మఱియొక ప్రశ్న ఉదయించుచున్నది. సుఖదుఃఖముల ననుభవించు ప్రమాత దృశ్యకోటిలో జేరినచో, ఘటాదులవలె జడుడు కావలసివచ్చును. కనుక, సుఖదుఃఖానుభవలక్షణమగు ప్రమకు ఆశ్రయుడు (చేతనుడు) ఎట్లగును? అనినచో - అట్లు కాదు. అంతఃకరణము

అద్దము వంటిది. అది, స్వచ్ఛమైనది. చిద్రూపమగు ఆత్మ యొక్క ప్రతిబింబమును గ్రహించును. అనగా, చిదాభాసుడు ఏర్పడుచున్నాడు. ఆ చిదాభాసుడే, చేతనప్రమాతగా వ్యవహరించుచున్నాడు. లేదా, అంతఃకరణమునకు, చేతనతాదాత్మ్యాధ్యాస వలన, అంతఃకరణభేదమగు అహంకారమే, ప్రమాతగా వ్యవహరించుచున్నది.

## సి ద్ధా న్త బి న్దుః

నను, నీరూపస్య నిరవయవస్య ఆత్మనః ప్రతిబింబః ? ఇతి చేత్ – కా తత్ర అనుపపత్తిః ? విభ్రమహేతూనాం విచిత్రత్వాత్। జపాకుసుమరూపస్య నీరూపస్యాపి స్ఫటికాదౌ ప్రతిబింబదర్శనాత్। శబ్దస్యాపి ప్రతిశబ్దాఖ్య ప్రతిబింబోపలంభాత్। తయోః సంప్రతిపన్న ప్రతిబింబవై లక్షణ్యానిరూపణాత్। తథాఽపి ఇంద్రియగ్రాహ్యస్యైవ ప్రతిబింబః ఇతి చే న్న, వ్యభిచారాత్। అనింద్రియగ్రాహ్యస్య సాక్షిప్రత్యక్షస్య ఆకాశస్యాపి జలాదౌ ప్రతిబింబోపలంభాత్। అన్యథా జానుమాత్రేఽపి ఉదకే అతిగంభీరప్రతీతిః న స్యాత్।

## భా వ దీ పి క

ఓయీ ! ఆత్మకు రూపము గాని, అవయవములు గాని, లేవు గదా ! అట్టి ఆత్మ, అంతఃకరణమునందు ఎట్లు ప్రతిబింబించును ? అని ప్రశ్నించినచో, సమాధానము చెప్పబడుచున్నది. రూపము, అవయవములు లేనంతమాత్రమున, ఆత్మ ప్రతిబింబించుటలో అనుపపత్తి యేమి ? భ్రాంతులు, భ్రాంతి కారణములు విచిత్రములు, అనేకవిధములుగా ఉండును. అరుణమగు

జపాకుసుమము, సన్నిహితమగు స్ఫటికాదులందు భాసించును. 'లోహితః స్ఫటికః' స్ఫటికము ఎఱ్ఱగా ఉన్నదని అందుము. జపాకుసుమము యొక్క లోహితరూపము నీరూపమై యున్నది. అనగా, రూపములేనిది. అయినను, స్ఫటికమునందు ప్రతిబింబించినది. ఇట్లే, పర్వతసమీపమున, గట్టిగా పిలచినప్పుడు ప్రతిధ్వని వచ్చును. మొదటి శబ్దమునకు రెండవ శబ్దము ప్రతిబింబము. ప్రతిబింబలక్షణము ప్రతిధ్వనియందు ఉన్నది. ఇవి, ముఖాది ప్రతిబింబములవంటివి కావు గదా ! ఆత్మ ప్రతిబింబము, అట్లే ఎందుకు కాగూడదు?

ఓయీ ! అది, సరి కాదు. జపాకుసుమమునందున్న లౌహిత్యము చక్షురింద్రియగ్రాహ్యము (కంటికి కనపడును). ప్రతిధ్వని శ్రోత్రగ్రాహ్యము. ఆ రెండును, ఇంద్రియ గ్రాహ్యములే అగుచున్నవి. మీ ఆత్మ, ఇంద్రియగ్రాహ్యము కాదు గదా ? అనినచో, ఇంద్రియగ్రాహ్యమే ప్రతిబింబించునన్న నియమము లేదు. ఆకాశము సాభ్రనక్షత్రముగా జలాదులందు ప్రతిబింబించును. మోకాలిలోతు నీటిలో గూడ, మిక్కిలి లోతుగా ఉన్నట్లు జలమునందు ఆకాశప్రతీతి కలుగుచున్నది. ఆకాశము ఇంద్రియగ్రాహ్యము కాదు. అచట, చక్షురింద్రియాపేక్ష కలదు గదా! అని శంకించరాదు. చక్షురింద్రియము అధిష్ఠాన జలదర్శనముకొఱకు ఉపయోగించుచున్నదే గాని, ఆకాశప్రతిబింబ దర్శనము కొఱకు కాదు. అయితే, ఆ ఆకాశప్రతిబింబము ఎట్లు గ్రహింపబడుచున్నదనగా, అది సాక్షిభాస్యము అని సిద్ధాన్తము.

## సి ద్ధా న్త బి న్దుః

ఆకాశ ప్రతిబింబస్య సాక్షిభాస్యత్వే౽పి అధిష్ఠాన గ్రహణార్థం చక్షుషః అపేక్షణాత్ । ఏతేన నీలం నభః ఇత్యాది విభ్రమే౽పి చక్షురన్వయవ్యతిరేకౌ వ్యాఖ్యాతౌ, తత్ర సాలోకస్య ఆకాశస్య అధిష్ఠానత్వాత్। తస్మాత్ చాక్షుష ప్రతిబింబమేవ రూపసాపేక్షమ్, న త్వన్యదితి అవధేయమ్ ।

## భా వ దీ పి క

మోకాటిలోతు నీటియందు ఆకాశ ప్రతిబింబముచేత మిక్కిలి లోతుగా ఉన్నట్లు తోచినపుడు, చక్షురింద్రియసాపేక్ష కలదని తోచుచుండును. కాని, అచట, ఆకాశ ప్రతిబింబము చక్షుర్గ్రాహ్యము కాదు. అది, సాక్షిభాస్యమే. అధిష్ఠానమగు జలమును గ్రహించుటకొఱకే, చక్షురింద్రియముయొక్క అపేక్ష అని తెలియవలయును. ఇట్లు చెప్పుటచేత 'నీలం నభః' ఆకాశము నీలవర్ణముగా నున్నది అను రూపరహితమైన ఆకాశమునందు నీలరూపము యొక్క భ్రాంతిస్థలమున గూడ, చక్షురింద్రియముయొక్క అన్వయ వ్యతిరేకములు అనగా, ఉండుట, లేకపోవుట అనునవి వ్యాఖ్యానము చేయబడినవి. కంటితో చూచియే 'నీలం నభః' అని అనుచున్నాము. అచట, వెలుతురుతో గూడిన ఆకాశము నీలవర్ణభ్రాంతికి అధిష్ఠానము. వెలుతురును గ్రహించుటకు మాత్రమే చక్షురింద్రియము యొక్క అపేక్ష ఉన్నది. ఆకాశము, సాక్షి చేతనే భాసింపబడుచున్నది. కనుక, కంటితో ప్రతిబింబమును గ్రహించునపుడు మాత్రమే, (దర్పణే మమ ముఖమ్) రూపముయొక్క

జపాకుసుమము, సన్నిహితమగు స్ఫటికాదులందు భాసించును. 'లోహితః స్ఫటికః' స్ఫటికము ఎఱ్ఱగా ఉన్నదని అందుము. జపాకుసుమము యొక్క లోహితరూపము నీరూపమై యున్నది. అనగా, రూపములేనిది. అయినను, స్ఫటికమునందు ప్రతిబింబించినది. ఇట్లే, పర్వతసమీపమున, గట్టిగా పిలచినప్పుడు ప్రతిధ్వని వచ్చును. మొదటి శబ్దమునకు రెండవ శబ్దము ప్రతిబింబము. ప్రతిబింబలక్షణము ప్రతిధ్వనియందు ఉన్నది. ఇవి, ముఖాదిప్రతిబింబములవంటివి కావు గదా ! ఆత్మ ప్రతిబింబము, అట్లే ఎందుకు కాగూడదు?

ఓయీ ! అది, సరి కాదు. జపాకుసుమమునందున్న లౌహిత్యము చక్షురింద్రియగ్రాహ్యము (కంటికి కనపడును). ప్రతిధ్వని శ్రోత్రగ్రాహ్యము. ఆ రెండును, ఇంద్రియగ్రాహ్యములే అగుచున్నవి. మీ ఆత్మ, ఇంద్రియగ్రాహ్యము కాదు గదా ? అనినచో, ఇంద్రియగ్రాహ్యమే ప్రతిబింబించునన్న నియమము లేదు. ఆకాశము సాభ్రనక్షత్రముగా జలాదులందు ప్రతిబింబించును. మోకాలిలోతు నీటిలో గూడ, మిక్కిలి లోతుగా ఉన్నట్లు జలమునందు ఆకాశప్రతీతి కలుగుచున్నది. ఆకాశము ఇంద్రియగ్రాహ్యము కాదు. అచట, చక్షురింద్రియాపేక్ష కలదు గదా। అని శంకించరాదు. చంక్షురింద్రయము అధిష్ఠాన జలదర్శనముకొఱకు ఉపయోగించుచున్నదే గాని, ఆకాశప్రతిబింబ దర్శనము కొఱకు కాదు. అయితే, ఆ ఆకాశప్రతిబింబము ఎట్లు గ్రహింపబడుచున్నదనగా, అది సాక్షిభాస్యము అని సిద్ధాన్తము.

## సి ద్ధా న్త బి న్దుః

ఆకాశ ప్రతిబింబస్య సాక్షిభాస్యత్వే ఽపి అధిష్ఠాన గ్రహణార్థం చక్షుషః అపేక్షణాత్ । ఏతేన నీలం నభః ఇత్యాది విభ్రమే ఽపి చక్షురన్వయవ్యతిరేకౌ వ్యాఖ్యాతౌ, తత్ర సాలోకస్య ఆకాశస్య అధిష్ఠానత్వాత్। తస్మాత్ చాక్షుష ప్రతిబింబమేవ రూపసాపేక్షమ్, న త్వన్యదితి అవధేయమ్ ।

## భా వ దీ పి క

మోకాటిలోతు నీటియందు ఆకాశ ప్రతిబింబముచేత మిక్కిలి లోతుగా ఉన్నట్లు తోచినపుడు, చక్షురింద్రియసాపేక్ష కలదని తోచు చుండును. కాని, అచట, ఆకాశ ప్రతిబింబము చక్షుర్గ్రాహ్యము కాదు. అది, సాక్షిభాస్యమే. అధిష్ఠానమగు జలమును గ్రహించుట కొఱకే, చక్షురింద్రియముయొక్క అపేక్ష అని తెలియువలయును. ఇట్లు చెప్పుటచేత 'నీలం నభః' ఆకాశము నీలవర్ణముగా నున్నది అను రూపరహితమైన ఆకాశమునందు నీలరూపము యొక్క భ్రాంతిస్థలమున గూడ, చక్షురింద్రియముయొక్క అన్వయ వ్యతిరేకములు అనగా, ఉండుట, లేకపోవుట అనునవి వ్యాఖ్యానము చేయబడినవి. కంటితో చూచియే 'నీలం నభః'అని అనుచున్నాము. అచట, వెలుతురుతో గూడిన ఆకాశము నీలవర్ణభ్రాంతికి అధిష్ఠానము. వెలుతురును గ్రహించుటకు మాత్రమే చక్షు రింద్రియము యొక్క అపేక్ష ఉన్నది. ఆకాశము, సాక్షి చేతనే భాసింపబడుచున్నది. కనుక, కంటితో ప్రతిబింబమును గ్రహించు నపుడు మాత్రమే, (దర్పణే మమ ముఖమ్) రూపముయొక్క

అపేక్ష కలదు, రూపము లేకనే ఆకాశప్రతిబింబము సాక్షిచేత గ్రహింపబడుచున్నది. అట్లే, ఆత్మకూడ, ప్రతిబింబించవచ్చును.

### సిద్ధాన్తబిన్దుః

తథాఽపి ఆత్మనః ప్రతిబింబే కిం ప్రమాణమ్ ఇతి చేత్, శృణు - 'రూపం రూపం ప్రతిరూపో బభూవ, తదస్య రూపం ప్రతిచక్షణాయ, మాయా ఆభాసేన జీవేశౌ కరోతి' ఇత్యాది శ్రుతిః 'ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్, స ఏషః ఇహ ప్రవిష్టః। ఆనఖాగ్రేభ్యః సః ఏతమేవ సీమానం విదార్య ఏతయా ద్వారా ప్రాపద్యత।, 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్' ఇత్యాది ప్రవేశశ్రుత్యర్థాన్యథానుపపత్తిః। 'ఆభాస ఏవ చ', 'అత ఏవ చ ఉపమా సూర్యకాదివత్' ఇత్యాది సూత్రాణి చ తత్ర మానాని।

### భావదీపిక

అట్లయినను, ఆత్మకు ప్రతిబింబము కలదనుటలో ప్రమాణమేమి ? అనినచో, వినుము.

> ''రూపం రూపం ప్రతిరూపో బభూవ', 'తదస్య రూపం ప్రతిచక్షణాయ', మాయా ఆభాసేన జీవేశౌ కరోతి।''

మొదలగు శ్రుతులు ఇందులకు ప్రమాణము. 'రూపం రూపం' = మనుష్య, పశు, పక్ష్యాది దేహములందు ఆ యా ఆకారములు కలవాడుగా 'అహం' అని వ్యవహరించు ఆత్మ, ఉన్నాడు. (ప్రతిబింబరూపముగా). ఈ ప్రతిబింబరూపమే, 'అహం' మొదలగు వ్యవహారము కొఱకు ఉపయోగపడుచున్నది. మాయ, అవిద్య నామములతో వ్యవహరింపబడు ఉపాధియొక్క ఆభాసముచే, అనగా తనయందలి ప్రతిబింబముచే, జీవేశ్వరులను

లను చేయుచున్నది. మాయా ప్రతిబింబము ఈశ్వరుడు, అవిద్యా ప్రతిబింబము జీవుడు అని శ్రుతికి అర్థము. 'ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్' అను శ్రుతి కూడ, ప్రమాణము. ఆకాశము నందున్న ఒకే చంద్రుడు, వేలువేలు జలోపాధులందు బహు ప్రతిబింబరూపములతో (నానాకారములతో) కనిపించుచున్నాడని శ్రుతికి అర్థము. ఆత్మ, ఒక్కడే అయినను, మనుష్యశరీరాది ఉపాధులందు నానా ఆకారములతో కనిపించుచున్నాడు. ఇవి కాక, అర్థాపత్తి ఉదాహరణము కూడ ఉదహరింపబడుచున్నది.

'స ఏష ఇహ ప్రవిష్టః ఆనఖాగ్రేభ్యః'

ఆ పరమాత్మ, శరీరములను సృజించి, అందు నఖాగ్రముల పర్యన్తము ప్రవేశించెను. సృష్టికర్త యగు ఆ పరమాత్మ, శిరస్సున, బ్రహ్మరంధ్రముద్వారా శరీరమునందు ప్రవేశించెను. మొదలగు ఈ ప్రవేశ శ్రుతులు శరీరములందు ప్రతిబింబరూపముతో 'ఆత్మ కలడు' అనుటకు అర్థాపత్తిప్రమాణమును సూచించుచున్నవి. అట్లు కానిచో, సర్వనియామకుడగు పరమాత్మ, శరీరములో ప్రవేశించుట ఎట్లు కుదురును? ప్రతిబింబోపలబ్ధిచే పరమాత్మ ప్రవేశము వర్ణింపబడినదని భావము. మఱియు,

'ఆభాస ఏవ చ', అత ఏవ చ ఉపమా సూర్యకాదివత్।'

మొదలగు బ్రహ్మసూత్రములు కూడ, ఆత్మ, ఆభాసుడు, సూర్య ప్రతిబింబమువలె ప్రతిబింబభూతుడు అని చెప్పుటచే ప్రమాణములు.

ఇంతవఱకు ఆత్మ, ప్రతిబించుననుటలో (ప్రమాణములు) ఉదహరింపబడినవి.

## సిద్ధాన్తబిన్దుః

తస్య చ ప్రతిబింబస్య సత్యత్వమేవేతి ప్రతిబింబవాదినః। మిథ్యాత్వమేవేతి ఆభాసవాదినః। స్వరూపే తు న వివాద ఏవ ఇతి అన్యదేతత్। అచేతనవిలక్షణత్వం తు శ్రుతిసిద్ధమ్, అనుభవసిద్ధం చ। తస్మాత్ సిద్ధం అన్తఃకరణస్య ప్రతిబింబాధ్యాసద్వారా ప్రమాతృత్వమ్।

## భావదీపిక

అంతఃకరణమునందు (అవిద్యయందు, మాయయందు) ఆత్మయొక్క ప్రతిబింబము సత్యమే యని ప్రతిబింబవాదులు (పద్మపాద, వివరణాచార్యాదులు)అందురు. కనుకనే, 'తత్త్వమసి' మహావాక్యమునందు 'త్వ'మర్థ మగు జీవులకు తదర్థమగు బ్రహ్మతో ముఖ్యస్వరూపైకత్వము సిద్ధించునని వారి భావము.

ఆత్మప్రతిబింబము మిథ్యాభూతమే అని ఆభాసవాదులు – జీవుడనువాడు చిదాభాసుడు(సురేశ్వరాచార్యాదులు) చెప్పెదురు. చిదాభాసునకు సంసారము చిద్రూపముతో బ్రహ్మైకత్వము అని వీరి అభిప్రాయము. అందఱకు జీవబ్రహ్మైక్యమే, సమ్మతము. ఆత్మప్రతిబింబస్వరూపమును అంగీకరించుచునే యున్నారు. ఉపనిషత్ సిద్ధాంతమగు జీవబ్రహ్మైకత్వమును గ్రహించుటలో యుక్తులను, దృష్టాంతములను వేఱువేఱుగా చూపుచు, బ్రహ్మాద్వైతమునే సమర్థించుచున్నారు. ప్రతిబింబముగా గ్రహింపబడిన ఈ స్వరూపము – ఆత్మస్వరూపము – ముఖాది ప్రతిబింబరూపములవలె జడము కాదు. అచేతన విలక్షణము అను విషయము శ్రుతిసిద్ధము, అనుభవసిద్ధము గూడ అయి ఉన్నది. కనుక,అంతః

కరణమునకు ఆత్మ ప్రతిబింబాధ్యాస ద్వారా ప్రమాతృత్వము ఏర్పడుచున్నది. కేవల అంతఃకరణము ప్రమాత కాదు. కేవలాత్మ నిరుపాధికము. ప్రమాత కాదు. ప్రతిబింబరూపముతో ప్రకాశమును పొంది, అంతఃకరణము ప్రమాతృత్వము కలదై వ్యవహరించుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

నను, అధ్యాసోఽపి నోపపద్యతే, తథా హి। ఆత్మని వా అనాత్మా అధ్యస్యతే, అనాత్మని వా ఆత్మా? నాద్యః। తస్య నిస్సామాన్యవిశేషత్వేన సర్వదా భాసమానత్వేన సాదృశ్యాది రహితత్వేన చ అధిష్ఠానత్వాసంభవాత్। నాపి ద్వితీయః। మిథ్యాత్వ అభ్యుపగమాత్। మిథ్యావస్తునః అధిష్ఠానత్వే శూన్యవాదప్రసఙ్గాత్। తస్య చ సత్యత్వే తదనివృత్తేః అనిర్మోక్షప్రసఙ్గాచ్చ। న హి సత్యం క్వచిత్ నివర్తతే। నివర్త్యమానం వా జ్ఞానేన? శ్రుతయశ్చ- ''భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే।', 'తమేవ విదిత్వా అతి మృత్యుమేతి', 'నాన్యః పన్థా విద్యతేఽయనాయ', 'తరతి శోక మాత్మవిత్' ఇత్యాద్యాః జ్ఞానాత్ సర్వసంసారనివృత్తిం దర్శయన్త్యః తస్య చ మిథ్యాత్వం సూచయన్తి।

## భావదీపిక

ఓయీ। అంతఃకరణమునకు ఆత్మ ప్రతిబింబాధ్యాస ద్వారా ప్రమాతృత్వము ఏర్పడునని చెప్పియున్నావు. అధ్యాసయే కుదరదు. అధ్యాస యనగా భ్రాంతియే కదా। ఆత్మయందు అనాత్మ (దేహేంద్రియాన్తఃకరణాదులు) అధ్యసింపబడునా?

లేక, అనాత్మయందు ఆత్మ, అధ్యసింపబడునా? అనగా, ఆత్మను అనాత్మ అనుకొనుచున్నారా? మొదట చెప్పినది కుదరదు, ఆత్మయందు అనాత్మయొక్క అధ్యాసము ఎట్లు సంభవించును? రజ్జువునందు సర్పాధ్యాస కలదు. అచట, సర్పభ్రాంతికి, అధిష్ఠానమగు రజ్జువునందు ఇదంత్వము (ఇది అను భావము) అను సామాన్య ధర్మము, రజ్జుత్వము అను విశేషధర్మము - రెండును, కలవు. సామాన్యధర్మగ్రహణముచే 'అయం సర్పః' అను భ్రాంతియు, 'రజ్జురియమ్' అని విశేషధర్మ, రజ్జుత్వగ్రహణముచే భ్రాంతి నివృత్తియు కలుగుచున్నవి. ఆత్మ, నిర్ధర్మకము - సామాన్య, విశేషధర్మములు లేనిది. కావున, అనాత్మభ్రాంతికి ఆత్మ, అధిష్ఠానము కానేరదు. అనాత్మయందు ఆత్మ, అధ్యసింపబడుచున్నదను రెండవ పక్షము కూడ, యుక్తము కాదు. అనాత్మ పదార్థములు మిథ్యాభూతములని అద్వైతసిద్ధాన్తము కదా! అధ్యాసకు అధిష్ఠానము సత్యమై ఉండవలెనని చెప్పుదురు. మిథ్యా వస్తువగు ఆత్మ, అధిష్ఠానమగుచో, శూన్యవాదమును అంగీకరించి నట్లగును, ఆరోపింపబడినది మిథ్యాభూతమే. అధిష్ఠానమగు అనాత్మ కూడ, మిథ్య అయినపుడు సత్యమగు వస్తువు లభించదు. బౌద్ధులు చెప్పునట్టి శూన్యవాదమే ప్రసక్తమగుటచే ఆ వాదము నందలి దోషములన్నియు, అద్వైతసిద్ధాన్తమున గూడ, ప్రసక్తము లగును. అనాత్మవస్తువు సత్యమని అంగీకరించినచో, జగత్తు, మిగిలి ఉండును గనుక, నిశ్శేషముగా సంసారదుఃఖము నివర్తించదు, సత్యమైనది ఎచ్చటను, నివర్తించదు కదా! ఒకవేళ, సత్యమైనది ఉచ్ఛిన్నమైనను, (ధ్వస్తమైనను) జ్ఞానము చేత అసలే నివర్తించదు. శ్రుతులు 'పరావర శుద్ధబ్రహ్మదర్శనము

కలుగగా హృదయగ్రన్థి (అహంకారగ్రన్థి) విడిపోవును. సర్వ సంశయములు తీరును. ఆ పరమాత్మను తెలిసికొని, మృత్యు లక్షణమగు సంసారమును అతిక్రమించుచున్నాడు. మోక్షము కొఱకు (బ్రహ్మస్వరూపప్రాప్తికొఱకు) బ్రహ్మజ్ఞానము కంటె మఱియొక ఉపాయము లేదు. ఆత్మసాక్షాత్కారము కలవాడు శోకమును తరించును' అను అర్థము గలవి జ్ఞానమువలన సర్వ సంసారమూల అజ్ఞాననివృత్తిని చూపుచు ఆ అనాత్మ యగు సర్వ ప్రపంచమునకు జ్ఞాననివర్త్యత్వలక్షణమగు మిథ్యాత్వము సూచించుచున్నవి.

## సిద్ధాన్తబిన్దుః

'ఏకమేవాద్వితీయమ్', 'అతోఽన్యదార్తమ్', 'నేహ నానాఽస్తి కించన', 'అథాత ఆదేశో నేతి నేతి' ఇత్యాద్యాః శ్రుతయః సాక్షాదేవ మిథ్యాత్వం ప్రతిపాదయన్తి। దృశ్యత్వేన శుక్తిరజతాదివత్ మిథ్యాత్వ అనుమానాచ్చ ఆత్మాధ్యస్తతయైవ అనాత్మని సిద్ధేః తత్ర ఆత్మాధ్యాసః। అనాత్మాధ్యాసేన చ ఆత్మనః దోషసాదృశ్యాది సంభవాత్ తత్ర చ అనాత్మాధ్యాసస్య అవిద్యాత్మకత్వాత్ న వికల్పావసరః ఇత్యపాస్తమ్। స్వప్రకాశాత్మని అవిద్యాయాఽపి అనుపపత్తేః। తథా హి, సాఽపి అధ్యస్తా అనధ్యస్తా వా ? తత్ర ఆద్యే కథం నాత్మాశ్రయాది దోష ప్రసఙ్గః ? అన్త్యే తస్య అనుచ్ఛేదాత్ అనిర్మోక్షప్రసఙ్గః। సర్వస్య అధ్యాసమూలత్వే భ్రమప్రమాదివ్యవస్థా చ న స్యాత్। ఏకస్యైవ ఆత్మనః ప్రమాణ ప్రమేయ ప్రమితి ప్రమాతృరూపతా చ విరుద్ధా అవిరోధాభ్యుపగమేవ సౌగతమతాపత్తిరితి। అత్రోచ్యతే–

## భావదీపిక

'ఏకమేవ అద్వితీయమ్' సృష్టికి పూర్వమునందున్న సద్వస్తువు సజాతీయభేద, విజాతీయభేద, స్వగతభేదరహితము; నిర్విశేషము. 'అతోఽన్యదార్తమ్' ఈ బ్రహ్మ (ఆత్మ) వస్తువు కంటె అన్యమగు అనాత్మ జగత్తు నశ్వరము. 'నేహ నానాఽస్తి కించన' ఈ బ్రహ్మయందు అనేకరూపము ఏదియు లేదు. అనేక విచిత్రరూపముగా భాసించు జగత్తు కొంచెముగూడ, లేదు. 'అథాత ఆదేశః నేతి నేతి' ఇటువిమ్మట, బ్రహ్మ నిర్దేశము చేయబడు చున్నది. 'నేతి నేతి' ఇతి ఇదం న = ఇది కాదు. ఇది కాదు - అను రీతిగా దేహేంద్రియాది సకల దృశ్యనిషేధము కాగా చేయగా, ఉపలక్షితమగునది బ్రహ్మచైతన్యము. ఈ మొదలగు శ్రుతులు సాక్షాత్తుగానే, అనాత్మపదార్థమునకు (అనగా జగత్తునకు) మిథ్యాత్వమును ప్రతిపాదించుచున్నవి.

మఱియు, ''విమతం జగత్ మిథ్యా దృశ్యత్వాత్ శుక్తిరజతాదివత్'' సత్యమా, మిథ్యయా? అను వివాదగ్రస్తమగు జగత్తు, దృశ్యమగుటచే, శుక్తిరజతాదులవలె (స్వప్నాదులవలె) మిథ్యయే అగుచున్నదను అనుమానప్రమాణముగూడ, అనాత్మకు మిథ్యాత్వసాధకము. ఆత్మయందు అధ్యస్తముగా సిద్ధించిన అనాత్మయందు ఆత్మాధ్యాసము. అనాత్మాధ్యాసచే దోష సాదృశ్యాదులు ఆత్మకు సంభవించును గనుక, ఆత్మయందు అనాత్మాధ్యాసమని, చెప్పుటచేత ఆత్మాశ్రయ, అన్యోన్యాశ్రయ దోషములు ప్రసక్తములగును. ఈ ఆత్మాధ్యాస, అనాత్మా ధ్యాసలు అవిద్యామూలకములు,అవిద్యాత్మకములు గనుక, వికల్ప

మునకు అవసరము లేదను వాదము గూడ, త్రోసిపుచ్చబడినది. స్వ ప్రకాశమగు ఆత్మయందు అవిద్యయే, కుదరదు కదా! ఈ విషయము ఉపపాదింపబడుచున్నది. ఆ అవిద్య గూడ, ఆత్మయందు అధ్యస్తమనెడి మొదటి పక్షములో ఆత్మాశ్రయాది దోషములు ఎట్లు వారింపబడును? అవిద్య, అధ్యస్తము కాదు, సత్యమే అయి ఉన్నదను రెండవ పక్షమున, ఆ అవిద్యకు ఉచ్ఛేదము (నివృత్తి) కలుగనేరదు గాన, మోక్షమునకు తావు లేదు. అంతయు, అధ్యాసమూలమే అయినచో, ఇది భ్రమ (భ్రాంతి), ఇది యథార్థ జ్ఞానము (ప్రమ) అను వ్యవస్థ లేకపోవలసివచ్చును. మఱియు, ఒకే ఆత్మ, ప్రమాణము, ప్రమేయము, ప్రమితి, ప్రమాత అన్ని రూపములు కలిగియిండుట విరుద్ధము. విరోధము లేదని అంగీకరించినచో, బౌద్ధమతమునకును, అద్వైతమతమునకు సౌగతమత ప్రవేశము అంగీకరించినట్లగును. ఇచట, సమాధానము చెప్పబడుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

అహం మనుష్యః, కర్తా, భోక్తా ఇత్యాది ప్రతీతి స్తావత్ సర్వజనసిద్ధా । సా చ న స్మృతిః అపరోక్ష అవభాసత్వాత్, భేదాగ్రహపూర్వకత్వాచ్చ। నాపి ప్రమా శ్రుతి,యుక్తిబాధితత్వాత్। తథా చ శ్రుతయః - 'యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది అన్తర్జ్యోతిః పురుషః', 'అయమాత్మా బ్రహ్మ', 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ', 'యస్సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ', 'య ఆత్మా సర్వాన్తరః యో అశనాయా పిపాసే శోకం మోహం జరాం మృత్యుమత్యేతి', 'స యత్ తత్ర కించిత్ పశ్యతి అనన్వాగతః

తేన భవతి', 'అసఙ్గో హ్యయం పురుషః' ఇత్యాద్యాః అకర్తృ భోక్తృ పరమానన్దబ్రహ్మరూపతాం ఆత్మనః దర్శయన్తి।

భావదీపిక

'నేను మనుష్యుడను, పని చేయువాడను, సుఖ దుఃఖములను అనుభవించువాడను' అను జ్ఞానము అయితే, సర్వజనులకు అనుభవములో నున్నది. ఆ జ్ఞానము స్మృతి కాదు. అపరోక్ష (ప్రత్యక్ష)ముగా తోచుచున్నది గనుక, మనుష్యత్వము జడశరీర ధర్మము. 'అహం' అని తోచు ఆత్మ, చేతనము. జడ, చేతనములకు వాస్తవముగా భేదమున్నను, నేనే మనుష్యత్వధర్మము కలవాడనన్న రీతిగా ఆ భేదమును గ్రహించుట మాని, శరీరాది అభేదముతో ఆ జ్ఞానము ఉన్నది. స్మృతియందు జ్ఞానము యథార్థముగానే యుండును. ఆరోపిత ధర్మముతో స్మృతి ఉండదు. పోనిమ్ము, యథార్థానుభవమే. 'అహం మనుష్యః' అను ప్రతీతి అనుటకు వీలులేదు. శ్రుతులు, యుక్తులు 'అహం మనుష్యః' అను ప్రతీతి ప్రమ (యథార్థానుభవము) కాదని నిరాకరించుచున్నవి. ఎట్లనగా – శ్రుతులు, ముందు ఉదహరింపబడుచున్నవి.

"యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది అన్తర్జ్యోతిః పురుషః'

ఏ యీ విజ్ఞానమయుడు, దేహేంద్రియ ప్రాణ మనో బుద్ధి చిత్తాహంకారములకంటె వేఱైనవాడు. హృదయదేశమునందు లోపల చైతన్యజ్యోతిగా ప్రకాశించుచున్న పురుషుడు. 'అయమాత్మా బ్రహ్మ' దేహమునందు సాక్షిగా ప్రత్యగాత్మ రూపముగా ఉన్న చిద్రూపము, సచ్చిదానంద బ్రహ్మస్వరూపమే

అయి ఉన్నది. 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' బ్రహ్మ, త్రికాలా బాధ్యము, జ్ఞానస్వరూపము, దేశ, కాల, వస్తు పరిచ్ఛేదరహితము. 'విజ్ఞానమానన్దం బ్రహ్మ' బ్రహ్మ స్వప్రకాశ చిత్స్వరూపము, ఆనందస్వరూపము. 'అయమాత్మా అపహత పాప్మా' ఈ ఆత్మ, పాపముతో సంబంధము లేనివాడు, విశుద్ధుడు. 'యస్సాక్షాదపరోక్షాద్ బ్రహ్మ' బ్రహ్మ అపరోక్ష చిద్రూపము. 'య ఆత్మా సర్వాన్తరః' ఏ ఆత్మ సర్వదృశ్య అధిష్ఠానమైనవాడో,

'యో అశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యు మత్యేతి' ఎవడు క్షుత్పిపాసలను, శోక, మోహములను, జరా, మరణములను అతిక్రమించినవాడో, అతడు ఆత్మ.

'న యత్ర త్రకించిత్పశ్యతి అనన్వాగత స్తేన భవతి' ఆ జీవాత్మ దేనిని చూచునో, ఆ జ్ఞేయ పదార్థముతోను, జ్ఞానముతోను సంబంధము లేనివాడుగా ఉన్నాడు.

'అసంగోహ్యాయం పురుషః' సర్వదృశ్యములందు అధిష్ఠానముగా ఉన్న ఈ ఆత్మ, ఆ దృశ్యములతో ఎట్టి సంబంధము లేనివాడు (అధిష్ఠానమునకు ఆరోపితముతో సంబంధము ఉండదు) ఈ మొదలగునవి ఆత్మ కర్తగాడు, భోక్తగాడు, పరమానంద బ్రహ్మస్వరూపుడని తెలుపుచున్నవి.

### సిద్ధాన్త బిన్దుః

యుక్తయశ్చ – వికారిణః పరిచ్ఛిన్నత్వేన అనాత్మత్వాపత్తేః। స్వేనైవ స్వస్య గ్రహణే కర్తృకర్మ విరోధాత్। దృగ్ దృశ్య

సంబంధానుపపత్తేః। భేదేన అభేదేన వా ధర్మధర్మి భావానుప పత్తేశ్చ। జ్ఞాననిత్యత్వపక్షే ధ్వంసప్రాగభావ, సమవాయ, జ్ఞానత్వ జాత్యాద్యభ్యుపగమే గౌరవాత్। ఏకత్వాభ్యుపగమే చ అతి లాఘవాత్। ఘటజ్ఞానం, పటజ్ఞాన మితి ఉపాధిభేద పురస్కారేణైవ జ్ఞానభేదప్రతీతేః। స్వతస్తు జ్ఞానం జ్ఞానమితి ఏకస్వరూపావగమాత్। తదుత్పత్తి వినాశప్రతీత్యోశ్చ అవశ్యకల్ప్య విషయసంబంధ విషయతాఽపి ఉపపత్తేః। ఉపాధిపరామర్శమన్తరేణ స్వత ఏవ ఘటాత్ ఘటాన్తరస్య భేదప్రతీతేః తత్ ప్రతిబంధి గ్రహాసంభవాత్ ఆకాశ కాల దిశామపి నానాత్వాపత్తేశ్చ కర్తృత్వాదేః వాస్తవత్వే అనిర్మోక్షప్రసఙ్గాత్। స్వప్రకాశానభ్యుపగమే చ జగదాంధ్య ప్రసఙ్గాత్ పరమప్రేమాస్పదత్వేన చ తస్య ఆనందరూపత్వాత్। నిర్ధర్మక నిత్య స్వప్రకాశ సుఖాత్మక ఏవ ఆత్మా ఇత్యాద్యాః। తస్మాత్ పరిశేషాత్ భ్రాంతి రియమ్।

## భావదీపిక

ఈ విషయమున, యుక్తులు (సాధక బాధక ప్రమాణ ఉపన్యాసములు) చూపబడుచున్నవి. 'ఆత్మ, ధర్మములు లేనివాడు, నిత్యుడు గనుక, మఱియు, ఆత్మ నిత్యుడు, స్వ ప్రకాశ సుఖస్వరూపుడు గనుక' అను రెండు అనుమానములు ఈ సందర్భమున చెప్పబడుచున్నవి, చెప్పుటకు ఇష్టమైనవి. వికారము కల వస్తువు పరిచ్ఛిన్నము, పరిమిత దేశవర్తి అగుటచే అది ఆత్మ కానేరదు. ఆత్మ సర్వవ్యాపకము, సుఖ, దుఃఖ వికారములు దానివి కావు. ఆత్మ, ఏకము. తనను తాను గ్రహించదు. గ్రహించునది కర్త, గ్రహింపబడునది కర్మ. కర్త, కర్మ కానేరదు, కర్మ, కర్త

కానేరదు. కావున ఆత్మ, తనను గ్రహించును అని చెప్పినచో, కర్తృకర్మవిరోధ దోషము ఆపాదింపబడును. అనగా, ఆత్మ స్వప్రకాశ మనియే గ్రహించవలెను. కర్త అని గాని, కర్మ అని గాని భావించరాదు. ఆత్మ, దృగ్రూపము. శుద్ధము. దృశ్యము కల్పితము. కల్పితమగు దేహేంద్రియ మనోగత దోషములతో సంబంధము దృక్కునకు ఉపపన్నము కాదు. ఆత్మ ఎల్లప్పుడు, దృగ్రూపముగా ప్రకాశించు స్వభావము గలది ఆగుటచే కల్పిత పదార్థములయొక్క దోష, వికారములు ఆత్మను స్పృశింపనేరవు. ఆత్మకు ధర్మధర్మిభావము కూడ లేదు. లోకమునందు ధర్మములు కలది ధర్మిగా ప్రసిద్ధము. ధర్మము, ధర్మి ఒకటి కావు. ధర్మధర్మి జ్ఞానము ఆవశ్యకమని లోకమున, తర్కశాస్త్రమున, అంగీకరింప బడును. గోత్వాది జాతులు, శుక్లాది గుణములు, పాకాదిక్రియలు ధర్మములు. 'ఆధేయతావాన్ ధర్మః' పైన ఉండునది ధర్మము. ఆధారము ధర్మి. గోవ్యక్తి, ఘట, పటాది ధర్మములు, ధర్మి అని వ్యవహారము. ఆత్మయందు ఈ ధర్మధర్మిభేదము కూడ లేదు. ఆత్మకు జ్ఞానానందములు స్వరూపములే గాని, ధర్మములు కావు. ఒకవేళ, ఆత్మయందు ధర్మము అంగీకరించినచో, ఆ ధర్మమునకు ఈ ధర్మికి భేదమా, అభేదమా? అని ప్రశ్నించినచో, భేదమున్నను ధర్మధర్మిభావము కుదరదు. అభేదమున్నను, ధర్మధర్మిభావము కుదరనేరదు. ఆత్మ, నిత్యజ్ఞాన స్వరూపము.

తార్కికులు ఘటజ్ఞానము, పటజ్ఞానము అనిత్యములని అందురు. ఆ పక్షమున, అనేక జ్ఞానవ్యక్తులు పుట్టుచున్నవి. అంతకు పూర్వము అవి లేవు. ప్రాగభావము కలవి. కొంతకాలమునకు ఆ

జ్ఞానము నశించును గనుక, ప్రధ్వంసాభావము కలవి. ఆ జ్ఞానములందు జ్ఞానత్వజాతి సమవాయసంబంధముచే ఉండునని అనేక కల్పనలు చేయుదురు. అంతకంటె లాఘవతర్కముచే జ్ఞానము ఒకటి నిత్యము, ధ్వంస, ప్రాగభావకల్పన అవసరము కాదు. కనుక, శ్రుతిసిద్ధమగు ఏకజ్ఞానము నిత్యమను పక్షమే, యుక్తముగా నున్నది.

అట్లయినచో, ఘటజ్ఞాన, పటజ్ఞానములు భిన్నములుగా తోచుచున్నవి, ఒకటి కావలసివచ్చునని అపాదించరాదు. జ్ఞానము ఒక్కటియే అయినను, ఘట, పటాది ఉపాధిభేదము వలన జ్ఞానమునందు భేదము ప్రతీతమగుచున్నది. ఘట, పటాది విషయములను దూరముగా చేసినచో, జ్ఞానం జ్ఞానమ్' అని ఏకస్వరూపముగానే, సర్వజ్ఞానములు భాసించుచున్నవి. జ్ఞానోత్పత్తి వినాశవ్యవహారము అవశ్యము కల్పింపదగిన విషయసంబంధముయొక్క ఉత్పత్తి వినాశములుగా గ్రహించినచో, విషయసంబంధమునకే ఉత్పత్తి వినాశములు గాని, జ్ఞానమునకు ఉత్పత్తి, వినాశములు అంగీకరింపబడుటలేదు గనుక, జ్ఞాననిత్యత్వము కుదురుచున్నది. ఘటమునకు మఱియొక ఘటముకంటె భేదము ఉపాధిపరామర్శ (దేశకాలాపేక్ష) లేకుండగానే ఆ యా ఘటవ్యక్తిభేదప్రతీతి కలుగుచున్నది గాన, 'ఘటములన్నియు, ఒకటి కాకూడదా' అను ప్రతిబంది (చోద్యోత్తరయోః సామ్యమ్) జ్ఞానమునకు ఇచ్చుటకు వీలులేదు గనుక, ఆకాశ, కాల దిక్కులకు గూడ, జ్ఞానైకత్వము అంగీకరించనిచో, నానాత్వము అంగీకరించవలసివచ్చును. కావున, కర్తృత్వ, భోక్తృత్వాది ధర్మములు ఆత్మధర్మములైనచో, వాని

నుండి విడివడుట– అనగా, మోక్షము సంభవము కాదు గనుక, ఆత్మ, స్వప్రకాశకము. ఇతరప్రకాశమును అపేక్షించదని అంగీకరించకపోయినచో, జగద్వ్యవహారము లుప్తము కావలసి వచ్చును గనుక, ఆత్మ అందఱకు పరమ ప్రేమాస్పదము గాన, ఆనందరూప మగుటచేతను, ఆత్మవస్తువు ధర్మములు లేనిది, నిత్యము, స్వప్రకాశము, ఆనందస్వరూపము అనునవి యుక్తులు. కనుక, 'అహం మనుష్యః, కర్తా, భోక్తా' అను ఈ ప్రతీతి సర్వజనానుభవసిద్ధమైనను, భ్రాంతిజ్ఞానమే అని పర్యవసానము కాగా,

### సి ద్ధా న్త బి న్దుః

ఇతి స్థితే తత్కారణమపి యోగ్యం కించిత్ కల్పనీయమ్। కల్ప్యమానం చ తత్ అద్వితీయాత్మని అధ్యస్తతయైవ ధర్మిగ్రాహకమానేన సిధ్యత ఇతి 'న జానామి' ఇతి సాక్షిప్రతీతిసిద్ధం అనాది అనిర్వాచ్యం అజ్ఞానమేవ తత్। న చ ఇదం అభావరూపమ్। జ్ఞానస్య నిత్యత్వేన తదభావానుపపత్తేః ఇత్యుక్తత్వాత్। ధర్మి ప్రతియోగి జ్ఞానాజ్ఞానాభ్యాం చ వ్యాఘాతాపత్తేః।

### భా వ దీ పి క

అని పర్యవసానము కాగా, 'అహం మనుష్యః, కర్తా, భోక్తా' అను భ్రాంతికి కారణము ఒకటి ఏదైనను, కల్పించితీర్చవలయును. కల్పింపబడునట్టి ఆ కారణము అద్వితీయమగు ఆత్మయందు అధ్యస్తముగానే సిద్ధించుచున్నది. అజ్ఞానగ్రాహకప్రమాణము అందుకు అనుకూలముగా ఉన్నది. 'న జానామి' నేను అజ్ఞానిని అను సాక్షిప్రతీతికి అజ్ఞానము గోచర మగుచున్నది. సాక్షిప్రతీతియే అజ్ఞానగ్రాహక ప్రమాణము. ఆ అజ్ఞానము సదసద్విలక్షణము (అనిర్వచనీయము). బ్రహ్మవలె సత్యము కాదు,

ఆకాశకుసుమాదులవలె నిస్స్వరూపమైనది కాదు. సత్త్వాసత్త్వము లకు ఆశ్రయము కాక, కార్యనిర్వాహకము అగుచున్నది. కొందఱు 'న జ్ఞానం అజ్ఞానమ్' అని జ్ఞానాభావముగా తలంతురు. అట్లు కాదు. జ్ఞానమునకు అభావము లేదు, నిత్యము. కనుక, జ్ఞానాభావము అను విషయమే, పొసగదు. ఈ విషయము వెనుక చెప్పబడినది. మఱియు, అభావమునకు అనుయోగి, ప్రతియోగి జ్ఞానము అవశ్యకము. 'భూతలే ఘటాభావః' భూతలము అనుయోగి, ఘటము ప్రతియోగి. అట్లే, జ్ఞానాభావమును తెలిసికొనుటకు అభావము యొక్క ప్రతియోగి, అనుయోగి యొక్క జ్ఞానము ఉండునని అంగీకరించినచో, 'అహం మూకః', 'మమ మాతా వంధ్యా' నేను మూగిని, నా తల్లి, గొడ్రాలు అన్నట్లుగా వ్యాఘాత దోషము ఏర్పడును.

## సిద్ధాన్తబిన్దుః

నాపి భ్రమ సంశయ తత్సంస్కార పరస్పరారూపమ్। అపరోక్షత్వాత్। అతీత అనాగత భ్రమ సంశయ తత్సంస్కారాణాం చ అపరోక్షత్వేన జ్ఞాతుం అశక్యత్వాత్। అవరణాత్మకత్వాత్ భ్రమాది ఉపాదానత్వాచ్చ ఆత్మనో నిర్వికారత్వాత్। అన్తఃకరణాదేశ్చ తజ్జన్యత్వాత్ 'దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్' ఇతి గుణవత్త్వ శ్రుతేశ్చ, 'మాయాం తు ప్రకృతిం విద్యాత్, మాయినం తు మహేశ్వరమ్', 'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే', 'అనృతేన ప్రత్యూఢాః, నీహారేణ ప్రావృతాః', 'భూయశ్చాన్తే విశ్వమాయానివృత్తిః' ఇత్యాది శ్రుతిభ్యశ్చ మాయా, అవిద్యా, అనిర్వాచ్యం, అనృతం, తత్త్వజ్ఞాన

నివర్త్యం చ అజ్ఞానమేవ స్వపరాధ్యాసే కారణమ్। న చ ఆత్మా శ్రయాది దోష ప్రసఙ్గః। అనాదిత్వేన తన్నిరాసాత్। అనాదిత్వేన ఉత్పత్త్యభావాత్। స్వ ప్రకాశాత్మన ఏవ తజ్జ్ఞప్తి రూపత్వాత్। తేన అజ్ఞానాధ్యాస విశిష్ట చైతన్యే అహంకారాధ్యాసః। తద్విశిష్టే కామ సంకల్పాదీనాం అహంకారధర్మాణాం ఇంద్రియధర్మాణాం చ కాణత్వ బధిరత్వ క్లీబత్వాదీనాం అధ్యాసః। ఇన్ద్రియాణాం తు పరోక్షత్వాత్ న అపరోక్షస్య ధర్మ్యధ్యాసః ఇతి సిద్ధాన్తః।

## భా వ దీ పి క

ఆ అజ్ఞానము భ్రమ, సంశయ, తజ్జన్య సంస్కార పరంపరయే గాని, వేదాన్తదర్శనమున అంగీకరించబడునది, అనిర్వచనీయమును అగు అజ్ఞానమును మేము అంగీకరించము అనినచో- అట్లు కాదు. 'అహం అజ్ఞః', 'అహం న జానామి' అను ఈ అనుభవము అపరోక్షరూపమే గాని, పరోక్షజ్ఞానము కాదు. భ్రమ, సంశయ, సంస్కారపరంపర (భూత,భవిష్యత్కాలములకు చెందినది) పరోక్షరూప మగుటచే, 'అహం న జానామి' అని, సంస్కారము అపరోక్షముగా గ్రహించుట సాధ్యపడదు. సంస్కారము అతీంద్రియము, పరోక్షము. కనుక, అనిర్వచనీయ మగు అజ్ఞానమును అంగీకరించి తీరవలయును. ఇది చీకటివలె ఆవరణస్వభావము కలది అగుటచే భ్రమ, సంశయాదులకు ఉపాదానకారణ మగుచున్నది. ఆత్మ, నిర్వికారము గనుక, భ్రమాదులకు ఉపాదానకారణము కాజాలదు. ఈ అజ్ఞానము వలననే, అంతఃకరణాదులు జనించుచున్నవి. ఇది, భావరూపము.

ఉపాదానకారణము, సత్త్వ, రజ, స్తమో గుణములతో నిగూఢమైన దేవాత్మశక్తిగా, పరమేశ్వరశక్తిగా, గుణములు కలదిగా శ్రుతియందు వర్ణింపబడినందున, గుణాశ్రయము జ్ఞానాభావము కాజాలదు. కార్యజనన సామర్థ్యము గల శక్తిస్వరూపము, మాయ. అదియే, అహంకారాదులకు ప్రకృతి. మాయాశ్రయుడు ఈశ్వరుడు. అపరిచ్ఛిన్నుడగు ఆత్మయే, బహురూపములగు అవిద్యాశక్తులచే నానారూపములు కలవాడుగా తెలియబడుచున్నాడు. జీవులందఱును, అజ్ఞానావృతులై యున్నారు. బ్రహ్మస్వరూపమును తెలిసికొనుటలేదు. 'మంచుచే కప్పబడినటుల, మిథ్యాభూతమగు అజ్ఞానముచే జీవులు ఆవరింపబడి ఉన్నారు'. 'జ్ఞానముచే సంచిత కర్మసహితముగా అవిద్య నశించినను, దేహపాతావసరమున, అవిద్యాలేశ మాయాశక్తు లన్నియు నివర్తించును' మొదలగు శ్రుతుల వలన, మాయ, అవిద్య, అనిర్వాచ్యము, అనృతము, తత్త్వజ్ఞాననివర్త్యము అగు అజ్ఞానమే అజ్ఞానాధ్యాసకు, అజ్ఞానాధ్యాసమూలకమైన అహంకార దేహేంద్రియాధ్యాసలకు కారణమై ఉన్నది. ఇచట, ఆత్మాశ్రయ దోషము ప్రసక్తము కాదు. ఆవరణ, విక్షేప కార్యప్రవాహము అనాదిగా దృష్టమగుచున్నందున, ఆ కార్యములకు కారణమగు వస్తువునకు అనాదిత్వము యుక్తమై ఉన్నది. కావున, అనాది వస్తువులకు ఉత్పత్తి లేకపోవుటవలన, స్వప్రకాశమగు ఆత్మయే, అజ్ఞానమునకు ప్రకాశకము అగుటచేతను, 'అహం న జానామి' 'అహమజ్ఞః' అను అజ్ఞానాధ్యాస, సాక్షిప్రత్యక్షసిద్ధము. అట్టి అజ్ఞానాధ్యాసవిశిష్ట చైతన్యమునందు అహంకారాధ్యాస కలుగుచున్నది. అహంకారాధ్యాసవిశిష్ట చైతన్యమునందు కామము,

సంకల్పము మొదలగు అహంకారధర్మములయొక్క అధ్యాసము, ఇంద్రియధర్మములగు కాణత్వ (చక్షురింద్రియ వైకల్యము), బధిరత్వము (చెవిటితనము), క్లీబత్వము (నపుంసకత్వము) మొదలగు ధర్మములయొక్క అధ్యాసము కలుగుచున్నది. చక్షురాది ఇంద్రియములు పరోక్షములు (ఇంద్రియగోచరములు కానివి). కనుక, 'అహం చక్షుః', 'అహం శ్రోత్రమ్' అను రీతిగా అపరోక్ష ఇంద్రియాధ్యాస లేదనునది సిద్ధాన్తము.

## సిద్ధాన్తబిన్దుః

తద్విశిష్టే స్థూల దేహాధ్యాసః ధర్మపురస్కారేణైవ 'అహం మనుష్యః' ఇత్యాద్యాకారః। న తు స్వరూపతః 'అహం దేహః' ఇతి అధ్యాసః। తథా ప్రతీత్యభావాత్। తద్విశిష్టే చ స్థౌల్యాదీనాం దేహధర్మాణాం అధ్యాసః। తద్విశిష్టే బాహ్యానాం పుత్ర భార్యాదీనాం సాకల్య వైకల్యాది ధర్మాధ్యాసః। ఏవం చైతన్యస్యాపి అహంకారాదిషు దేహపర్యన్తేషు అధ్యాసః సంసర్గతః। అధ్యాస వ్యవధాన తారతమ్యాచ్చ ప్రేమతారతమ్యమ్। తదుక్తం వార్తికాకృతే-

శ్లో॥ "విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్ పిణ్డః పిణ్డాత్తథేన్ద్రియమ్।
ఇన్ద్రియేభ్యః ప్రియః ప్రాణః ప్రాణాత్ ఆత్మా పరః
ప్రియః॥"

పిండః=స్థూలశరీరమ్, ప్రాణః అన్తఃకరణమ్। దేహాపేక్షయా చ ఇంద్రియాణాం ప్రియత్వం శత్రువృష్ట్యాది ఇతి ధారాపాతే చక్షురాదీనాం మేలనదర్శనాత్ అనుభవసిద్ధమ్। తేన అన్యోన్య

అధ్యాసాత్ చిదచిద్గ్రన్థిరూపః అధ్యాసః ఏకతరస్య అధ్యాసాంగీకారే అన్యతరస్య అభానప్రసఙ్గాత్। అధ్యస్తస్యైవ ప్రథమే భాననియమాత్। 'ఇమే రఙ్గరజతే' ఇతి సమూహాలంబనవత్ అవశ్యం ఇతరేతరాధ్యాసః। సర్వబాధావధిభూత చైతన్యపరిశేషేణ చ న శూన్యవాదాపత్తిః। సత్యానృతసంభేదావభాసత్వాత్ అధ్యాసస్య। తస్మాత్ పూర్వపూర్వాధ్యాసమూల ఏవాఽయం ఉత్తరోత్తర అహంకారాధ్యాసః బీజాంకురవ దనాదిః।అవిద్యాధ్యాసశ్చ ఏక ఏవ అనాదిః।

## భావదీపిక

ఆ అహంకారాది అధ్యాసవిశిష్ట చైతన్యమునందు స్థూల శరీరాధ్యాస 'అహం మనుష్యః' అను రీతిగా మనుష్యత్వరూప శరీరధర్మాకారముతోనే కలుగుచున్నది. కాని, 'అహం దేహః, శరీరమ్' అనురీతిగా దేహత్వాదివిశిష్ట స్వరూపాధ్యాస లేదు. లోకమునందు 'అహం దేహః' అను ప్రతీతి లేదు గనుక. 'అహం స్థూలః, గౌరః కృశః' నేను లావుగా ఉన్నాను, అను స్థూలత్వ గౌరత్వ కృశత్వములు మొదలగు దేహధర్మములయొక్క అధ్యాస కలదు. మనుష్యత్వధర్మవిశిష్ట చైతన్యమునందే దేహ ధర్మాధ్యాసలు కలుగుచున్నవి. ఈవిధముగా దేహధర్మాధ్యాసవిశిష్ట చైతన్యమునందు తన శరీరమునకు బహిర్గతులైన భార్యా పుత్రాదుల యొక్క సాకల్య,వైకల్య, సుఖ, దుఃఖాది ధర్మములు తనయందు అధ్యాసము చేసికొనబడుచున్నవి. ఈవిధముగా ఆత్మ యందు అజ్ఞాన, అహంకార, ఇంద్రియ, శరీరధర్మ, పుత్రభార్యాది సాకల్య, వైకల్య ధర్మాధ్యాసలే కాక, అనాత్మభూతములగు అహంకారము మొదలుకొని దేహము వఱకు గల అనాత్మపదార్థము

లందు గూడ, ఆత్మచైతన్యముయొక్క అధ్యాససంసర్గవశముచే (ప్రతిబింబరూపముతో)కలుగుచున్నది. ఆత్మయందు వాస్తవమైన ప్రేమ కలదు. అధ్యాసవ్యవధానతారతమ్యముచే ప్రేమతారతమ్యము కన్పట్టుచున్నది. 'వార్తికామృతము, అను గ్రంథమున ఈ విషయము ఇట్లు చెప్పబడినది.

"విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్ పిణ్డః పిణ్డాత్తథేన్ద్రియమ్,
ఇన్ద్రియేభ్యః ప్రియః ప్రాణః ప్రాణాదాత్మా
పరః ప్రియః ॥"

అందఱకు ధనము ప్రేమాస్పదమైనది. ధనముకంటె పుత్రుడు ప్రియుడు. పుత్రునికంటె శరీరము ప్రియము. శరీరముకంటె ఇంద్రియములు, ఇంద్రియములకంటె ప్రాణము, ప్రాణముకంటె ఆత్మ, మిక్కిలి ప్రియమైనది అని భావము.

పిండము అనగా స్థూలశరీరము. ప్రాణము అనగా అంతఃకరణము. శరీరముకంటె గూడ, ఇంద్రియములు ప్రియములైనవి అనుట శస్త్రవర్ష ధారాపాతములందు కన్నులను మూయుటచే అనుభవసిద్ధము. అందుచేత, ఆత్మ, అనాత్మల అన్యోన్యాధ్యాస వలన చిదచిద్గ్రంథి, చిజ్జడ అహంకారగ్రంథి రూపమగు అధ్యాస కలుగుచున్నది. ఇచట, ఆత్మయందు ఆత్మసంసర్గాధ్యాస మాత్రమే చెప్పబడినది. కేవలము ఆత్మయందు అనాత్మ అధ్యాసయే అంగీకరించినచో సర్పప్రతీతికాలమున రజ్జువుయొక్క ప్రతీతి లేనట్లు, ఆత్మయొక్క భానము లేకపోవలసివచ్చును. అట్లే, కేవల ఆత్మ (సంసర్గ) అధ్యాస అనాత్మయందు అంగీకరించినచో

అనాత్మ శరీరేంద్రియాది పదార్థముల యొక్క ప్రతీతి లేకపోవలసి వచ్చును. కనుక, అన్యోన్యాధ్యాస అంగీకరింపబడినది.

'అయో దహతి' ఇనుము కాల్చుచున్నది అనుచోట అయస్సు (ఇనుము) నందు అగ్న్యధ్యాస. "చతుష్కోణోఽగ్నిః" నాలుగు (కోణములు) పలుకలు గలది అగ్ని, అనుచోట అగ్ని యందు అయోధర్మమగు చతుష్కోణము యొక్క అధ్యాస. అచట, అగ్ని, అయస్సులకు అన్యోన్యాధ్యాస.

ఆత్మానాత్మలలో ఒకదానియొక్క అధ్యాసయే అంగీకరించినచో, రెండవదానియొక్క ప్రతీతి లేకపోవలసివచ్చును. అధ్యస్త పదార్థమే బ్రహ్మజ్ఞానమునందు భాసించునను నియమము గలదుగనుక. 'ఇమే రంగ రజతే' ఇది తగరము, ఇది వెండి అను ఆకారమే కాక, వెండిని తగరమని, తగరమును వెండియని సమూహాలంబనముగా నానావిశేష్యక, నానాప్రకారక భ్రాంతిజ్ఞానము సమూహాలంబనము వలె అవశ్యము ఆత్మానాత్మలకు ఇతరేతరాధ్యాస (అన్యోన్యాధ్యాస) అంగీకరించవలయును. ఇట్లు చెప్పుట వలన అధిష్ఠాన తత్త్వజ్ఞానానన్తరము అధ్యస్త అనాత్మ పదార్థములు అన్నియు బాధింపబడినను, అవధిభూతమైన ఆత్మ వస్తువు పరిశేషించి ఉండుటచేత శూన్యవాదప్రసక్త్యాపత్తి లేదు. అధ్యాస సత్య అనృత పదార్థములు కలసి భాసించును గనుక, అధిష్ఠానమగు సత్యము మిగిలి ఉండును. కనుక, పూర్వపూర్వ అధ్యాసమూలకమగు ఉత్తరోత్తర అహంకారాధ్యాస బీజాంకురములవలె అనాది అయి ఉన్నది. అనగా, ఇప్పుడు కలుగు అహంకారాధ్యాసకు పూర్వ అహంకారాధ్యాస మూలము. భ్రమ, ప్రమ, సాధారణ అనుభవ

జన్య సంస్కారమే అధ్యాసమునకు మూలము. ఈ అహంకారాధ్యాసకు పూర్వము అజ్ఞానాధ్యాస కలదు. అదియే అనాది. అహంకారాధ్యాస, కార్యాధ్యాస బీజాఙ్కురవత్ అనాది అనియు, అహంకారకారణ అజ్ఞానాధ్యాస, అనాది కారణాధ్యాస అనియు విభాగము.

## సి ద్ధా న్త బి న్దుః

నను, అధ్యాసస్య అనాదిత్వే స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాసః అధ్యాసః ఇతి వదతా భాష్యకారేణ స్మృతిరూపత్వేన సంస్కారజన్యత్వం ఉక్తం విరుధ్యేత ఇతి చేత్ న। కార్యాధ్యాసాభిప్రాయత్వాత్ తస్య। పరత్ర పరావభాసః ఇత్యేతావన్మాత్రస్యైవ ఉభయానుగతస్య లక్షణత్వాత్। యద్వా సత్యానృతే మిథునీకృత్య ఇతి భాష్యవచనాత్ సత్యమిథ్యావస్తు సంభేదావభాసః అధ్యాసః ఇత్యేవ సిద్ధాన్తలక్షణమ్। తేన కారణాధ్యాసేఽపి న లక్షణావ్యాప్తిః॥ కార్యాధ్యాసస్య చ ప్రవాహరూపేణ బీజాఙ్కురవత్ అనాదిత్వాభిధానాత్ న కోఽపి దోషః। ఏవం అధ్యాసే సిద్ధే ఏకస్య ఆత్మనః జీవేశ్వరాదివ్యవస్థా మానమేయాది ప్రతికర్మ వ్యవస్థా చ ఉపపద్యతే।

## భా వ దీ పి క

ఓయీ! ఆత్మయందు అవిద్యాధ్యాస అనాది అయినచో 'స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాసః అధ్యాసః' అని భాష్యకారులు అధ్యాసలక్షణమును స్మృతిరూపముగా, అనగా స్మృతివలె సంస్కారజన్యముగా చెప్పి ఉన్నారు. ఆ లక్షణము

అజ్ఞానాధ్యాస, అనాది అని చెప్పుటవలన, అజన్యము అని చెప్పినట్లైనది గదా! సంస్కారజన్యత్వమను లక్షణము దీనియందు విరోధించును అనినచో - అట్లు కాదు. కార్యాధ్యాసాభిప్రాయమ్ము తోనే 'స్మృతిరూపః' అను లక్షణము చెప్పబడినది. అనగా ఆ లక్షణము కార్యాధ్యాసలకొరకే చెప్పబడినది. అజ్ఞానాధ్యాస కారణాధ్యాస గనుక, ఆ లక్షణము దీనికి వర్తించదు. కార్యాధ్యాస, కారణాధ్యాసలు రెంటికి అనుగతమగు లక్షణము కావలయునని అనినచో, 'పరత్ర పరావభాసః' అనియే అధ్యాస సామాన్య లక్షణము. ఆత్మ అనెడి అధిష్ఠానమునందు ఆత్మాన్యమగు అజ్ఞానముయొక్క అధ్యాస కలదుగనుక, ఈలక్షణము కారణాధ్యాస యందు గూడ, సమన్వితమగుచున్నది. లేదా, అధ్యాస సామాన్య లక్షణము 'సత్యానృతే మిథునీకృత్య' అను భాష్యవచనమువలన సత్యమిథ్యావస్తు సంభేదావభాసము. అనగా, సత్యమగు వస్తువు నకు మిథ్యావస్తువుతో తాదాత్మ్యప్రతీతి అధ్యాస. ఇదియే సిద్ధాన్త లక్షణము. ఈ లక్షణము కారణాధ్యాసకు గూడ వర్తించుచున్నది గనుక, అధ్యాసలక్షణమునకు అవ్యాప్తి లేదు. ఇందు, అధిష్ఠాన మగు ఆత్మ సత్యము, అధ్యస్తమగు అజ్ఞానము మిథ్యాభూతము, ఇట్లే, సర్వత్ర, అధ్యాసస్థలములందు అధిష్ఠానము సత్యముగాను, అధ్యస్తము మిథ్యాభూతముగాను గ్రహించవలయును. కార్యాధ్యాసయగు అహంకారాధ్యాస, పూర్వపూర్వ అహంకారా ధ్యాసజన్య సంస్కారముచే కలుగుచున్నది; ఉత్తరోత్తర అహంకారాధ్యాసకు కారణమగుచున్నది. కనుక, 'బీజాత్ అఙ్కురః, అఙ్కురాత్ బీజమ్' అనురీతిగా జలప్రవాహన్యాయముతో పూర్వ జలము పోయినను తత్స్థానమున, జలము వచ్చి చేరుటచే

ప్రవాహము అనాది అని వ్యవహరించబడుచున్నను పూర్వపూర్వ అహంకారాధ్యాస పోయినను, తత్స్థానమందు ఉత్తరోత్తర అహంకారాధ్యాస వచ్చుచునుగనుక, ప్రవాహానాదిత్వము కార్యాధ్యాసకు చెప్పబడినది. కనుక, ఎట్టిదోషము లేదు.

ఈవిధముగా అధ్యాస ఆత్మానాత్మలకు సిద్ధించగా, 'ఏకమేవాఽద్వితీయమ్', 'ఆత్మైవేదం సర్వమ్' అను ఉపనిషత్తుల ననుసరించి ఆత్మవస్తువు ఒక్కటే సత్యమను సిద్ధాన్తమునందు జీవేశ్వరవ్యవస్థ, ప్రమాణ, ప్రమేయ, ప్రమాత, ప్రమితి విషయ వ్యవస్థయు, ఉపపన్నమగుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

తథా హి। అజ్ఞాన ఉపహితః ఆత్మా, అజ్ఞానతాదాత్మ్యాపన్నః, స్వచిదాభాస వివేకాత్ అంతర్యామీ సాక్షీ జగత్కారణం ఇతి చ కథ్యతే । బుద్ధ్యుపహితశ్చ తత్తాదాత్మ్యాపన్నః స్వచిదాభాస అవివేకాత్ జీవః, కర్తా భోక్తా ప్రమాతా ఇతి చ కథ్యతే ఇతి వార్తికకారపాదాః। ప్రతిదేహం బుద్ధీనాం చ భిన్నత్వాత్ తద్గత చిదాభాసభేదేన తదవివిక్తం చైతన్యమపి భిన్నమివ ప్రతీయతే। అజ్ఞానస్య తు సర్వత్ర అభిన్నత్వాత్ తద్గత చిదాభాస భేదాభావాత్ తదవివిక్తసాక్షిచైతన్యస్య న కదాచిదపి భేదభానమితి। అస్మింశ్చ పక్షే తత్త్వమాది పదే జహల్లక్షణా ఇవ। సాభాసస్య ఉపాధేః వాచ్యార్థస్య భానాత్। ఆభాసస్యాపి జడాజడ విలక్షణత్వేన అనిర్వచనీయత్వాత్।

## భావదీపిక

సాధారణముగా లోకమున, జీవాత్మ సంసారి, ఈశ్వరుడు పరమాత్మ, అసంసారి, సృష్టి, స్థితి, లయములు చేయువాడు. గనుక, జీవాత్మ వేఱు, పరమాత్మ వేఱను భావము ఉన్నది. అట్లే, జీవులు సుఖదుఃఖ తారతమ్యభేదము కలిగిఉన్నారు. కనుక, ఒక జీవుడు మఱియొక జీవునికంటె భిన్నమైనవాడు అను అభిప్రాయము కలదు. కొన్ని దర్శనములయందు ఈ ఆత్మభేదము సిద్ధాన్తముగా అంగీకరింపబడినది. కాని, ఉపనిషత్తులందు ఆత్మైకత్వ సిద్ధాన్తము ప్రతిపాదితము. అపుడు జీవేశ్వరవ్యవస్థ ఒకే ఆత్మయందు ఎట్లు సంభవమను ప్రశ్నకు జవాబుగా ఈ అధ్యాస నిరూపింపబడినది. అధ్యాస వలన, జీవేశ్వరవ్యవస్థను ప్రమాతృ, ప్రమేయ, ప్రమాణ, ప్రమితి, విషయవ్యవస్థను ఉపపాదించుచున్నారు.

అజ్ఞానము అనిర్వచనీయము, అనాది అని చెప్పబడినది. ఆ అజ్ఞానమనెడి ఉపాధితో తాదాత్మ్యమును పొందిన ఆత్మ ఆ అజ్ఞానమునందు తన ప్రతిబింబముచే ఏర్పడిన చిదాభాస స్వరూపమును వివేకముతో గ్రహించుచు అంతర్యామి = సర్వప్రేరకుడు, సాక్షి = సర్వవ్యవహార హేతు జ్ఞానస్వరూపుడు, జగత్కారణమ్=జగత్ సృష్టి, స్థితి, లయకారణము అనియు చెప్పబడుచున్నాడు. ఈయనయే, ఈశ్వరుడు. ఇక, బుద్ధి అను ఉపాధితో గూడిన ఆత్మ, బుద్ధితాదాత్మ్యమును పొందినవాడై, బుద్ధిగత చిత్ప్రతిబింబ రూపమగు చిదాభాసునితో, వివేకమును కోల్పోయి, భేదమును గ్రహించనేరక, చిదాభాసుడు, తాను, ఏకమేనని

భావించుచు, జీవుడగుచున్నాడు. ఇతడే కర్త, భోక్త, ప్రమాత అనియు వ్యవహరింపబడుచున్నాడు. పూజ్యులు, వార్తిక కారులగు సురేశ్వరాచార్యులు జీవేశ్వరవ్యవస్థను ప్రతిపాదించుచున్నారు.

అవిద్యోపాధి వలన, ఈశ్వరుడును, బుద్ధిఉపాధి వలన జీవుడును ఏర్పడుచున్నారనియు, ఈశ్వరుడు అవిద్యా ప్రతిబింబమును వివేకముతో గ్రహించగా, బుద్ధి ఉపాధితో గూడిన జీవుడు, బుద్ధిప్రతిబింబ చిదాభాసరూపమును అవివేకముగా (చిదాభాసుడే తానుగా) భావించుచున్నాడు. అట్టి చిదాభాస అవివేకము వలననే జీవుడు కర్త, భోక్త, ప్రమాత అని చెప్పబడుచున్నాడని వివరించిరి.

ఆత్మ, చిద్రూపము ఒక్కటియే అయినను, బుద్ధులు శరీర భేదముచేత ప్రతి శరీరభిన్నములు గనుక, ఆ బుద్ధులయందలి చిదాభాసులు గూడ, భిన్న భిన్నమైనవారగుటచే ఆ చిదాభాస వివేకములేని చైతన్యము గూడ, భిన్న భిన్నముగా తోచును. బుద్ధి చిదాభాసభేదములచే ఏకమగు ఆత్మచైతన్యము గూడ, భిన్నముగా తోచుచు,జీవులు నానా అను అభిప్రాయము కలిగించుచున్నది. ఈశ్వరునకు గల అజ్ఞానమను ఉపాధి అంతట, ఏక రూపమే అగుటచేత బుద్ధిగత చిదాభాసునివలె, అజ్ఞానగత చిదాభాసుడు భిన్న భిన్నమైనవాడు కాకపోవుటచే, అజ్ఞానోపాధి తాదాత్మ్యపన్న సాక్షిచైతన్యము ఏకరూపమే గనుక, ఈశ్వరుడు ఒక్కడుగానే భాసించును. జీవభేదము వలె ఈశ్వరభేదము లేదు.

ఈ పక్షమున 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములందలి 'తత్', 'త్వమ్' మొదలగు పదములందు జహల్లక్షణయే, అంగీకరించవలెను. ఆ పదములకు ఆభాసతో గూడిన ఉపాధియే వాచ్యార్థమైనందున, వాచ్యార్థ బ్రహ్మైత్మైక్యమునందు ఉపాధిః ఉపాధిగతుడగు ఆభాసుడు వదలిపెట్టబడుచున్నారు గనుక. అయితే, ఈ అభాసుడు ఘటాదులవలె జడమైనవాడు కాడు. ఆత్మవలె అజడుడు, చిద్రూపుడును కాడు. జడాజడ విలక్షణుడై చేతనునివలె వ్యవహరించు అనిర్వచనీయ స్వరూపుడై ఉన్నాడు.

## సిద్ధాన్తబిన్దుః

తదుక్తం సంక్షేపశారీరకే-

శ్లో॥ సాభాసాజ్ఞానవాచీ యది భవతి పునః బ్రహ్మశబ్దస్తదాఽహమ్।
శబ్దోఽహంకారవాచీ భవతి తు జహతీ లక్షణా తత్ర పక్షే॥ ఇతి।

న చ ఆభాసస్యైవ బద్ధత్వాత్ కేవల చైతన్యస్య ముక్తత్వాత్ బంధమోక్షయోః వైయధికరణ్యమ్। స్వనాశార్థః ప్రవృత్తి అనుపపత్తిశ్చ ఇతి వాచ్యమ్। కేవల చైతన్యస్యైవ ఆభాసద్వారా బద్ధత్వాభ్యుపగమాత్। తదుక్తం వార్తికకారైః।

శ్లో॥ అయమేవ హి నో అనర్థః యత్ సంసారి ఆత్మదర్శనమ్ ఇతి। తేన శుద్ధచైతన్యస్య ఆభాస ఏవ బన్ధః తన్నివృత్తిశ్చ మోక్ష ఇతి న కించిత్ అసంమజసమ్। అథవా, ఆభాస అవివిక్తచైతన్యమపి తత్త్వమసి పదవాచ్యమ్। తేన వాచ్యైకదేశస్య అత్యాగాత్। అస్మిన్ పక్షే జహదజహల్లక్షణ ఏవేతి. న కోఽపి దోషః। అయమేవ పక్షః ఆభాసవాద ఇతి గీయతే।

ఈ పక్షమున 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములందలి 'తత్', 'త్వమ్' మొదలగు పదములందు జహల్లక్షణయే, అంగీకరించవలెను. ఆ పదములకు ఆభాసతో గూడిన ఉపాధియే వాచ్యార్థమైనందున, వాచ్యార్థ బ్రహ్మాత్మైక్యమునందు ఉపాధి, ఉపాధిగతుడగు ఆభాసుడు వదలిపెట్టబడుచున్నారు గనుక. అయితే, ఈ ఆభాసుడు ఘటాదులవలె జడమైనవాడు కాడు. ఆత్మవలె అజడుడు, చిద్రూపుడును కాడు. జడాజడ విలక్షణుడై చేతనునివలె వ్యవహరించు అనిర్వచనీయ స్వరూపుడై ఉన్నాడు.

సిద్ధాన్తబిన్దుః

తదుక్తం సంక్షేపశారీరకే—

శ్లో॥ సాభాసాజ్ఞానవాచీ యది భవతి పునః బ్రహ్మశబ్దస్తదాఽహమ్।
శబ్దోఽహంకారవాచీ భవతి తు జహతీ లక్షణా తత్రపక్షే॥ ఇతి।

న చ ఆభాసస్యైవ బద్ధత్వాత్ కేవల చైతన్యస్య ముక్తత్వాత్ బంధమోక్షయోః వైయధికరణ్యమ్। స్వనాశార్థః ప్రవృత్తి అనుపపత్తిశ్చ ఇతి వాచ్యమ్। కేవల చైతన్యస్యైవ ఆభాసద్వారా బద్ధత్వాభ్యుపగమాత్। తదుక్తం వార్తికకారైః।

శ్లో॥ అయమేవ హి నో అనర్థః యత్ సంసారి ఆత్మదర్శనమ్ ఇతి। తేన శుద్ధచైతన్యస్య ఆభాస ఏవ బన్ధః తన్నివృత్తిశ్చ మోక్ష ఇతి న కించిత్ అసమంజసమ్। అథవా, ఆభాస అవివిక్తచైతన్యమపి తత్త్వమసి పదవాచ్యమ్। తేన వాచ్యైకదేశస్య అత్యాగాత్। అస్మిన్ పక్షే జహదజహల్లక్షణ ఏవేతి న కోఽపి దోషః। అయమేవ పక్షః ఆభాసవాద ఇతి గీయతే।

భావదీపిక

సంక్షేపశారీరకమున, ఆ విషయము, ఇట్లు చెప్పబడినది. 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యమునందు 'బ్రహ్మ' శబ్దమునకు ఆభాసునితోగూడిన అజ్ఞానము వాచ్యార్థము. అప్పుడు 'అహం' శబ్దమునకు ఆభాసునితో కూడిన అహంకారము వాచ్యార్థము. అప్పుడు బ్రహ్మాత్మైక్య లక్షణమగు వాచ్యార్థము కొఱకు బ్రహ్మ శబ్దమునందు జహల్లక్షణ చెప్పవలయును. అనగా, ఆభాస అహంకార వాచ్యార్థమును విడనాడి, బింబభూతమగు (ఆత్మ, బ్రహ్మ) లక్ష్యార్థ మగును. 'అహం' శబ్దమునందు ఆభాస, అహంకారములను విడనాడి, ఆత్మయందు లక్షణ చెప్పవలెను. ఈవిధముగా జహల్లక్షణను ఆశ్రయించి బ్రహ్మాత్మైక్యరూపమగు వాచ్యార్థము ఉపపన్నమగుచున్నది.

ఈ పక్షమున, ఆభాసుడే సంసారబంధము కలవాడు. కేవల చైతన్యము తత్త్వజ్ఞానాభివ్యక్తి పూర్ణానంద స్వరూపము. అనగా ముక్తము అని చెప్పినందువలన, చిదాభాసునికి బంధమనియు, కేవల చైతన్యమునకు మోక్షమనియు చెప్పినట్లయినది. ఒకేచోట బంధమోక్షములు చెప్పబడలేదు, బంధమెవరికో, మోక్షము వారికి చెప్పుట న్యాయము కదా! ఇదిగాక, బద్ధుడైన చిదాభాసుడు తన నాశము కొఱకు కేవల చైతన్య ముక్తస్వరూపమునకై శ్రవణాది సాధనములందు ప్రవర్తించుట ఉపపన్నము కాదని ఆక్షేపించ రాదు. కేవల చైతన్యమునకే, ఆభాస తాదాత్మ్యము ద్వారా బద్ధత్వము, మోక్షము అంగీకరించుటచేత బంధ, మోక్షములకు వైయధికరణ్యము లేదు. పూజ్యులగు వార్తికకారులచే ఆ

విషయము చెప్పబడినది. మనము అధిష్ఠానభూత చిన్మాత్ర స్వరూపులమై ఉండగా, సంసారస్వభావము గల చిదాభాస తాదాత్మ్యదర్శనము ఏది కలదో, ఇదియే అనర్థము. అందుచేత శుద్ధచైతన్యమునకు ఆభాసుడే బంధము. ఆభాసనివృత్తియే మోక్షము. కనుక, అసమంజసమైనది ఏదియు లేదు. లేదా, మఱియొక పక్షము చెప్పబడుచున్నది. 'తత్త్వమసి' మహా వాక్యమునందు 'తత్', 'త్వమ్' పదములకు ఆభాస అవివిక్త చైతన్యపర్యంతము వాచ్యార్థము. బ్రహ్మాత్మైక్యలక్షణ వాచ్యార్థ బోధ కాలమున, అజ్ఞాన, తదాభాసులు, బుద్ధి, తదాభాసులు ఏకదేశము పరిత్యజింపబడినను, వాచ్యార్థములోని విశేష్యమగు చైతన్యాంశము యొక్క త్యాగము లేదుగనుక, ఈ పక్షమున 'తత్'త్వమ్, పదము లకు జహదజహల్లక్షణయే స్వీకరింపబడుచున్నది గనుక, ఏ దోషము లేదు. ఈ పక్షమే 'ఆభాసవాదము' అని వ్యవహరింపబడుచున్నది. ప్రతిబింబము స్వరూపముచే మిథ్యాభూతము అనెడి వాదము ఆభాసవాదము.

## సిద్ధాన్తబిన్దుః

అజ్ఞానోపహితం బింబచైతన్యం ఈశ్వరః। అన్తఃకరణ తత్సంస్కారావచ్ఛిన్న అజ్ఞానప్రతిబింబితం చైతన్యం జీవః ఇతి వివరణకారాః। అజ్ఞానప్రతిబింబితం చైతన్యం ఈశ్వరః, బుద్ధి ప్రతిబింబితం చైతన్యం జీవః। అజ్ఞాన ఉపహితం బింబచైతన్యం శుద్ధమితి సంక్షేపశారీరకకారాః। అనయోః పక్షయోః బుద్ధిభేదాత్ జీవనానాత్వమ్। ప్రతిబింబస్య పారమార్థికత్వాత్ జహదజహల్లక్షణా ఇవ తత్త్వమాది పదేషు। ఇయమేవ చ ప్రతిబింబవాద మాచక్షతే।

## భా వ దీ పి క

ఇక, ప్రతిబింబవాదము చెప్పబడుచున్నది. ప్రతిబింబము స్వరూపముచే సత్యమైనది. ప్రతిబింబత్వరూపముతో మిథ్యాభూతము. అనగా, బింబమే ప్రతిబింబరూపమన్న ప్రతిబింబసత్యతా వాదము చెప్పబడుచున్నది. అజ్ఞానోపాధితో కూడుకొని బింబ చైతన్యము ఈశ్వరుడు. అంతఃకరణ తత్సంస్కారముతో కూడిన అజ్ఞానమునందు, ప్రతిబింబిత చైతన్యము జీవుడు అని వివరణకారులు వచించుచున్నారు. సంక్షేపశారీరకకారులు ఇట్లు చెప్పుచున్నారు— అజ్ఞాన ప్రతిబింబచైతన్యము ఈశ్వరుడు. బుద్ధి ప్రతిబింబిత చైతన్యము జీవుడు. అజ్ఞానోపాధిచే బింబభూతముగా ఉన్న చైతన్యము శుద్ధబ్రహ్మ. ఈ రెండు పక్షములలోను బుద్ధి ఉపాధులయొక్క భేదము వలన, జీవులు అనేకులు అగుచున్నారు. వీరి మతమున, ప్రతిబింబము పారమార్థికము, సత్యమే గనుక, తత్త్వమాది పదములందు జహదజహలక్షణయే అంగీకరింపబడును. దీనినే, ప్రతిబింబవాదము అనుచున్నారు.

## సి ద్ధా న్త బి న్దుః

అజ్ఞాన విషయీకృతం చైతన్యం ఈశ్వరః। అజ్ఞానాశ్రయీభూతం చ జీవః ఇతి వాచస్పతి మిశ్రాః। అస్మింశ్చ పక్షే అజ్ఞాన నానాత్వాత్ జీవ నానాత్వమ్। ప్రతిజీవం చ ప్రపఞ్చభేదః। జీవస్యైవ స్వాజ్ఞాన ఉపహితతయా జగదుపాదానత్వాత్। ప్రత్యభిజ్ఞా చాపి సాదృశ్యాత్। ఈశ్వరస్య చ సప్రపఞ్చ జీవావిద్యాధిష్ఠానత్వేన కారణత్వోపచారాదితి। అయమేవ చ అవచ్ఛేదవాదః।

## భావదీపిక

అనిర్వచనీయమగు అజ్ఞానమునకు విషయమైన చైతన్యము ఈశ్వరుడు. అజ్ఞానమునకు ఆశ్రయమైన చైతన్యము జీవుడు. అనివాచస్పతిమిశ్రులు. 'అహమజ్ఞః' నేను అజ్ఞానమునకు ఆశ్రయమైనవాడను అను అనుభవము జీవునకే కలదు గనుక, జీవుడే అజ్ఞానాశ్రయుడు అని వారి భావము. అజ్ఞానకార్యమగు 'బ్రహ్మ నాస్తి' అను వ్యవహారము జీవునిదిగనుక, అజ్ఞానము జీవాశ్రితము. ఈ పక్షమున, అజ్ఞానములు అనేకములు గనుక, జీవులు అనేకులై యున్నారు. ఒక్కొక్క జీవునకు వాని వాని అజ్ఞానమువలన, వాని ప్రపంచము వేఱైయున్నది. అజ్ఞానోపాధితో గూడిన జీవుడే జగత్తునకు ఉపాదానకారణము, సాధారణముగా ఈశ్వరుడు జగదుపాదానమను వ్యవహారము, జగదుపాదానజీవనిష్ఠ అవిద్యా విషయుడు అని అర్థమును గ్రహించవలయును. 'సోఽయం ప్రపఞ్చః' అను ఇతర జీవసాధారణము ప్రపంచమన్న ప్రత్యభిజ్ఞ (ప్రత్యక్షము) 'తదేవ ఔషధమ్' అనురీతిగా సాదృశ్యమువలన గ్రహించవలెను. ఈశ్వరుడు ప్రపంచముతో గూడిన జీవునియొక్క అవిద్యకు, అధిష్ఠానమైనందున, ప్రపంచమునకు కారణమని గౌణముగా వ్యవహరింపబడుచున్నాడు. ఇదియే, అవచ్ఛేద వాదము.

## సిద్ధాన్తబిన్దుః

అజ్ఞానోపహితం బింబచైతన్యం జీవః ఇతి వా। అజ్ఞాన అనుపహితం శుద్ధచైతన్యం ఈశ్వరః, అజ్ఞాన ఉపహితం చైతన్యం జీవ ఇతి వా ముఖ్యో వేదాన్తసిద్ధాన్తః ఏకజీవవాదాఖ్యః। ఇమమేవ

దృష్టి సృష్టివాద మాచక్షతే। అస్మింశ్చ పక్షే జీవ ఏవ స్వ అజ్ఞాన వశాత్ జగదుపాదానం నిమిత్తం చ। దృశ్యం సర్వం ప్రాతీతికమ్। దేహభేదాచ్చ జీవభేదభ్రాన్తిః। ఏకస్యైవ చ స్వకల్పిత గురుశాస్త్రాది ఉపబృంహిత శ్రవణమననాది దార్ఢ్యాత్ ఆత్మసాక్షాత్కారే సతి మోక్షః। శుకాదీనాం చ మోక్షశ్రవణం తు అర్థవాదః। మహావాక్యే చ తత్పదం అనన్తసత్యాదిపదవత్ అజ్ఞాన అనుపహిత చైతన్యస్య లక్షణయా ఉపస్థాపకమ్। ఇత్యాద్యాః అవాన్తరభేదాః స్వయం ఊహనీయాః।

భా వ దీ పి క

అజ్ఞాన ఉపాధితో బింబచైతన్యము ఈశ్వరుడు. అజ్ఞాన ప్రతిబింబచైతన్యము జీవుడు అనిగాని, అజ్ఞానోపాధినిర్ముక్తము, నిరుపాధికము అగు శుద్ధచైతన్యము ఈశ్వరుడు, అజ్ఞానోపాధితో కూడిన చైతన్యము జీవుడు అనిగాని, ముఖ్యమైన వేదాన్తసిద్ధాన్తము 'ఏకజీవవాదము' అను పేరుతో వ్యవహరింపబడుచున్నది. దీనినే దృష్టిసృష్టి వాదము అందురు. ఈ వాదమున, జీవుడే తన అజ్ఞాన వశమువలన జగత్తునకు ఉపాదానకారణము, నిమిత్తకారణము కూడ అయి ఉన్నాడు. దృశ్యము అంతయు, ప్రాతిభాసికము. దేహ భేదమువలన, జీవభేద భ్రాంతి కలుగుచున్నది. ఒకే జీవునకు తనచే కల్పింపబడిన గురు శాస్త్రాదులచే ఉపోద్బలితమైన శ్రవణ మననాదులయొక్క దార్ఢ్యమువలన, ఆత్మసాక్షాత్కారము కలుగగా మోక్షము లభించును. శుక, వామదేవాదులకు ('శుకో ముక్తః వామ దేవోఽపి ముక్తః విహంగమ పిపీలకామార్గేణ) మోక్షము చెందిరి అను మాటలు అర్థవాదము. మహావాక్యమునందైతే తత్పదము

అనంత, సత్యాది పదముల వలె అజ్ఞాన అనుపహితమగు శుద్ధ చైతన్యమును లక్షణావృత్తిచే స్మరింపజేయును మొదలగు అవాంతరభేదములు స్వయముగా ఊహించుకొనదగినవి.

## సిద్ధాన్తబిన్దుః

నను, వస్తుని వికల్పసంభవాత్ కథం పరస్పర విరుద్ధ ప్రామాణ్యమ్ ? తస్మాత్ కిమత్ర హేయమ్, కిం ఉపాదేయమ్ ? ఇతి చేత్ న। క ఏవ మాహ ? వస్తుని వికల్పా న సంభవతీతి। స్థాణుర్వా పురుషో వా రాక్షసో వా ఇత్యాది వికల్పస్య వస్తున్యపి దర్శనాత్। అతాత్త్వికీ సా కల్పనా పురుషబుద్ధిప్రభవా। ఇయం తు శాస్త్రీయా జీవేశ్వర విభాగాదివ్యవస్థా ఇతి చేత్, నూనం,అతిమేధావీ భవాన్। అద్వితీయ ఆత్మతత్త్వం హి ప్రధానమ్, ఫలవత్త్వాత్, అజ్ఞాతత్వాచ్చ। ప్రమేయం శాస్త్రస్య। జీవేశ్వరవిభాగాది కల్పనాస్తు పురుషబుద్ధిప్రభవా అపి శాస్త్రేణ అనూద్యన్తే। తత్త్వజ్ఞానోపయోగిత్వాత్। ఫలవత్సన్నిధౌ అఫలం తదఙ్గమితి న్యాయాత్। భ్రమసిద్ధస్యాపి శ్రుత్యా అనువాదసంభవాత్।

## భావదీపిక

ఓయీ ! వస్తువునందు పురుషప్రయత్నము లేదు గనుక వికల్పము (విరుద్ధ పక్షద్వయబోధక వాక్యములకు ప్రామాణ్యము) సంభవించదు గనుక, పరస్పరవిరుద్ధ మతములకు ప్రామాణ్యము ఎట్లు సంభవించును ? కనుక, ఈజీవేశ్వరస్వరూప వివరణ పక్షములలో ఏది పరిత్యజింపదగినది ? ఏది స్వీకరింపదగినది ? అనినచో, అట్లు కాదు. వస్తువునంధు వికల్పము సంభవించదు అని ఎవరు

అనంత, సత్యాది పదముల వలె అజ్ఞాన అనుపహితమగు శుద్ధ చైతన్యమును లక్షణావృత్తిచే స్మరింపజేయును మొదలగు అవాంతరభేదములు స్వయముగా ఊహించుకొనదగినవి.

సిద్ధాన్తబిన్దుః

నను, వస్తుని వికల్పసంభవాత్ కథం పరస్పర విరుద్ధ ప్రామాణ్యమ్ ? తస్మాత్ కిమత్ర హేయమ్, కిం ఉపాదేయమ్ ? ఇతి చేత్ న। క ఏవ మాహ ? వస్తుని వికల్పా న సంభవతీతి। స్థాణుర్వా పురుషో వా రాక్షసో వా ఇత్యాది వికల్పస్య వస్తున్యపి దర్శనాత్। అతాత్త్వికీ సా కల్పనా పురుషబుద్ధిప్రభవా। ఇయం తు శాస్త్రీయా జీవేశ్వర విభాగాదివ్యవస్థా ఇతి చేత్, నూనం,అతిమేధావీ భవాన్। అద్వితీయ ఆత్మతత్త్వం హి ప్రధానమ్, ఫలవత్త్వాత్, అజ్ఞాతత్వాచ్చ। ప్రమేయం శాస్త్రస్య। జీవేశ్వరవిభాగాది కల్పనాస్తు పురుషబుద్ధిప్రభవా అపి శాస్త్రేణ అనూద్యన్తే। తత్త్వజ్ఞానోపయోగిత్వాత్। ఫలవత్సన్నిధౌ అఫలం తదఙ్గమితి న్యాయాత్। భ్రమసిద్ధస్యాపి శ్రుత్యా అనువాదసంభవాత్।

భావదీపిక

ఓయీ! వస్తువునందు పురుషప్రయత్నము లేదు గనుక వికల్పము (విరుద్ధ పక్షద్వయబోధక వాక్యములకు ప్రామాణ్యము) సంభవించదు గనుక, పరస్పరవిరుద్ధ మతములకు ప్రామాణ్యము ఎట్లు సంభవించును ? కనుక, ఈజీవేశ్వరస్వరూప వివరణ పక్షములలో ఏది పరిత్యజింపదగినది ? ఏది స్వీకరింపదగినది ? అనినచో, అట్లు కాదు. వస్తువునందు వికల్పము సంభవించదు అని ఎవరు

చెప్పిరి? స్థాణువా? పురుషుడా ? రాక్షసుడా ? మొదలగు వికల్పము (సంశయము) వస్తువునందు కూడ, కనబడుటవలన. అయ్యా! స్థాణువా, పురుషుడా, రాక్షసుడా అను వికల్పములు పురుషబుద్ధి మూలమున జనించినవి, తార్కికములు కావనుమాట నిజమే. కాని, మీ శాస్త్రము తత్త్వావేదకము కదా! ఒకేతీరుగ తత్త్వము ఉండవలెను. కనుక, జీవేశ్వర స్వరూపవివరణ,విభాగాదులందు వ్యవస్థ (నియమబద్ధత) ఉండవలెను గదా! అనినచో, ఓయీ! నీవు అతిమేధావివలె ఉన్నావు. శాస్త్రమునకు అద్వితీయ ఆత్మతత్త్వము ప్రధానమైనది. ఆ ఆత్మతత్త్వదర్శనము వలన, మోక్షమను పురుషార్థము లభించుచున్నది. ఆ అద్వితీయాత్మతత్త్వము లోకమునందు తెలియబడకపోవుటచే, శాస్త్రమునకు విషయమగుచున్నది. జీవేశ్వరాది విభాగ కల్పనలు అయితే, పురుషబుద్ధి ప్రభవము లయినను, శాస్త్రముచేత అనువాదము చేయబడుచున్నవి. ఆ అనువాదము తత్త్వజ్ఞానమునకు ఉపయోగించుచున్నది. అనువాదక వాక్యములకు అనువాద్యమునందు తాత్పర్యము లేదు. 'ఫలవత్సన్నిధౌ అఫలం తదఙ్గమ్' అని పూర్వమీమాంసా న్యాయము. 'దర్శపూర్ణ మాసాభ్యాం స్వర్గ కామో యజేత' అను ఫలము గల ప్రధాన యాగవాక్యము ప్రధానము. ఫలశ్రుతి లేని ప్రయాజవాక్యములు ప్రయాజలు దానికి అంగములు. ఎప్పటికైనను, అద్వితీయాత్మతత్త్వ దర్శనమే, మోక్షరూప పరమ పురుషార్థసాధనము గనుక, జీవేశ్వర స్వరూపవిభాగ వివరణలో భేదమున్నను, ద్వైతము భ్రమసిద్ధమే

గనుక, శ్రుతి క్రమసిద్ధమును గూడ, అనువాదముచేసి, తత్త్వజ్ఞానమును కలిగించుట సంభవమే అయి ఉన్నది.

"ఉపక్రమోపసంహారౌ అభ్యాసో అపూర్వతా ఫలం
అర్థవాదోపపత్తీ చ లిఙ్గం తాత్పర్యనిర్ణయే ॥"

అను వచనానుసారము, శ్రుతులయొక్క తాత్పర్యమును గ్రహించవలెను. ఛాందోగ్యోపనిషత్తునందు షష్ఠప్రపాఠకమున, "ఏకమేవాద్వితీయమ్।", "సదేవ సౌమ్య ఇద మగ్ర ఆసీత్।" అని, అద్వైతముతో ఉపక్రమము, 'ఐతదాత్మ్యమిదం సర్వమ్।' అని అద్వైతాత్మ స్వరూపమునందు ఉపసంహారము కలవు. 'తత్త్వమసి' అను ఉపదేశము తొమ్మిది పర్యాయములు అభ్యాసము (ఆవృత్తి) చేయబడినది. 'ఆచార్యవాన్ పురుషో వేద' అను వాక్యముచే గురుముఖముగా గాని, అద్వైతాత్మ తత్త్వము తెలియబడనేరదు అని 'అపూర్వత' చెప్పబడినది.

"తస్య తావదేవ చిరం, యావన్న విమోక్ష్యే, అథ సంపత్స్యే ।"

ప్రారబ్ధాధీన దేహము ఉన్నంతవఱకు విలంబము. పిమ్మట, విదేహముక్తి అను ఫలవత్త్వము. 'యేనాశ్రుతం శ్రుతం భవతి', 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్' అనునది అర్థవాద. "యథా సౌమ్య ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్।", "వాచారంభణం వికారో నామధేయమ్।" మొదలైనవి 'ఉపపత్తి' (దృష్టాంతము). ఈవిధముగా శాస్త్రతాత్పర్యమును సంభవించిన తాత్పర్యలిఙ్గములచే అద్వితీయ ఆత్మతత్త్వమునందు గ్రహించవలయును.

సి ద్ధా న్త బి న్దుః

ఏతేన ద్వైతజ్ఞానేన అద్వైత జ్ఞానస్య బాధో నిరస్తః। ఘటాది ద్వైతజ్ఞానస్యాపి అద్వైత సన్మాత్రాంశే అజ్ఞాతే ప్రామాణ్య అభ్యుపగమాచ్చ। జ్ఞానాజ్ఞానయోః సమానాశ్రయ విషయత్వ నియమాత్। జడే చ ప్రమాణ ప్రయోజనాభావేన అజ్ఞాన అనభ్యుపగమాత్ తదవచ్ఛిన్నచైతన్య అజ్ఞానాదేవ। తత్రాపి అజ్ఞానవ్యవహారోపపత్తేః। సర్వప్రమాణానాం చ అజ్ఞాత జ్ఞాపకత్వే నైవ ప్రామాణ్యాత్। అన్యథా స్మృతేరపి తదాపత్తిరితి। ఏవం వేదాన్తేషు సర్వత్ర ఏవంవిధ విరోధే అయమేవ పరిహారః।తదాహుః వార్తికకారపాదాః —

శ్లో॥ యయా యయా భవేత్పుంసాం వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని।
సా సైవ ప్రక్రియా జ్ఞేయా సాధ్వీ సా చ అనవస్థితా ॥ ఇతి।

శ్రుతి తాత్పర్యవిషయీభూత అర్థవిరుద్ధం చ హేయమేవేతి శతశః ఉద్ఘోషితం అస్మాభిః। తస్మాత్ న కించిదేతత్। తదేవం జీవస్య ఉపాధినా అభిభూతత్వాత్ సంసారోపలబ్ధిః। పరమేశ్వరస్య తు ఉపాధ్యవశిత్వాత్ సర్వజ్ఞత్వాదికమ్ ఇతి సమ్యక్ ఉపపద్యతే వ్యవస్థా।

భా వ దీ పి క

ద్వైతజ్ఞానము ప్రత్యక్షసిద్ధము. అద్వైతజ్ఞానము వేదాన్త శాస్త్రాధీనము. ఈ రెంటిలో ఏది ప్రబలము? అని విచారించగా అద్వైతజ్ఞానము పరమపురుషార్థసాధనము, అజ్ఞాతవిషయముగలది అగుటచేత దుర్బలమగు ద్వైతజ్ఞానముచేత అద్వైతజ్ఞానమునకు బాధ నిరాకరింపబడినది. 'ఘటస్సన్, పటస్సన్' మొదలగు

ద్వైతజ్ఞానమునకు గూడ, అద్వైతసన్మాత్రాంశము అజ్ఞాతమగుటచే ఆ సన్మాత్రాంశయందు ప్రామాణ్యము అంగీకరింపబడుటవలనను జ్ఞానమునకు ఏది విషయము, ఆశ్రయము అయిఉన్నదో, అజ్ఞానమునకు గూడ, అదే ఆశ్రయము, విషయము అను నియమము వలన అజ్ఞాత సన్మాత్రాంశయందు ఘటాది ద్వైతజ్ఞానమునకు గూడ ప్రామాణ్యము సిద్ధించుచున్నది. జడ పదార్థములు స్వతః తమోరూపములు గనుక, వానికి ఆవరకముగా అజ్ఞానము అంగీకరింపబడదు (చైతన్యమునకే అజ్ఞానము ఆవరకముగా అంగీకరింపబడును). అజ్ఞాన ఆవరణే లేనపుడు, తన్నివృత్తికొఱకు జడములందు ప్రమాణమునకు ప్రయోజనము లేదు. ఘటావచ్ఛిన్న చైతన్యముయొక్క అజ్ఞానమువలననే ఘటమునందు గూడ, అజ్ఞాన వ్యవహారము లోకమున, చేయబడుచున్నది. సర్వప్రమాణములు అజ్ఞాతజ్ఞాపకములు. అజ్ఞాన, విషయజ్ఞానజనకములు అగుచునే ప్రమాణములగుచున్నవి. స్మృతిజ్ఞానము అనుభూతవిషయకము గనుక, స్మృతికి ప్రమాత్వాపత్తి లేదు. ఈవిధముగా, వేదాన్తములందు అంతట, అనేకరీతుల విరోధము ప్రసక్తమైనపుడు, ఆ విరోధ పరిహారమార్గము ఇదియే అయి ఉన్నది. పూజ్యులగు వార్తికకారులు ఆ విషయమునే, చెప్పియున్నారు.

మానవులకు ఏ ప్రక్రియ చేత ప్రత్యగాత్మతత్త్వ పరిజ్ఞానము కలుగునో, ఆ యా ప్రక్రియయే, సమీచనమైనదిగా గ్రహింపదగినది.

ఒక్కొక్క ప్రక్రియ, ఒక్కొక్కరికి ఉపయోగపడవచ్చును. అది, ఇదియే అని నిర్ణయము లేదు. కనుక, అన్ని వాదములు

ఆత్మతత్త్వమును తెలిసికొనుటకు వివరింపబడినవి గనుక, అన్నియు సమంజసములే. శ్రుతితాత్పర్యవిషయమగు అర్థమునకు విరుద్ధమైన అంశము హేయమైనదని పలుమారులు మాచేత చాటబడినది. కనుక, ఈ జీవేశ్వరస్వరూప విభాగభేదకథనము ఒక విషయము కాదు. ఒకవిషయము మాత్రము చెప్పవలసియున్నది. జీవుడు ఉపాధిచేత అభిభూతుడు. కనుక, అతనికి ఉపాధివశమువలన స్వరూపావరణము కలిగినందున, సంసారము (ప్రపంచము) సత్యముగా తోచును. పరమేశ్వరుడైనచో, తన ఉపాధిని వశమునందు ఉంచుకొన్నవాడగుటచే స్వరూపావరణము లేదు, అనగా స్వస్వరూపమును అనావృతముగా అనుభవించుచునే, ఉపాధి వ్యవహారమును చేయుచుండును. సర్వజ్ఞత్వాదికముగూడ అతనికి ఉపపన్న మగుచున్నది. ఈ తీరుగా, ఆత్మాద్వైతమునందు జీవేశ్వర వ్యవస్థను గ్రహించవలెను.

## సిద్ధాన్తబిన్దుః

నను, భవతు అవిద్యావశాత్ జీవేశ్వరవిభాగవ్యవస్థా । మానమేయాది ప్రతికర్మవ్యవస్థా తు కథమితిచేత్, ఉచ్యతే-దృశ్యత్వాత్ జడత్వాత్ వినాశిత్వాచ్చ। పరిచ్ఛిన్నాఽపి అవిద్యా అనిర్వచనీయత్వేన విచారాసహా ఆవరణవిక్షేపశక్తిద్వయవతీ సర్వగతం చిదాత్మానం ఆవృణోతి, అంగుళిరివ నయనసన్నిహితా సూర్యమండలమ్। తత్ర చక్షుష ఏవ ఆవరణే అంగుళేరపి అభాన ప్రసఙ్గాత్ అధిష్ఠాన ఆవరణమన్తరేణ విక్షేపానుపపత్తేశ్చ। తతః సా పూర్వపూర్వసంస్కార జీవకర్మప్రయుక్తా సతీ నిఖిల జగదాకారేణ పరిణమతే। సా చ స్వగతచిదాభాసద్వారా చిత్తాదాత్మ్య

అపన్నేతి। తత్కార్యమపి సర్వం ఆభాసద్వారా చిదనుస్యూతమేవ। తథాచ చైతన్యస్య దీపవత్ స్వసంబద్ధ సర్వభాసకత్వాత్ జగదుపాదానచైతన్యం ప్రమాణాపేక్షామన్తరేణైవ సర్వదా సర్వం భాసయత్ సర్వజ్ఞం భవతి। తేన తత్ర న మాన మేయాదివ్యవస్థా। కింతు జీవే, తస్య బుద్ధ్యవచ్ఛిన్నత్వేన పరిచ్ఛిన్నత్వాత్। తేన చిదభివ్యక్తి యోగ్యేన యేన అన్తఃకరణేన యదా యత్సంబద్ధం భవతి తదేవ తదా తదవచ్ఛిన్నః జీవః అనుభవతీతి న సాంకర్య ప్రసఙ్గః।

## భావదీపిక

ఏకాత్మదర్శనమున, అనిర్వచనీయ, అవిద్యోపాధివశము వలన, జీవేశ్వరవిభాగవ్యవస్థ చూపబడినది. ఇప్పుడు ప్రమాణ, ప్రమేయ, ప్రమాతృ, ప్రమితి కర్మవ్యవస్థ నిరూపింపబడుచున్నది. ఎట్లు అనినచో - చెప్పబడుచున్నది. అవిద్య దృశ్యము (పరావభాస్యము). జడము, వినాశి అగుటచే సర్వగతము కానందున పరిచ్ఛిన్నమైనది అయినను, సద్రూపమనిగాని, అసద్రూపమనిగాని, నిర్వచించుటకు శక్యము కానిదగుటచే విచారణకు నిలువలేనిది (నివర్తించునది). ఆవరణశక్తి, విక్షేప శక్తి అను రెండు శక్తులు కలది. సర్వగతుడగు చిదాత్మను నయనసన్నిహితమగు అంగుళి,సూర్యమండలమునువలె ఆవరించుచున్నది, అంగుళి, నయనమునకు దగ్గరలో ఉన్నపుడు సూర్యమండలము కనపడలేదు గాని, చక్షువునకు అంగుళి, కనపడుచునే యున్నది. అట్లే, పరిచ్ఛిన్నమైన అవిద్య, సర్వగతమగు చిదాత్మను ఆవరించుచున్నది. అవిద్య, చైతన్యభాస్యము అగుచున్నది. అవిద్యచేత అధిష్ఠానమగు చైతన్యము ఆవరింపబడక

పోయినచో, అవిద్యాకార్యమగు విక్షేపము (కార్యదృష్టి) ఉప పన్నము కానేరదు. రజ్జుస్వరూపావరణానంతరమే, విక్షేపరూప మగు సర్పము గోచరించుచున్నది. కనుక, ఆ అవిద్య, పూర్వపూర్వ సంస్కారోపేత జీవకర్మలచే ప్రేరితమై నిఖిల జగదాకారముగా పరిణమించుచున్నది. ఆ అవిద్యయందు చైతన్య ప్రతిఫలనముచే చిత్తాదాత్మ్యమును పొందిఉన్నది గనుక, అవిద్యాకార్యము కూడ అంతయు చిదాభాసద్వారా చిద్రూపముతో అనుస్యూతము అగు చున్నది. కనుక, దీపము తనతో సంబద్ధమైన వస్తువుల నన్నింటిని ప్రకాశింపజేసినట్లుగ జగదుపాదాన చైతన్యముకూడ, ఆభాసద్వారా ప్రమాణాపేక్ష లేకుండగనే, ఎల్లప్పుడు సర్వమును ప్రకాశింప జేయుచు, సర్వజ్ఞము అగుచున్నది. అందువలన, జగదుపాదాన చైతన్యమగు ఈశ్వరునకు ప్రమాణ, ప్రమేయ వ్యవస్థ, ఇంద్రియ కృతవ్యవహారము లేదు. ఈ మాన, మేయ, వ్యవస్థ జీవునకే చెందినది. జీవుడు, పరిచ్ఛిన్నమగు బుద్ధి ఉపాధిగాగలవాడు గనుక, ఆ బుద్ధి, అంతఃకరణము చిదభివ్యక్తికి యోగ్యమైనందున, అంతఃకరణము ఎప్పుడు ఇంద్రియాదులద్వారా ఏవిషయముతో సంబంధించునో, అప్పుడే ఆ విషయమును బుద్ధ్యవచ్ఛిన్న జీవుడు అనుభవించుచున్నాడు. కనుక సాంకర్యముయొక్క ప్రసక్తి లేదు. జీవేశ్వరవ్యవహారములు భిన్నములు అని భావము.

## సిద్ధాన్త బిన్దుః

ఏవమత్ర ప్రక్రియా । శరీరమధ్యే స్థితః సర్వశరీరవ్యాపకః సత్త్వప్రాధాన్యేన సూక్ష్మపంచభూతారబ్ధః అన్తఃకరణాఖ్యః అవిద్యావివర్తః దర్పణాదివత్ అతిస్వచ్ఛః నేత్రాదిద్వారా నిర్గత్య

యోగ్యాన్ ఘటాదీన్ విషయాదీన్ వ్యాప్య తత్తదాకారో భవతి, ద్రుతతామ్రాదివత్। తస్య చ సౌరాలోకాదివత్ ఝుటిత్యేవ సంకోచ వికాసౌ ఉపపద్యేతే। స చ సావయవత్వాత్ పరిణమమానః దేహాభ్యన్తరే ఘటాదౌ చ సమ్యగ్ వ్యాప్య దేహఘటయోర్మధ్యేఽపి చక్షుర్వత్ అవిచ్ఛిన్నోఽపి వ్యవతిష్ఠతే। తత్ర దేహే అన్తఃకరణ భాగః అహంకారాఖ్యః కర్తా ఇత్యుచ్యతే। దేహవిషయమధ్యవర్తీ దండాయమానః తద్భాగః వృత్తిజ్ఞానరూపా క్రియా ఇత్యుచ్యతే। విషయవ్యాపకః తద్భాగః విషయస్య జ్ఞానకర్మత్వసంపాదకం అభివ్యక్తియోగ్యత్వం ఇత్యుచ్యతే। తస్య చ త్రిభాగస్య అన్తఃకరణస్య అతిస్వచ్ఛత్వాత్ చైతన్యం తత్ర అభివ్యజ్యతే। తస్య చ అభివ్యక్తస్య చ చైతన్యస్య ఏకత్వేఽపి అభివ్యంజక అన్తఃకరణభాగభేదాత్ త్రిధా వ్యపదేశో భవతి। కర్తృభాగ అవచ్ఛిన్న చిదంశః ప్రమాతా। క్రియాభాగావచ్ఛిన్న చిదంశః ప్రమాణమ్। విషయగత అభివ్యక్తియోగ్యత్వభాగావచ్ఛిన్న శ్చిదంశః ప్రమితిరితి। ప్రమేయం తు విషయభాగావచ్ఛిన్న చైతన్యమేవ అజ్ఞాతమ్। తదేవ చ జ్ఞాతం సత్ ఫలమ్।

## భావదీపిక

ఈ ప్రతికర్మవ్యవస్థయందు ప్రమాతృ, ప్రమాణ, ప్రమితి, ప్రమేయ, ఫలవ్యవస్థప్రక్రియ ఇట్లుఉండును. శరీరమధ్యమున ఉన్నట్టియు, సమస్తశరీరమును వ్యాపించిన, సత్త్వగుణ ప్రాధాన్యమున, సూక్ష్మపంచభూతములచే సృజింపబడిన అంతః కరణము అను పేరు గల అవిద్యావివర్తకార్యము, అద్దము మొదలైనవానివలె మిక్కిలి స్వచ్ఛమైనది, నేత్రము మొదలగు

ఇంద్రియములద్వారా శరీరమునుండి వెలువడి, యోగ్యములగు ఘటాదివిషయములను వ్యాపించి కరిగిన రాగివలె ఆ యా విషయ ఆకారమును ధరించుచున్నది. ఆ అంతఃకరణభాగము సూర్యుని వెలుతురువలె శీఘ్రముగానే సంకోచ.వికాసములను పొందుచున్నది. ఆ అంతఃకరణము అవయవములు కలదగుటచే పరిణమించుచు దేహములోపల ఘటాదివిషయములందును, బాగుగా వ్యాపించి ఆ దేహగణముల మధ్యయందు గూడ, చక్షురింద్రియమువలె (మటియు, కుల్యా-కాలువవలె) ఎడతెగనిది అగుచు ఉంటున్నది. అచట, దేహములోపల ఉన్న అంతఃకరణభాగము అహంకార మను పేరు గలది, కర్త అని పిలువబడుచున్నది. ఇక, దేహమునకు విషయమగు ఘటాదులకు మధ్య దండాయమానము (కర్రవలె) పొడుగుగా ఉన్న అంతఃకరణభాగము వృత్తిజ్ఞానమన్న పేరుగలది క్రియ అని చెప్పబడును. విషయవ్యాపకమగు అంతఃకరణభాగము విషయము తెలియబరుటకు కారణమైనది, అభివ్యక్తియోగ్యత్వము అని చెప్పబడును. ఈ మూడు భాగములు గల అంతఃకరణము మిక్కిలి స్వచ్ఛమైనదగుటచే ఆ అంతఃకరణమునందు చైతన్యము అభివ్యక్తమగును. అభివ్యక్తమగు ఆ చైతన్యము ఒక్కటియే అయినను, అభివ్యంజకములు అగు అంతఃకరణభాగములు భిన్నములగుటవలన మూడువిధములుగా వ్యవహారము చేయబడు చున్నది. కర్తృభాగావచ్ఛిన్నచిదంశము ప్రమాత, క్రియాభాగా వచ్ఛిన్న చిదంశము ప్రమాణము. విషయమునందున్న, అభివ్యక్తియోగ్యత్వభాగావచ్ఛిన్నచిదంశము ప్రమితి అనబడును.

విషయగతబ్రహ్మచైతన్యమే తెలియబడనంతవఱకు ప్రమేయము. అదియే, తెలియబడినదై ఫలమగును.

## సిద్ధాన్తబిన్దుః

అత్ర చ యస్మిన్ పక్షే అన్తఃకరణావచ్ఛిన్నో జీవః యస్మింశ్చ పక్షే సర్వగతః అసఙ్గః అవిద్యాప్రతిబిమ్బః జీవః, తత్ర ఉభయత్రాపి ప్రమాతృచైతన్య ఉపరాగార్థా విషయగత చైతన్య ఆవరణభంగార్థా చ అన్తఃకరణవృత్తిః, యస్మింశ్చ పక్షే అవిద్యావచ్ఛిన్నః సర్వగతో జీవః ఆవృతః తస్మిన్ పక్షే జీవస్యైవ జగదుపాదానత్వేన సర్వసమ్బద్ధత్వాత్ ఆవరణభంగార్థా వృత్తిరితి వివేకః।

## భావదీపిక

ఇపుడు, అంతఃకరణవృత్తిక్రియాప్రయోజనము చెప్పబడు చున్నది.

"అభేదాభివ్యక్త్యర్థా వృత్తిః, చిదుపరాగార్థా వృత్తిః, ఆవరణభఙ్గార్థా వృత్తిః"

అని మూడు విధములుగా వృత్తిప్రయోజనము శాస్త్రమునందు చెప్పబడుచున్నది. 'అన్తఃకరణావచ్ఛిన్నో జీవః' అంతఃకరణము ఉపాధిగా కలవాడు జీవుడని ఒక పక్షము. సర్వత్ర, వ్యాపించి ఉన్నవాడు, ఘటాది విషయసంగము (విషయతాదాత్మ్య సంబంధము) లేనివాడు, అవిద్యాప్రతిబింబుడు జీవుడు అను రెండు పక్షములు గలవు. ఈ రెండు పక్షములందును, ప్రమాతృ చైతన్యము యొక్క ఉపరాగము (సంబంధము), విషయమునకు

లభించుటకు గాని, విషయగత చైతన్యముయొక్క ఆవరణభంగము కొఱకుగాని, అంతఃకరణవృత్తి ఆవశ్యకమై యున్నది. ఏ పక్షమున, అవిద్యోపాధికుడగు జీవుడు, అంతట ఉండియు, ఆవరణము కలవాడగుచున్నాడో, ఆ పక్షమున, జీవునకు జగదుపాదానత్వమును అంగీకరించుటచే ఘటాదివిషయసంబంధము ఉన్నను, ఆవరణభంగము కొఱకు అంతఃకరణవృత్తి, ఆవశ్యకమగుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

నను, చిదుపరాగార్థా వృత్తిరితి పక్షే స్వతః అన్తఃకరణ సంబద్ధానాం ధర్మాధర్మాదీనాం బ్రహ్మణశ్చ వృత్తి మన్తరేణైవ సర్వదా భానం స్యాత్। న స్యాత్; చైతన్యస్య తత్తదాకారతా భావాత్। తదభావశ్చ స్వచ్ఛేఽపి బ్రహ్మచైతన్యే ఆవరణాత్ అనావృతేఽపి శుక్తిరజతాదౌ అస్వచ్ఛత్వాత్, ధర్మాధర్మాదౌ తు అస్వచ్ఛత్వాత్ ఆవృతత్వాద్వా। తేన స్వచ్ఛేఽపి ఆవృతే ప్రమాణ వృత్త్యా తదాకారతా। అనావృతేఽపి అస్వచ్ఛే శుక్తిరజతాదౌ అవిద్యావృత్త్యా తదాకారతా। అనావృతే స్వచ్ఛే తు సుఖ దుఃఖాదౌ స్వతః ఇతి న అన్తఃకరణసంబంధమాత్రేణ భానప్రసఙ్గః।

## భా వ దీ పి క

ఓయీ! 'చిదుపరాగార్థా వృత్తిః' అను పక్షమున, అంతఃకరణమునందు సంబద్ధములైన ధర్మాధర్మాదులకు పాప పుణ్యములకు ఎల్లప్పుడు, చిత్సంబంధము ఉండుటవలనను; అంతఃకరణ వృత్తి లేకుండగనే, ఎల్లప్పుడు, ధర్మాధర్మాదులు ప్రత్యక్షము

కావలసివచ్చును. ఆవిధముగా ధర్మాధర్మముల యొక్క ప్రత్యక్షము కలుగనేరదు. ఏలయనగా, చైతన్యము, ఆ ధర్మాధర్మాది ఆకారము ధరించదు. ఎందువలన ధరించలేదు ? బ్రహ్మచైతన్యము స్వచ్ఛము కదా ! అనినచో, ఆవరణము వలన. శుక్తిరజతాదులు ఆవృతములు కాకపోయినను స్వచ్ఛము కావు గనుక. ధర్మాధర్మములు అస్వచ్ఛములు, లేదా, ఆవృతములు అగుటచే వానికి భానము లేదు. కనుక, స్వచ్ఛమైనను, ఆవృతమైనచో, ప్రమాణవృత్తిచే విషయాకారము అవశ్యకమగును. అనావృతము, అస్వచ్ఛమును అగు శుక్తిరజతాదులందు అంతఃకరణవృత్తి, ప్రసరించకపోయినను, అవిద్యావృత్తిచేత శుక్తిరజతాకారము అంగీకరింపబడుచున్నది. అనావృతములగు, సుఖదుఃఖాదులు స్వచ్ఛములు గనుక, స్వయముగానే (వృత్తి లేకుండా) భాసించును. కావున, అంతఃకరణసంబంధమాత్రము చేత విషయభానము లేదు.

సిద్ధాన్తబిన్దుః

నను, బ్రహ్మణః కథం ఆవరణమ్? నిరవద్య స్వప్రకాశత్వేన సర్వజ్ఞత్వాత్, సత్యమ్ । స్వసంబద్ధ సర్వభాసకతయా సర్వజ్ఞమపి అన్తఃకరణావచ్ఛిన్న జీవాజ్ఞానవిషయతయా ఆవృతమితి వ్యపదేశాత్। తస్మాత్ బ్రహ్మ జగదుపాదాన మితి పక్షే చిదుపరాగార్థా ఆవరణభంగార్థా చ వృత్తిః। జీవోపాదానత్వపక్షే తు ఆవరభంగార్థా ఏవ ఇతి ।

నను, ఏకేనైవ ఘటాదిజ్ఞానేన ఆవరణస్య భఙ్గే సత్యః మోక్షప్రసఙ్గః, అజ్ఞానస్య ఏకత్వాత్ । నానాజ్ఞానపక్షేఽపి ఏకస్య జీవస్య ఏకాజ్ఞానోపాధిత్వాత్। న ఉత్తేజకేన మణేరివ వృత్త్యా ఆవరణస్య

అభిభవాఙ్గీకారాత్। తథా చ ప్రమాణజన్య అన్తఃకరణవృత్త్యభావ సహకృతం అజ్ఞానం సతి భాత్యపి వస్తుని నాస్తి న భాతీతి ప్రతీతి జననసమర్థం ఆవరణ మిత్యుచ్యతే। వృత్త్యా జాతాయాం తు అవచ్ఛేదకాభావాత్ విద్యమానమపి అవిద్యమాన సమమేవేతి న స్వకార్యసమర్థం అజ్ఞానమ్। తేన అభిభూత మిత్యుచ్యతే।

భావదీపిక

ఓయీ ? బ్రహ్మకు ఆవరణము ఎట్లు ? బ్రహ్మ, నిర్దోషము, స్వప్రకాశము అగుటచే సర్వజ్ఞము (సర్వభాసకము) కదా। అవును, నిజమే. బ్రహ్మ, తనతో సంబంధించిన సర్వపదార్థము లను ప్రకాశింపజేయును గనుక, సర్వజ్ఞము. అయినను,అన్తఃకరణా వచ్ఛిన్నుడగు జీవునియొక్క అజ్ఞానమునకు విషయ మగుటచేత ఆవృతము అని వ్యవహరింపబడుచున్నది. కనుక, బ్రహ్మ, జగదుపాదానము అను పక్షమునందు చిదుపరాగార్థము అన్తఃకరణావచ్ఛిన్న చైతన్యసంబంధార్థము, ఆవరణభఙ్గార్థము అంతఃకరణవృత్తి ఆవశ్యకము అగుచున్నది. జీవుడే, జగదుపా దాన మను పక్షమునందు చిదుపరాగము ఉన్నది గనుక, ఆవరణ భఙ్గార్థము వృత్తి అంగీకరింపబడుచున్నది.

ఓయీ ! 'అయం ఘటః' ఇది ఘటము అను జ్ఞానముచే అజ్ఞానావరణము నశించగా, వెంటనే, జీవునకు మోక్షము రావలసి వచ్చును. అజ్ఞానము ఒకటియే కదా ! అది, నశించినపుడు మోక్ష మును అంగీకరించవలయును. అజ్ఞానములు నానా (అనేకములు) అను పక్షమునందు గూడ, ఒక్కొక్క జీవునకు ఒక్కొక్క అజ్ఞానము అంగీకరింపబడినను, ఆ జీవునకు అజ్ఞానోపాధి ఒక్కటియే గనుక,

ఘటజ్ఞానముచేతనే, అజ్ఞానము నశించుచున్నది కదా। అనినచో, అట్లు కాదు. అగ్ని; దాహము అను కార్యమును చేయును. మణి, దాహమునకు ప్రతిబంధకము. ఉత్తేజకము, మణిప్రతిబంధమును తొలగించి, దాహకార్యమును జనింపజేయును. అజ్ఞానము, ఆవరణ రూప మగుటచే విషయప్రకాశమునకు ప్రతిబంధకము. ఘటాకార వృత్తి, ఉత్తేజకము. అనగా, వృత్తి కలిగినపుడు, ప్రతిబంధక మగు అజ్ఞానావరణము అభిభూత మగుచున్నదని అంగీకరింతుము. కనుక, ప్రమాణజన్య అంతఃకరణవృత్తి లేనప్పుడే, వృత్త్యభావ సహకారముతో అజ్ఞానము వస్తువు ఉన్నను, లేదనియు, ప్రకాశించు చున్నను, ప్రకాశించలేదనియు ప్రతీతిని కలిగించుటకు సమర్థ మగుచు, ఆవరణమని పిలువబడుచున్నది. విషయాకారవృత్తి, కలిగినపుడు, అజ్ఞానము ఉన్నను, వృత్త్యభావరూపమగు అవచ్ఛేదము లేదు గాన, లేనిదానివలె తన ఆవరణకృత్యమును నిర్వహింపజాలదు. కనుక, అజ్ఞానము వృత్తిచేత అభిభూతము అని చెప్పబడుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

నను, ఏవం సతి బ్రహ్మజ్ఞానేనాపి అవిద్యాయాః అనివృత్తేః అనిర్మోక్షప్రసఙ్గః। న తత్త్వమస్యాది వాక్యార్థజ్ఞానాత్ అవిద్యా నివృత్త్యభ్యుపగమాత్। స్వవిషయ విషయకప్రమాత్వేనైవ అవిద్యా నివర్తకత్వాభ్యుపగమాత్। మహావాక్యార్థ జ్ఞానస్యైవ అబాధిత విషయతయా ప్రమాత్వాత్ । ప్రత్యక్షాదీనాం తు బాధిత విషయతయా భ్రమత్వేఽపి వ్యవహారసామర్థ్యేన ప్రామాణ్యాభి మానాత్। జ్ఞానాత్ అజ్ఞాననివృత్తేః। అన్యత్ర అదర్శనం చ

అకించిత్కరమ్ । స్వానుభవసిద్ధత్వాత్ అన్యథా అనుపపత్తేశ్చ । సర్వతో బలవత్త్వాత్ । తదుక్తమ్ ।

''అన్యథా అనుపపత్తిశ్చేత్ అస్తి వస్తుప్రసాధికా
పినష్టి అదృష్టివైమత్యం సైవ సర్వబలాధికా ॥'' ఇతి ।

అథవా మూలాజ్ఞానస్యైవ అవస్థాజ్ఞానాని ఘటాదివిషయావరణాని ।

భావ దీపిక

ఓయీ! వృత్తిజ్ఞానము చేత బ్రహ్మజ్ఞానము అభిభూత మగును అని అంగీకరించినచో, బ్రహ్మజ్ఞానము చేత గూడ, అజ్ఞానము అభిభూత మగునే గాని, నివృత్తము కాదు. కనుక, అవిద్యానివృత్తిరూపమగు మోక్షము సంభవింపనేరదు. అట్లు కాదు. తత్త్వమస్యాది మహావాక్యార్థజ్ఞానము వలన, అవిద్యానివృత్తిని అంగీకరింతుము. అజ్ఞానమునకు ఏది విషయమో, తద్విషయక ప్రమాజ్ఞానము చేతనే, అవిద్య, నివర్తించుచున్నది అని అంగీ కరింపబడుచున్నది. మహావాక్యముల వలన, అబాధిత విషయ జ్ఞానము అనగా, బ్రహ్మజ్ఞానము, ప్రమారూప మగుచున్నది. బ్రహ్మవస్తువు, అబాధిత విషయము గనుక. 'అయం ఘటః' మొదలగు ప్రత్యక్షాది జ్ఞానములలో విషయమగు ఘటాదులు బాధితము లగుటచే ఘటజ్ఞానము భ్రమాత్మకమే గాని, ప్రమ కాదు. ప్రత్యక్షాదిజన్య ఘటాదిజ్ఞానము భ్రమ అయినను, వ్యవహార కాలమున, జలాహరణాది సామర్థ్యము కలుగుటచేత ప్రమాత్మకమని తలంచుచున్నారే గాని, ఘట మను వస్తువు, సత్యము కాపప్పుడు, ఆ జ్ఞానము ప్రమ, ఎట్లగును? ఆయన్యా! ఘటాదిజ్ఞానకాలమున్నంత్తు అజ్ఞానము నివర్తించుటలేదని చెప్పి యున్నారుగదా ! బ్రహ్మ

జ్ఞానము చేత అజ్ఞానము నివృత్తమగుననుట ఎట్లు కుదురును ? దృష్టాంతము లేదు కదా? అను ప్రశ్న అకించిత్కరము, (పరిగణ లోనికి తీసికొనవలసిన పని లేనిది). వేదాన్తవాక్యముల వలన, అవిద్యానివృత్తి మాకు అనుభవసిద్ధము కనుక. మఱియు, ఇందు అన్యథానుపపత్తి (మఱియొక విధముగా కుదరకపోవుట) అనగా, అర్థాపత్తి ప్రమాణము కలదు. ఇది, అన్నిటికంటె ప్రబలము. ఈ విషయమే, ఇట్లు చెప్పబడినది –

'తరతి శోకమాత్మవిత్', 'విద్వాన్ నామరూపాద్విముక్తః'

మొదలగు శ్రుతులు అవిద్యానివృత్తిని బోధించుచున్నవి. అవిద్యా నివృత్తి కానిచో, వృత్తిని కోరువానికి శాస్త్రము ఉపయోగించదు. కావున, ఈ శాస్త్రప్రామాణ్యానుపపత్తియే, ఇదివఱకు జ్ఞానముచేత అజ్ఞానము నివృత్తమైనట్లు, దృష్టము కాలేదను వైమత్యమును నివారించుచున్నది. ఈ అన్యథానుపపత్తియే, ప్రత్యక్షాది ప్రమాణ ములకంటె గూడ, ప్రబలము, వస్తుసాధకము అని, లేదా, మఱియొక పక్షము చెప్పబడుచున్నది. మూలాజ్ఞానము, బ్రహ్మ జ్ఞానము చేత నివర్తించును. ఆ మూలాజ్ఞానమునకే, ఘటాది విషయములను ఆవరించునట్టి అవస్థా, అజ్ఞానములు కలవు. ఘటావస్థా అజ్ఞానము ఘటజ్ఞానము చేత నశించును. మూలా జ్ఞానము నశించదు. అజ్ఞానము, జ్ఞానప్రాగభావము వంటిది. ఎన్ని జ్ఞానములు కలవో, అన్ని అవస్థాజ్ఞానములు కలవు అని అంగీకరించుటవలన, ఒక ఘటాదిజ్ఞానము చేత ఒక అజ్ఞానము నశించుట వలన, ఆవరణనాశము కలుగుటలో ఏమియు, అనుపపత్తి లేదు.

## సి ద్ధా న్త బి న్దుః

అజ్ఞానస్య ప్రాగభావస్థానీయత్వేన యావన్తి జ్ఞానాని తావన్తి అజ్ఞానాని, ఇత్యభ్యుపగమాత్। ఏకేన జ్ఞానేన ఏకాజ్ఞానస్యైవ నాశాత్ ఘటాదిజ్ఞానేన ఆవరణనాశే న కాచిత్ అనుపపత్తిః।

నను, అనుమానాదిభిః ఆవరణం నివర్తతే వా, న వా? ఆద్యే సాక్షాత్కారభ్రమస్యాపి శంఖ పీతత్వాదేః దిఙ్మోహాదేశ్చ శ్వేత పీతత్వాద్యనుమానాదినా నివృత్తిప్రసఙ్గః। అధిష్ఠానాజ్ఞాన ఉపాదానకత్వే భ్రమస్య తన్నివృత్తౌ నివృత్తేః। యౌక్తికజ్ఞానేన చ బ్రహ్మణః అవిద్యానివృత్తేః సాక్షాత్కారార్థం శ్రవణ మననాపేక్షా న స్యాత్। ద్వితీయే చ వహ్న్యాదివ్యవహారో న స్యాత్। ప్రతిబంధకస్య విద్యమానత్వాత్। ఉచ్యతే, ద్వివిధం ఆవరణమ్। ఏకం అసత్త్వాపాదకం అన్తఃకరణావచ్ఛిన్న సాక్షినిష్ఠమ్। అన్యత్ అభానాపాదకం విషయావచ్ఛిన్న బ్రహ్మచైతన్యనిష్ఠమ్,

## భా వ దీ పి క

ఓయీ! అనుమానప్రమాణాది జన్య జ్ఞానములచే, ఆవరణము నివర్తించునా ? నివర్తించనా ? మొదటి పక్షమున, 'పీత శ్శంఖ.' అను ప్రత్యక్ష భ్రమస్థలములో 'శంఖః శ్వేతః' అను అనుమానముచే, ఆవరణనివృత్తి, కలుగవలసి యుండును. ఇట్లే, ప్రాచ్యాది దిఙ్మోహమునందును, అనుమానప్రమాణముచే భ్రాంతి నివృత్తి కావలసివచ్చును. అధిష్ఠాన అజ్ఞానమే, భ్రమకు ఉపాదానమగుటచే ఉపాదానమగు అజ్ఞానము నివర్తించినపుడు, కార్యమగు

భ్రమ, నివర్తించవలయును గదా । మఱియు, వేదాన్తవాక్యముల వలన,మృదాదిదృష్టాంతముల చేతను, అద్వితీయ బ్రహ్మయొక్క పరోక్షజ్ఞానము కలిగినను, అవిద్య, నివర్తించును గనుక సాక్షాత్కారము కొఱకు శ్రవణ,మననాపేక్ష ఆవశ్యకము కాకపోవలసి వచ్చును. ఇక, రెండవ పక్షమున, అనుమితిజ్ఞానముచే అజ్ఞాన ఆవరణము నివర్తించదని అన్నచో 'పర్వతో వహ్నిమాన్ ధూమాత్' అను స్థలమున వహ్న్యాదివ్యవహారము లేకపోవలసి వచ్చును: ప్రతిబంధకమగు ఆవరణము కలదుగనుక. సమాధానము చెప్పబడు చున్నది. ఆవరణము, రెండు విధములు. ఒకటి 'నాస్తి' లేదు, అను అసత్త్వాపాదకము, అంతఃకరణావచ్ఛిన్న సాక్షిచైతన్య నిష్ఠము. మఱియొక ఆవరణము 'న భాతి' స్ఫురించుటలేదు అని: అభాన ఆపాదకము, విషయావచ్ఛిన్న బ్రహ్మచైతన్య నిష్ఠము.

## సిద్ధాన్తబిన్దుః

'ఘటమహం న జానామి' ఇతి ఉభయావచ్ఛేదానుభవాత్। తత్ర ఆద్యే పరోక్షాపరోక్షసాధారణప్రమాణజ్ఞానమాత్రేణ నివర్తతే। అనుమితేఽపి వహ్న్యాదౌ నాస్తీతి ప్రతీత్యనుదయాత్। ద్వితీయం తు సాక్షాత్కారేణైవ నివర్తతే। యదాశ్రయం యదాకారం జ్ఞానం తదాశ్రయం తదాకారం అజ్ఞానం నాశయతీతి నియమాత్। పరోక్షజ్ఞానస్య ఇంద్రియవిషయ సన్నికర్షాభావేన జ్ఞానస్య అన్తఃకరణమాత్రాశ్రయత్వాత్। అపరోక్షజ్ఞానస్యైవ విషయవ్యాపారజన్యత్వేన విషయాన్తఃకరణ ఉభయజన్యత్వేన చ తదుభయనిష్ఠత్వాత్। తదుక్తమ్ –

శ్లో॥ పరోక్షజ్ఞానతో నశ్యేత్ అసత్త్వావృతిహేతుతా ।
అపరోక్షధియా నశ్యేత్ అభానావృతిహేతుతా ॥ ఇతి ।

తేన అనుమానాదౌ అసత్త్వావరణనాశాత్ తత్ర తద్వ్యవహారః । అభానావరణనివృత్త్యా చ సోపాధిక సాక్షాత్కార భ్రమనివృత్తిః ఇతి ।

## భా వ దీ పి క

'ఘట మహం న జానామి' (ఘటం న జానామి, అహం న జానామి)అను రీతిగా, ఘటాది విషయమునకును, అహంపదాభిలప్య (బోధింపబడు) సాక్షికిని రెంటికి అజ్ఞానావరణోచ్ఛేదము అనుభవ సిద్ధము. వానిలో మొదటిదగు అసత్త్వావరణము, పరోక్షము, అపరోక్షము - రెంటికి సాధారణమగు ప్రమాణజ్ఞానము చేత నివర్తించుచున్నది. 'పర్వతో వహ్నిమాన్' అను పరోక్ష వహ్న్యాది జ్ఞానము అనుమాన ప్రమాణముచే కలిగినను, 'పర్వతే వహ్ని ర్నాస్తి' పర్వతము నందు వహ్ని లేదు అను ప్రతీతి కలుగనేరదు. రెండవది యగు అభానావరణము, సాక్షాత్కారము చేతనే నివర్తించును. ఎవనికి ఏ ఆకారముగల జ్ఞానము కలుగునో, వానికి తద్విషయాకారమగు అజ్ఞానము నశించును అను నియమము కలదు.

"జ్ఞానం అజ్ఞానస్య నివర్తకమ్, సమానాశ్రయవిషయయోః,
జ్ఞానాజ్ఞానయో ర్నివర్త్య నివర్తకభావః ।"

పరోక్షజ్ఞానస్థలమున ఇంద్రియమునకు విషయముతో సన్నికర్ష ఉండదు. 'పర్వతో వహ్నిమాన్' అను జ్ఞానము అన్తఃకరణమును మాత్రమే ఆశ్రయించును. అపరోక్షజ్ఞానమైనచో, విషయేంద్రియ

సన్నికర్ష, విషయవ్యాపారము వలన జన్య మగుటచే, విషయ, అంతఃకరణముల రెంటివలన. అపరోక్షజ్ఞానము జన్యమగుటచే విషయనిష్ఠము, అంతఃకరణనిష్ఠము అగుచున్నది. ఆ విషయము ఇట్లు చెప్పబడినది.

పరోక్షజ్ఞానము వలన, అసదావరణ హేతువగు అజ్ఞానము నశించును. అపరోక్షజ్ఞానము వలన, అభానావరణహేతువగు అజ్ఞానము నశించును.

అందుచేత అనుమానాది స్థలములందు 'పర్వతో వహ్నిమాన్' ఇత్యాదులందు అసదావరణము నశించుటచే 'పర్వతే వహ్నిర్నాస్తి' అను ప్రతీతి కలుగదు. సాక్షాత్కారస్థలమున అభానావరణము నివర్తించును గనుక, సోపాధికసాక్షాత్కారభ్రమ నివర్తించుచున్నది.

సిద్ధాన్తబిన్దుః

తస్మాత్ నిర్ధర్మకస్యాపి ఆత్మనః అవిద్యాన్తఃకరణ తాదాత్మ్యాధ్యాసాత్ తద్ధర్మ కర్తృత్వ భోక్తృత్వాధ్యాసః ఉపపద్యతే।

నను, త్వన్మతే అనిర్వచనీయ ఖ్యాత్యభ్యుపగమాత్ యే కర్తృత్వాదయః అన్తఃకరణధర్మాః ఆత్మని అధ్యస్యన్తే తే అనిర్వచనీయాః తత్ర ఉత్పద్యన్త ఇతి వాచ్యమ్। తథా చ వ్యావహారికప్రాతీతిక భేదేన కర్తృత్వ భోక్తృత్వాదీనాం ద్వైధా అవభాసః స్యాత్। న స్యాత్ తాదాత్మ్యాభిమానేన అవివేకాత్। సకల ధర్మవిశిష్టస్యైవ అన్తఃకరణస్య ఆత్మని అధ్యస్తత్వేన

ద్వయాభావాద్వా । తస్మాత్ ఎకస్య అత్మనః ఉపాధిభేదేన ప్రమాత్రాది వ్యవస్థోపపత్తేః న సౌగతమతాపత్తిః, న వా విరోధః । అన్యా అపి వ్యవస్థాః స్పష్టతరం ఉపరిష్టాత్ ఉపపాదయిష్యన్తే। తస్మాత్ జ్ఞానరూపస్య ఆత్మనః సుషుప్తౌ అవ్యభిచారిత్వాత్ దేహేంద్రియాదీనాం చ వ్యభిచారిత్వాత్ దృశ్యత్వాచ్చ తత్ర ఆత్మబుద్ధిః తేషాం తేషాం వాదినాం భ్రాంతిరితి ఔపనిషదం మతం ప్రామాణికమితి సిద్ధమ్॥ ౧.

భా వ దీ పి క

కనుక, ఆత్మవస్తువు, ధర్మము లేనిదైనను, అవిద్య, అంతఃకరణ తాదాత్మ్యాధ్యాసవలన, అంతఃకరణధర్మములగు కర్తృత్వ, భోక్తృత్వాది ధర్మముల యొక్క అధ్యాస కుదురుచున్నది.

ఓయీ! నీ మతమున, అధ్యాస (భ్రాంతి) స్థలములందు అనిర్వచనీయఖ్యాతి అంగీకరింపబడినది. ఆత్మయందు అంతఃకరణధర్మములగు కర్తృత్వ, భోక్తృత్వాదులు ఏవి అధ్యాస చేయబడుచున్నవో, అవి ఆత్మయందు అనిర్వచనీయములుగా ఉత్పన్నము లగుచున్నవని చెప్పవలసియుండును. అట్లు కాగా, అంతఃకరణమునందు వ్యావహారికములగు కర్తృత్వ, భోక్తృత్వములయొక్కయు, ఆత్మయందు అనిర్వచనీయములగు ప్రాతిభాసిక కర్తృత్వ, భోక్తృత్వములయొక్కయు ప్రతీతి రెండు విధములుగా కలుగవలసియున్నది.

అట్లు కాదు. అంతఃకరణగత వ్యావహారిక కర్తృత్వ, భోక్తృత్వములకును, ఆత్మగత ప్రాతిభాసిక కర్తృత్వ, భోక్తృత్వములకును అంతఃకరణ తాదాత్మ్యాభిమానముచే

వివేకము చేయలేనందున, ఒకేవిధముగా కర్తృత్వ, భోక్తృత్వాది ప్రతీతి ఉండును. లేదా, ఆత్మయందు కర్తృత్వ, భోక్తృత్వాధి ధర్మవిశిష్ట అంతఃకరణ తాదాత్మ్యాధ్యాసను అంగీకరించుటవలన (ఆత్మయందు సాక్షాత్తు కర్తృత్వ, భోక్తృత్వాధ్యాస అంగీకరించకపోవుటవలన) రెండు కర్తృత్వములు గాని, రెండు భోక్తృత్వములు గాని, ప్రతీతము కావలసిన పని లేదు. కనుక, ఒకే ఆత్మ, ఉపాధిభేదముచే ప్రమాత, ప్రమాణ, ప్రమితి, ప్రమేయ రూపములను పొందుచున్నందువలన, వ్యవస్థ కుదురును. కనుక బౌద్ధమతమునందువలె శూన్యవాదాపత్తి లేదు. ఉపాధిభేదముచే ఒక వస్తువునకు నానావ్యవహారము ఉండుటలో విరోధము కూడ, లేదు. ఇట్లే, మఱికొన్ని వ్యవస్థలు కూడ, రాబోవు గ్రంథమునందు ఉపపాదింపబడగలవు. కనుక, ఆత్మవస్తువు ఎల్లప్పుడు ప్రకాశించునట్టిది, జ్ఞానస్వరూపము. సుషుప్తియందు గూడ, సుషుప్త్యవస్థను, అజ్ఞానమును, సాక్షిరూపముగా ఉండి ప్రకాశింపజేయుచుండుటవలన సుషుప్త్యవస్థయందు ఆత్మవస్తువు లేదని అనుకొనరాదు. దేహేంద్రియాదులు ఆ సమయమున, పనిచేయకపోవుటవలన, వాని కృత్యము లేదు. మఱియు, ఆ దేహేంద్రియాదులు దృశ్యములు (పరావభాస్యములు) అగుటవలన, దృగ్రూపమగు ఆత్మ అనెడు బుద్ధి, దేహేంద్రియాదులందు భ్రాంతియే అగుచున్నది. ఆ యా వాదులు దేహము ఆత్మ అని; ఇంద్రియములు 'ఆత్మ' అని, ప్రాణము ఆత్మ అని, అహంకారము ఆత్మ అని భావించి ఉండువారి ఆత్మజ్ఞానము సమ్యగ్జ్ఞానము కాదు, భ్రాంతిజ్ఞానమే అయి ఉన్నది. ఉపనిషత్తులందు ఆత్మస్వరూపము 'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ'

'అయమాత్మా అజరో అమరోఽమృతః ఏకః సచ్చిదానన్దరూపః', 'తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్' అను ఆత్మైకత్వ ప్రతిపాదకమైన ఉపనిషన్మతమే, ప్రామాణికము అని సద్ధించినది. ౧

'దశశ్లోకి' యందలి ప్రథమ శ్లోకమునకు
భావదీపికాఖ్య
ఆంధ్ర వివరణము సమాప్తము.



## శ్లో. ౨ న వర్ణాః న వర్ణాశ్రమాచారధర్మాః...

### సిద్ధాన్తబిన్దుః

స్యాదేతత్, ఆత్మనః నిర్ధర్మకత్వే ప్రమాతృత్వాది వ్యవహారస్య అధ్యాసమూలత్వేన బ్రాహ్మణో యజేత ఇత్యేవమాదీనాం శాస్త్రాణాం అప్రామాణ్యప్రసఙ్గః। అకర్తుః అభోక్తుశ్చ ఆత్మనః ప్రవృత్త్యనుపపత్తేః। వేదాప్రమాణ్యే చ కుతో బ్రహ్మసిద్ధిరపి ? తస్య తన్మాత్రగమ్యత్వాత్। శాస్త్రయోనిత్వాదితి న్యాయాత్। తథా చ వేదప్రామాణ్యార్థం ప్రమాతృత్వాది వ్యవహారస్య సత్యత్వం అభ్యుపేయమ్ ఇత్యాశఙ్క్య కిం తత్త్వజ్ఞానాత్పూర్వం అప్రామాణ్యం ఆశఙ్క్యతే, ఊర్ధ్వం వా ? తత్ర ఆద్యే సర్వేషాం ప్రమాణానాం అవిద్యావద్విషయత్వేన తద్దశాయాం బాధాభావాత్। నిష్ప్రత్యూహం ప్రామాణ్యమ్। ద్వితీయే తు ఇష్టాపత్తిరేవ ఇత్యాహ —

### భావదీపిక

'న వర్ణాః న వర్ణాశ్రమాచారధర్మాః' అను రెండవ శ్లోకమునకు అవతారిక చెప్పబడుచున్నది.

మేము, ముందు ఒక ఆశంక చేయబోవుచున్నాము. దానికి సమాధానము ఉన్నచో (అనగా, ఆ ఆశంక కుదరకపోయినచో) మీరు వెనుక చెప్పిన 'ఔపనిషదం మతం ప్రామాణికమ్' అను అర్థము సిద్ధించును. ఆ ఆశంక, 'ఆత్మవస్తువు ధర్మములేనిది, నిర్విశేషము, ప్రమాతృత్వ, కర్తృత్వ, భోక్తృత్వ, బ్రాహ్మణత్వాది

ధర్మములు ఆ ఆత్మయందు అంతఃకరణతాదాత్మ్యాధ్యాస చేత ప్రతీతములు అగుచున్నవని సిద్ధాంతమైనచో, 'బ్రాహ్మణో యజేత' ఈ మొదలగు శాస్త్రములకు (వేదవాక్యములకు) అప్రామాణ్యము ప్రసక్తమగును. ఆత్మ, కర్త, భోక్త కానపుడు యాగమునందు ప్రవృత్తి కుదరనేరదుగదా! వేదములు అప్రమాణము లైనచో, బ్రహ్మవస్తువు, ఎట్లు సిద్ధించునని కూడ, ఆశంక కలదు. 'శాస్త్రయోనిత్వాత్' అను న్యాయము వలన బ్రహ్మ, శాస్త్రైక సమధిగమ్యము కదా! ప్రత్యక్షానుమానములు బ్రహ్మను తెలిసి కొనుటకు పనికిరావు. వేదవాక్యముల వలననే, బ్రహ్మను తెలిసి కొనవలెను. కనుక, ఆ వేదవాక్యముల ప్రామాణ్యము కొఱకు ప్రమాతృత్వ, కర్తృత్వ, భోక్తృత్వ, బ్రాహ్మణత్వాది వ్యవహారము సత్యమని అంగీకరించవలయునను ఆశంక రాగా, తత్త్వజ్ఞానమునకు పూర్వము వేదములకు అప్రామాణ్యమును ఆపాదించుచున్నారా? తత్త్వజ్ఞానానంతరము వేదాప్రామాణ్యమును ఆశంకించుచున్నారా? అని ప్రశ్నింపబడుచున్నది. మొదటి పక్షములో తత్త్వజ్ఞానమునకు పూర్వము ప్రమాణము లన్నింటికి అవిద్యావంతులే ఆశ్రయమగుట చేత ఆ అవిద్యాదశ యందు బ్రహ్మజ్ఞానేతర అబాధ్యత్వరూపమగు వ్యవహారకాలిక సత్యత్వము ఉండుటచే బాధ లేదు. కనుక, వేదములకు ప్రామాణ్యము నిర్విఘ్నముగా సిద్ధించును. వేదప్రామాణ్యమునకు భంగము లేదు. ఇక, తత్త్వజ్ఞానానంతరము అప్రామాణ్యమును ఆశంకించుట అను రెండవ పక్షమునందైతే, కేవల బ్రహ్మాత్మ

అనుభవ సమయమున, అప్రామాణ్యము ఇష్టమే అయి ఉన్నది. అది, దోషము కాదు అని రెండవ శ్లోకమును చెప్పుచున్నారు.

శ్లో॥ న వర్ణాః న వర్ణాశ్రమాచారధర్మాః
న మే ధారణా ధ్యాన యోగాదయోఽపి ।
అనాత్మాశ్రయాహంమమాధ్యాసహానాత్
తదేకోఽవశిష్ట శ్శివః కేవలోఽహమ్ ॥ ౨

భావదీపిక

వేదాన్తముల చేత తత్త్వము - బ్రహ్మవస్తువు, సత్యమైనది బోధింపబడుట వలన, ఆ బ్రహ్మ, అబాధ్యమగుటచే 'అబాధ్య విషయకత్వమ్' అను ప్రామాణ్యము వేదాంతములకు గలదు. అవిద్యాదశయందే, వర్ణాశ్రమాచార ధర్మములు ధారణా, ధ్యాన, యోగాదులు సాధనములుగా అంగీకరింపబడును. పరమార్థదశ యందు వర్ణాః = బ్రాహ్మణత్వాదులు, న = లేవు. బ్రహ్మ ఏ వర్ణమునకు చెందినవాడు కాడు. చాతుర్వర్ణ్యాది విభాగము అవిద్యా దశయందే అయి ఉన్నది.

సిద్ధాన్తబిన్దుః

వర్ణాః బ్రాహ్మణత్వాదయః । ఆశ్రమాః బ్రహ్మచర్యాదయః । ఆచారాః స్నాన శౌచాదయః । ధర్మాః బ్రహ్మచర్యగురుసేవాదయః । అత్ర ద్వంద్వద్వయగర్భ షష్ఠీతత్పురుషేణ వర్ణానాం ఆచారధర్మాః ఆశ్రమాణామపి ఆచారధర్మాశ్చ లభ్యన్తే। ధారణా బ్రహ్మణి బాహ్యవిషయత్యాగేన మనసః స్థైర్యమ్। ధ్యానమ్

పరమాత్మచింతనమ్। యోగః చిత్తవృత్తి నిరోధః। ఆదిశబ్దేన శ్రవణ మననాదయః గృహ్యన్తే। సర్వేషాం జ్ఞానోత్తరకాలే అసత్త్వే హేతు మాహ। అనాత్మాశ్రయ అహంమమాధ్యాసహానాదితి। అనాత్మా ఆత్మవిరోధినీ అవిద్యా। తదాశ్రయః తదుపాదానః యః అహంకార మమకారాధ్యధ్యాసః తస్య మూలస్యాపి తత్త్వజ్ఞానేన హానాత్ తత్ప్రయుక్త వర్ణాశ్రమాదివ్యవహారః నాస్తీత్యర్థః।

## భా వ దీ పి క

వర్ణములు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములు, ఆశ్రమములు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సంన్యాస ఆశ్రమములు. ఆచారములు స్నాన, శౌచాదులు. ధర్మములు వేదాధ్యయన, గురుసేవాదులు. 'వర్ణాశ్రమాచారధర్మాః' అను చోట, విగ్రహము ఇట్లు చెప్పికొనవలెను. 'వర్ణాశ్చ ఆశ్రమాశ్చ వర్ణాశ్రమాః అని, ఒక ద్వంద్వ సమాసము. 'ఆచారాశ్చ ధర్మాశ్చ' అని మఱియొక ద్వంద్వ సమాసము. 'వర్ణాశ్రమాణాం ఆచారధర్మాః' అని షష్ఠీ తత్పురుష సమాసము. ఈవిధముగా ఇది, ద్వంద్వ ద్వయగర్భ షష్ఠీ తత్పురుష సమాసము. దీనిచే వర్ణములయొక్క ఆచారధర్మములు, ఆశ్రమములయొక్కయు ఆచారధర్మములు లభించుచున్నవి.'ధారణా ధ్యాన యోగాదయః' ధారణ అనగా, మనస్సు, బాహ్యవిషయములను త్యజించి బ్రహ్మ యందు స్థిరముగా నిలుచుట. ధ్యానమ్ అనగా, పరమాత్మ చింతనము. యోగము అనగా, చిత్తవృత్తి నిరోధము. 'ఆది' శబ్దముచేత శ్రవణ, మననాదులు గ్రహింపబడును.ఇవి అన్నియు, తత్త్వజ్ఞానోత్తరకాలమున ఉండవు, దానికి కారణమును చెప్పు చున్నారు.

'అనాత్మాశ్రయాహం మమాధ్యాసహానాత్', 'న ఆత్మా అనాత్మా' ఆత్మవిరోధిని యగు అవిద్య. తదాశ్రయః = ఆ అవిద్య, ఉపాదానముగా గల అహం మమాధ్యాస అహంకార మమకారాది అధ్యాసయు, దానికి కారణమగు అజ్ఞానాధ్యాసయు, హానాత్= తత్త్వజ్ఞానముచే బాధింపబడుటవలన, అజ్ఞానమూలకమగు వర్ణాశ్రమాది వ్యవహారము ఉండదని అర్థము. ఈ శ్లోకమునందు 'అహం బ్రహ్మాస్మి' అను తత్త్వజ్ఞానానంతరము 'అహం బ్రాహ్మణః, పరివ్రాజకః' మొదలగు వ్యవహారము ఉండదు. 'పూర్ణానందోఽహమ్।' అను అనుభవము కలుగుచున్నదని చెప్పబడినది, వర్ణాశ్రమాచార ధర్మములను నిరసించుటలో ఈ శ్లోకమునకు తాత్పర్యము లేదు. మీదుమిక్కిలి సాధన, అవిద్యాదశలో గనుక, ఆ దశయందు ధర్మశాస్త్ర సిద్ధములగు వర్ణాశ్రమాచార ధర్మములు, శ్రవణ, మననాదులు శ్రుతిసిద్ధములు తత్త్వజ్ఞానమునకు అనుకూలము లగుటచే, వేదములకు అప్రామాణ్యము గాని, ధర్మశాస్త్రములకు అప్రామాణ్యము గాని లేదు.

'దశశ్లోకి' యందలి ద్వితీయ శ్లోకమునకు

భావదీపికాఖ్య

ఆంధ్రవివరణము సమాప్తము.

## శ్లో. 3 న మాతా పితా వా న దేవా న లోకాః...

శ్లో॥ న మాతా పితా వా న దేవా న లోకాః
న వేదా న యజ్ఞాః న తీర్థం బ్రువన్తి।
సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ 3

### సిద్ధాన్తబిన్దుః

వర్ణాశ్రమాది వ్యవహారస్య మిథ్యాజ్ఞానమూలత్వేన మిథ్యాత్వం ప్రదర్శయితుం తద్వ్యతిరేకే సుషుప్తౌ తద్వ్యతిరేకమాహ। మాతా జనకస్త్రీ। పితా జనకః పుమాన్। దేవాః ఇంద్రాదయః ఆరాధ్యాః। లోకాః తదారాధనఫలాని స్వర్గాదీని। వేదాః అలౌకిక హితాహిత సాధనతాప్రతిపాదకాని, బ్రహ్మప్రతిపాదకాని చ ప్రమాణ వాక్యాని। యజ్ఞాః స్వర్గాది సాధనీభూతాః జ్యోతిష్టోమాదయః। తీర్థం యజ్ఞ సాధనీభూతః కురుక్షేత్రాదిదేశః। ఏవం పాపకర్మ సాధనాన్యపి ఉపలక్షణీయాని। సర్వేషాం దేహాభిమానమూలకత్వాత్ తదభావే స్వతః సంబంధాభావాత్ అవిద్యమానతా ఇత్యర్థః।

### భావదీపిక

'అహం బ్రాహ్మణః, గృహస్థః' అను వర్ణాశ్రమాది వ్యవహారము ఆత్మయందు అనిర్వచనీయమగు అజ్ఞానాధ్యాస మూలకముగా జరుగుచున్నది. కనుక, మిథ్యావిషయక మగుటచే, ఆ వ్యవహారము మిథ్యాభూతమైనది. ఆ వర్ణాశ్రమాభిమానము లేనపుడు, సుషుప్తిదశయందు వర్ణాశ్రమాది వ్యవహారము లేదని

చూపుచున్నారు. మాతా=కన్నతల్లి. పితా=జనక పురుషుడు. దేవులు ఆరాధింపబడు ఇంద్రాది దేవతలు. లోకములు ఇంద్రాది దేవతారాధన ఫలములగు స్వర్గాదులు. వేదములు ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములచే తెలియబడని హిత సాధనములను, అహిత సాధనములను ప్రతిపాదించునట్టి కర్మకాండవాక్యములు, బ్రహ్మ ప్రతిపాదకములగు ఉపనిషత్ప్రమాణ వాక్యములు. యజ్ఞములు, స్వర్గాది సాధనభూతములగు జ్యోతిష్టోమాదులు. తీర్థములు, యజ్ఞసాధనమగు పవిత్ర కురుక్షేత్రాది దేశము. ఈ విధముగా పాపకర్మసాధకములగు ప్రదేశములు కూడ. ఉపలక్షణముగా గ్రహింపదగినవి. ఇవి అన్నియు, 'మనుష్యోఽహం, బ్రాహ్మణోఽహమ్' అను దేహాభిమానమూలకములే గనుక, దేహాభిమానము లేకుండ మనుష్యత్వాది, మాతృత్వ, పితృత్వాది, బ్రాహ్మణత్వాది ధర్మములతో సంబంధము లేదు గనుక, కేవలాత్మయందు 'న మాతా' మాతృత్వము లేదు. 'న పితా' పితృత్వము లేదు. 'న దేవాః' దేవత్వము లేదు. 'న లోకాః' భోగభూమిత్వము లేదు.

సిద్ధాన్తబిన్దుః

తథా చ సుషుప్తిం ప్రకృత్య శ్రుతిః– 'అత్ర పితా అపితా భవతి, మాతా అమాతా, దేవా అదేవాః, వేదా అవేదాః, యజ్ఞాః అయజ్ఞాః, స్తేన అస్తేనో భవతి। భ్రూణః అభ్రూణః, చణ్డాలః అచణ్డాలః, పౌల్కసః అపౌల్కసః, శ్రమణః అశ్రమణః, తాపసః అతాపసః, అనన్వాగతం పుణ్యేన, అనన్వాగతం పాపేన, తీర్ణో హి తదా సర్వాన్ శోకాన్, హృదయస్య భవతి' ఇత్యాద్యాః। అభిమానాభావే సర్వానర్థ నివృత్తిం అనువదన్తి।

నను సర్వవ్యవహారాభావే శూన్యతైవ స్యాత్। న, ఇత్యాహ। నిరస్తాతిశూవ్యాత్మకత్వాదితి। నిరస్తం అతిశూన్యాత్మకత్వం యస్మాత్ తత్తథా। భావప్రధానో నిర్దేశః। తస్య సుషుప్తి సాధకత్వాత్ పునః ఉత్థానానుపపత్తేశ్చ। అవినాశీ వా అరే అయమాత్మా, అనుచ్ఛిత్తిధర్మా, మాత్రా అసంసర్గస్తు అస్య భవతి, యద్వై తన్న పశ్యతి పశ్యన్ వై తన్న పశ్యతి న హి ద్రష్టుః దృష్టే ర్విపరిలోపో విద్యతే, అవినాశిత్వాత్। న తు తద్వితీయ మస్తి। తతోఽన్యత్ విభక్తం యత్ పశ్యేత్ ఇత్యాది శ్రుతిభ్యశ్చ ఆత్మచైతన్యస్య న సుషుప్తౌ శూన్యతా ఇత్యర్థః।

## భా వ దీ పి క

మాతృత్వ, పితృత్వాది ధర్మములు దేహాభిమాన మూలకములు. ఆ దేహాభిమానము (అహంకారాధ్యాస) లేనప్పుడు, చిద్రూపమగు ఆత్మయందు ఆ మాతృత్వాది ధర్మములు ఉండవు అను విషయము సుషుప్తిని వర్ణించుచు, శ్రుతి ఇట్లు చెప్పుచున్నది. ఈ సుషుప్తియందు తండ్రి, తండ్రి కాడు. అనగా, మమకారముతో గూడిన పితృత్వాది ధర్మముతో వ్యవహరింపబడడు. తల్లి, తల్లి కాదు. దేవతలు, దేవతలు కారు. వేదములు, వేదములు కావు. యజ్ఞములు, యజ్ఞములు కావు. దొంగ, దొంగ కాడు. భ్రూణహత్య చేసినవాడు భ్రూణహా కాడు. చండాలుడు, చండాలుడు కాడు. పౌల్కసుడు, పౌల్కసుడు కాడు. సంన్యాసి, సంన్యాసి కాడు. వానప్రస్థుడు, వానప్రస్థుడు కాడు. సుషుప్తియందు పుణ్యముతో జీవులకు సంబంధము లేదు. అపుడు, జీవుడు హృదయము యొక్క సర్వదుఃఖములను అతిక్రమించును. మొదలగు శ్రుతులు,

దేహాభిమాన (అహంకారాధ్యాస) లేనపుడు, సర్వానర్థములు తొలగి పోవుటను అనువదించుచున్నవి.

ఓయీ ! సర్వవ్యవహారములు లేనపుడు, శూన్యతయే కదా మిగులునది ? అట్లు కాదు అని చెప్పుచున్నారు. 'నిరస్తాతి శూన్యాత్మకత్వాత్' ఇతి 'శూన్య' అను నిర్దేశము భావప్రధానము. శూన్యత్వము అని అర్థము. నిరసింపబడిన శూన్యత్వము కలవాడు సుషుప్తికాలములోని ఆత్మ అగుచున్నాడు. అనగా, అపుడు ఆత్మ, సద్రూపముతో ఉండియే ఉన్నాడు. మఱియు, ఆ సుషుప్త్యవస్థకు సాక్షిగా ప్రకాశకుడు అగుచున్నాడు. ఒకవేళ, సుషుప్తిలో ఆత్మ లేడు అని అనుకొనినచో, తిరిగి మేల్కొని జాగ్రద్వ్యవహారము చేయుట పొసగదు. మఱియొక శ్రుతి, ఇట్లు చెప్పుచున్నది. ఓ మైత్రేయీ ! ఈ ఆత్మ, నశించువాడు కానే కాడు. ఎన్నడును లేకపోవుట (ఉచ్ఛిత్తి) లేదు. సచ్చిదానంద స్వరూపుడై యున్నాడు. ఆ సుషుప్తి సమయమందు ఈ ఆత్మకు విషయములతో సంబంధము ఉండదు. జాగ్రత్తులో ఏ వస్తువులను చూచుచున్నాడో, సుషుప్తియందు ఆ వస్తువులను చూడడు. అయినను, చూచునే జ్ఞానము కలవాడై ఉండియే, ఆ విషయములను చూచుటలేదు. ద్రష్టగా ఉన్నాడు. ద్రష్టయొక్క దృష్టికి ఏ మాత్రము లోపము లేదు. ఇంద్రియ విషయసంసర్గాధీన మగు అనిత్య దృష్టి ఉండదు గాని, దృగ్రూపమగు నిత్య దృష్టి స్వరూపముతో ఉంటున్నాడు. ఆ చిద్రూపము కంటె, విభక్తమయిన మఱియొక రూపము అపుడు లేదు. జాగ్రత్తునందు విభక్తరూపమును చూచునేగాని, సుషుప్తియందు ఆ విభక్త స్థూల

ధర్మములు ఆ ఆత్మయందు అంతఃకరణతాదాత్మ్యాధ్యాస చేత ప్రతీతములు అగుచున్నవని సిద్ధాంతమైనచో, 'బ్రాహ్మణో యజేత' ఈ మొదలగు శాస్త్రములకు (వేదవాక్యములకు) అప్రామాణ్యము ప్రసక్తమగును. ఆత్మ, కర్త, భోక్త కానపుడు యాగమునందు ప్రవృత్తి కుదర నేరదుగదా! వేదములు అప్రమాణము లైనచో, బ్రహ్మవస్తువు, ఎట్లు సిద్ధించునని కూడ, ఆశంక కలదు. 'శాస్త్రయోనిత్వాత్' అను న్యాయము వలన బ్రహ్మ, శాస్త్రైక సమధిగమ్యము కదా! ప్రత్యక్షానుమానములు బ్రహ్మను తెలిసి కొనుటకు పనికిరావు. వేదవాక్యముల వలననే, బ్రహ్మను తెలిసి కొనవలెను. కనుక, ఆ వేదవాక్యముల ప్రామాణ్యము కొఱకు ప్రమాతృత్వ, కర్తృత్వ, భోక్తృత్వ, బ్రాహ్మణత్వాది వ్యవహారము సత్యమని అంగీకరించవలయునను ఆశంక రాగా, తత్త్వజ్ఞానమునకు పూర్వము వేదములకు అప్రామాణ్యమును ఆపాదించుచున్నారా? తత్త్వజ్ఞానానంతరము వేదాప్రామాణ్యమును ఆశంకించుచున్నారా? అని ప్రశ్నింపబడుచున్నది. మొదటి పక్షములో తత్త్వజ్ఞానమునకు పూర్వము ప్రమాణములన్నింటికి అవిద్యావంతులే ఆశ్రయ మగుట చేత ఆ అవిద్యాదశ యందు బ్రహ్మజ్ఞానేతర అబాధ్యత్వరూపమగు వ్యవహారకాలిక సత్యత్వము ఉండుటచే బాధ లేదు. కనుక, వేదములకు ప్రామాణ్యము నిర్విఘ్నముగా సిద్ధించును. వేదప్రామాణ్యమునకు భంగము లేదు. ఇక, తత్త్వజ్ఞానానంతరము అప్రామాణ్యమును ఆశంకించుట అను రెండవ పక్షమునందైతే, కేవల బ్రహ్మాత్మ

అనుభవ సమయమున, అప్రామాణ్యము ఇష్టమే అయి ఉన్నది. అది, దోషము కాదు అని రెండవ శ్లోకమును చెప్పుచున్నారు.

శ్లో॥ న వర్ణాః న వర్ణాశ్రమాచారధర్మాః
న మే ధారణా ధ్యాన యోగాదయోఽపి ।
అనాత్మాశ్రయాహంమమాధ్యాసహానాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥ ౨

### భావదీపిక

వేదాన్తముల చేత తత్త్వము - బ్రహ్మవస్తువు, సత్యమైనది బోధింపబడుట వలన, ఆ బ్రహ్మ, అబాధ్యమగుటచే 'అబాధ్య విషయకత్వమ్' అను ప్రామాణ్యము వేదాంతములకు గలదు. అవిద్యాదశయందే, వర్ణాశ్రమాచార ధర్మములు ధారణా, ధ్యాన, యోగాదులు సాధనములుగా అంగీకరింపబడును. పరమార్థదశయందు వర్ణాః = బ్రాహ్మణత్వాదులు, న = లేవు. బ్రహ్మ ఏ వర్ణమునకు చెందినవాడు కాడు. చాతుర్వర్ణ్యాది విభాగము అవిద్యాదశయందే అయి ఉన్నది.

### సిద్ధాన్తబిన్దుః

వర్ణాః బ్రాహ్మణత్వాదయః । ఆశ్రమాః బ్రహ్మచర్యాదయః । ఆచారాః స్నాన శౌచాదయః । ధర్మాః బ్రహ్మచర్యగురుసేవాదయః । అత్ర ద్వంద్వద్వయగర్భ షష్ఠీతత్పురుషేణ వర్ణానాం ఆచారధర్మాః ఆశ్రమాణామపి ఆచారధర్మాశ్చ లభ్యన్తే। ధారణా బ్రహ్మణి బాహ్యవిషయత్యాగేన మనసః స్థైర్యమ్। ధ్యానమ్

పరమాత్మ చింతనమ్। యోగః చిత్తవృత్తి నిరోధః। ఆదిశబ్దేన శ్రవణ మననాదయః గృహ్యన్తే। సర్వేషాం జ్ఞానోత్తరకాలే అసత్త్వే హేతు మాహ। అనాత్మాశ్రయ అహంమమాధ్యాసహానాదితి। అనాత్మా ఆత్మవిరోధినీ అవిద్యా। తదాశ్రయః తదుపాదానః యః అహంకార మమకారాద్యధ్యాసః తస్య మూలస్యాపి తత్త్వజ్ఞానేన హానాత్ తత్ప్రయుక్త వర్ణాశ్రమాదివ్యవహారః నాస్తీత్యర్థః।

## భా వ దీ పి క

వర్ణములు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములు, ఆశ్రమములు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సంన్యాస ఆశ్రమములు. ఆచారములు స్నాన, శౌచాదులు. ధర్మములు వేదాధ్యయన, గురుసేవాదులు. 'వర్ణాశ్రమాచారధర్మాః' అను చోట, విగ్రహము ఇట్లు చెప్పికొనవలెను. 'వర్ణాశ్చ ఆశ్రమాశ్చ వర్ణాశ్రమాః అని, ఒక ద్వంద్వ సమాసము. 'ఆచారాశ్చ ధర్మాశ్చ' అని మఱియొక ద్వంద్వ సమాసము. 'వర్ణాశ్రమాణాం ఆచారధర్మాః' అని షష్ఠీ తత్పురుష సమాసము. ఈవిధముగా ఇది, ద్వంద్వ ద్వయగర్భ షష్ఠీ తత్పురుష సమాసము. దీనిచే వర్ణములయొక్క ఆచారధర్మములు, ఆశ్రమములయొక్కయు ఆచారధర్మములు లభించుచున్నవి.'ధారణా ధ్యాన యోగాదయః' ధారణ అనగా, మనస్సు, బాహ్యవిషయములను త్యజించి బ్రహ్మ యందు స్థిరముగా నిలుచుట. ధ్యానమ్ అనగా, పరమాత్మ చింతనము. యోగము అనగా, చిత్తవృత్తి నిరోధము. 'ఆది' శబ్దముచేత శ్రవణ, మననాదులు గ్రహింపబడును.ఇవి అన్నియు, తత్త్వజ్ఞానోత్తరకాలమున ఉండవు, దానికి కారణమును చెప్పుచున్నారు.

లను కూడ, సంగ్రహించి నిరాకరింపబడును. ముందు, అచేతనము, త్రిగుణాత్మకము, జడమగు ప్రధానము జగత్తునకు ఉపాదానకారణము కాదు. శ్రుతియందు 'సోఽకామయత' 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయ' బహురూపములుగా, ఉద్భవించి ఉందును అని స్రష్టవ్య పర్యాలోచనమును చేసెనని పర్యాలోచన పూర్వకముగా సృష్టి వినబడుటవలన, ఈక్షణము (పర్యాలోచన) చేతనధర్మమే గాని, జడమగు ప్రధానమునకు ఈక్షణము కుదరదు గనుక, శ్రుతియందు జగత్కారణముగా ప్రధానము నిర్దేశింపబడ లేదు. మఱియు, 'అనేన జీవేనాత్మనా అనుప్రవిశ్య' అను శ్రుతిచే జగత్కారణమునకు జీవుడు, ఆత్మగా (స్వరూపముగా) నిర్దేశింప బడుట వలన, జీవుడు చేతనుడు గనుక, జగత్కారణము చేతనమే అయి ఉండవలెను, 'యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' ఏది తెలిసనచో, అంతయు తెలియబడుచున్నదో, అది జగత్కారణము అని చెప్పాచు, 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞా'– ఏక విజ్ఞానముచే సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ చేయుబడినది. ప్రధానమే జగత్కారణమైనచో, ప్రకృతియగు ప్రధానము యొక్క జ్ఞానముచే ప్రకృతికార్యములగు మహదహంకార, పంచతన్మాత్ర, భూతాదులు ప్రకృతి స్వరూపములుగా తెలియబడినను, చేతనుడగు పురుషుడు, జడమగు ప్రధానముకంటె, భిన్న తత్త్వము గనుక 'ప్రధాన'జ్ఞానముచే పురుషజ్ఞానము కలుగనేరదు కావున. వారికి (సాంఖ్యులకు) ఏకజ్ఞానముచే సర్వవిజ్ఞానప్రతిజ్ఞ కుదరదు. మఱియు, 'ఐతదాత్మ్యమిదం సర్వమ్, స ఆత్మా, తత్త్వమసి'

అని జీవులకు జగత్కారణమగు పరమాత్మతో అభేదము తొమ్మిది పర్యాయములు ఉపదేశింపబడుట వలన, జగత్కారణాభేదము జీవులకు ఉపచరితము అని వ్యాఖ్యానించుటకు వీలు లేదు. జగత్కారణముతో జీవులకు ముఖ్యస్వరూపాభేదమే గ్రహించవలయును. ఆదరము గల అర్థమును అనేక పర్యాయములు చెప్పుట, లోకమునకు సహజము. 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః' అను తైత్తిరీయ శ్రుతిలో 'తస్మాత్ ఆత్మనః' అని జగత్కారణము చేతనమగు ఆత్మగా చెప్పబడినది. అచేతనమగు ప్రధానమే, జగత్కారణమగుచో, విచిత్ర రథ, శరీరాది నిర్మాణము కుదరనేరదు. ప్రధానము, మహత్తు అను పదములు ఆ సాంఖ్యదర్శనమునకు మాత్రమే పరిమితములు, పారిభాషికములు, అప్రామాణికములు, శ్రుతియందు ఆ అర్థమున ప్రధాన, మహదాదిపదములు వాడబడి ఉండలేదు. కనుక, సాంఖ్యమతము శ్రుత్యర్థబాధము కాదు.

## సిద్ధాన్తబిన్దుః

ఏవం పాశుపతమతం పాఞ్చరాత్రికం జైనం త్రైదండిం చ మతం శ్రుతి, యుక్తి బాధితత్వాత్ అయుక్తమ్। న విధిశేషత్వాత్ శ్రుతిః న బ్రహ్మ ప్రతిపాదయతి ఇతి మీమాంసకమతం యుక్తమ్ । అశుద్ధత్వాత్ విధిశేషత్వస్య । న చ అర్థవాదాధికరణ న్యాయాత్ విధిశేషత్వమ్ । వైషమ్యాత్, స్వతః ప్రయోజనవత్ అర్థఅప్రతిపాదకానాం 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' ఇత్యేవమాదీనాం స్వాధ్యాయవిధిగ్రహణాన్యథానుపపత్త్యా ప్రయోజనవదర్థపరత్వే ల్పనీయే శబ్దభావనేతికర్తవ్యతాంశ సాకాంక్షస్య విధేః సంప్రదాన

భూత దేవతాది స్తుతిద్వారేణ తదంశపూరకత్వాత్ నష్టాశ్వదగ్ధరథ న్యాయేన తదుభయఏకవాక్యతా ఇతి అర్థవాదాధికరణే నిర్ణీతమ్ । వేదాన్తవాక్యజన్యజ్ఞానాచ్చ సాక్షాదేవ పరమానన్దప్రాప్తిః నిశ్శేష దుఃఖనివృత్తిశ్చ పురుషార్థః లభ్యతే ఇతి నిరాకాంక్షత్వాత్ న అన్యశేష సంభావనా । ప్రత్యుత విధయ ఏవ అన్తఃకరణశుద్ధి ద్వారా తచ్ఛేషతాం భజన్తే ఇతి। తస్మాత్ ప్రయోజనవత్ అబాధిత అజ్ఞాతజ్ఞాపకత్వేన వేదాన్తానాం స్వత ఏవ ప్రామాణ్యాత్ అస్త్యేవ బ్రహ్మ ఇతి న మీమాంసక మతసిద్ధిః ।

## భావదీపిక

ఈ విధముగా పాశుపతమతము, పాంచరాత్రిక మతము, జైనమతము, త్రిదండ వైష్ణవమతము, శ్రుతి, యుక్తిబాధితము లగుటచే బాధితములు. ఎట్లనగా, పాశుపతమతమున, పశుపతి జగత్తునకు కర్తగానే అంగీకరింపబడుచున్నాడు. ఉపాదానముగా అంగీకరింపబడలేదు. 'తదాత్మానగ్ం స్వయమకురత', 'బహుస్యాం ప్రజాయేయ' మొదలగు శ్రుతులు, జగత్కారణమైన వస్తువునకు ఉపాదానకారణత్వమును గూడ, చెప్పుచున్నవి. అందువలన, శ్రుతిబాధితము. మఱియు, వారు జీవేశ్వరవాస్తవభేదమును అంగీకరించుచున్నారు. తత్త్వమస్యాది శ్రుతులుచే వాస్తవాభేదము నంగీకరించి ఉపాసన కొఱకు ఔపాధిక భేదమును అంగీకరించిన, సరిపోవును. కనుక, జీవేశ్వరులకు వాస్తవభేదకల్పన వ్యర్థము అను యుక్తిచే పాశుపతమతము బాధితము.

పాంచరాత్రమతమున, జీవులకు ఉత్పత్తిని అంగీకరించు చున్నారు. అవి 'అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః' అను

శ్రుతిచే బాధితము. జీవునకు పుట్టుకను అంగీకరించినచో కృతహాని, అకృత అభ్యాగమము అను దోషములు ప్రసక్తమగునను యుక్తిచే బాధితము.

జైన, త్రిదండి మతములందు జగత్కారణము పరిణామ నిత్య మందురు. జగత్కారణము శ్రుతియందు కూటస్థనిత్యముగా వర్ణింపబడినది. మఱియు, వారు కార్య, కారణములకు భేదాభేద ములను అంగీకరింతురు. ముక్తివఱకు భేదము, ముక్తియందు అభేదము - రెండును సత్యములుగా అంగీకరించుచున్నారు. వాస్తవాభేదమే శ్రుతిసిద్ధము. భేదము ఉపాధికల్పితము, మిథ్యా భూతము.

తరువాత, మీమాంసకమతము నివాకరింపబడుచున్నది. ఉపనిషత్తులు కర్మకాండవిధిశేషములు. విహితక్రియలకు కర్తను స్తుతించుటలో ఉపనిషత్తులు చరితార్థములు, బ్రహ్మను ప్రతి పాదించవు అను మీమాంసకమతము కూడ, యుక్తమైనది కాదు. ఉపనిషత్తులకు విధిశేషత్వము కుదరనేరదు. పూర్వమీమాంస యందు అర్థవాదాధికరణమున, అర్థవాదలకు విధిశేషత్వము అంగీ కరింపబడినది. అట్లు, సిద్ధబ్రహ్మపరములగు, ఉపనిషద్వాక్యము లకు విధిశేషత్వము నిరూపించుట సంభవము కాదు. అర్థవాదలకు, ఉపనిషత్తులకు వైషమ్యము కలదు. 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను విధిచేత గ్రహింపబడిన 'వాయువ్యగ్ం శ్వేతమాలభేత' మొదలగు విధివాక్యములు ప్రయోజనము గల అర్థమును ప్రతిపాదించును. వానికి శేషముగా నున్న -

'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా, వాయుమేవ స్వేన భాగధేయ
ముపధావతి, స ఏవ ఏనం భూతిం గమయతి।'

అను అర్థవాదమును వాయుదేవత, శీఘ్రగామిదేవత. (తొందరగా హవిస్సును అందుకొని శీఘ్రముగా ఐశ్వర్యము నిచ్చును.) స్వాధ్యాయవిధిగృహీత మగుటచే వ్యర్థము కాకూడదు గనుక, ప్రయోజనమును కల్పించవలసిరాగా, 'వాయవ్యం శ్వేత మాలభేత' అను విధివాక్యములో ఎట్లు చేయవలయు నను ఇతికర్తవ్యతాకాంక్ష ఉండుటచే హవిస్సును గ్రహించు వాయుదేవత ప్రశస్తమైన దను స్తుతి ద్వారా ఇతికర్తవ్యతాకాంక్షను పూరించి, సార్థక మగుచున్నది. నష్టాశ్వదగ్ధరథన్యాయముచే విధివాక్యమునకు ఇతికర్తవ్యతాకాంక్షయు, అర్థవాదవాక్యమునకు ప్రయోజనాకాంక్షయు ఉభయాకాంక్ష ఉండుటచేత, ఏకవాక్యత కుదురుచున్నది. నష్టాశ్వదగ్ధరథన్యాయ మనగా, యుద్ధముచేయువారిలో ఒక రథికునకు అశ్వములు పోయినవి, మఱియొక రథికునకు రథము పోయినది. ఆ రథికులకు పరస్పరము ఒకరికి అశ్వములు, మఱియొకరికి రథములు కావలయును. మిగిలిన అశ్వములను, మిగిలిన రథమునకు కట్టి, ఇరువురు రథికులు ఆరూఢులగుట, పయనము సాగించుట, నష్టాశ్వదగ్ధరథన్యాయము. అర్థవాదాధికరణమున, ఈ విధముగా నిర్ణయింపబడినది. ఆ న్యాయము వేదాన్తవాక్యములకు వర్తించదు. వేదాన్తవాక్యముల వలన, కలిగిన జ్ఞానము వలన సాక్షాత్తుగానే 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' ఇత్యాది విధివాక్యములను అపేక్షించకయే, పరమానందప్రాప్తి, నిశ్శేష దుఃఖనివృత్తిరూప, పురుషార్థము లభించుటచే వేదాన్తవాక్యములు నిరాకాంక్షములు, విధిశేషములని అనుకొనరాదు. మఱియు, మీదు

మిక్కిలి విధివాక్యములే కర్మానుష్ఠానము ద్వారా అంతఃకరణశుద్ధిని కలిగించుటవలన, వేదాన్తవాక్యముల వలన, తత్త్వజ్ఞానము కలుగుటచే వేదాన్తవాక్యములకే విధివాక్యములు అంగములు అని అంగీకరించుట యుక్తము. కనుక, వేదాన్తములు ప్రయోజనములు కల, బాధితము కాని, అజ్ఞాతమగు, జీవబ్రహ్మ ఐక్యలక్షణమగు అర్థమును బోధించుటచేత, స్వతఃప్రమాణములు. కావున, బ్రహ్మ ఉన్నది అనియే అంగీకరించవలెను. 'నాస్తి బ్రహ్మ' అను మీమాంసక మతము సిద్ధించదు, యుక్తము కాదు.

## సిద్ధాన్తబిన్దుః

తార్కికాదీనాం చ మతం 'తత్త్వమసి', 'అహం బ్రహ్మాస్మి', 'అయమాత్మా బ్రహ్మ', 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' ఇత్యాది శ్రుతిబాధితమ్ । 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ', 'నేహ నానాఽస్తి కిఞ్చన' ఇత్యాది శ్రుతిబాధితం చ। 'భిన్నాభిన్నత్వం క్షణికత్వం చ 'ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః' ఇత్యాది శ్రుతిబాధితమ్। అత్ర సర్వేషాం మతస్య అసత్యే ప్రతిజ్ఞాతే విశుద్ధాత్మకత్వాత్ ఇతి హేతుః। నిర్వికల్ప అద్వితీయ చైతన్యరూపత్వాత్ ఇత్యర్థః। అత్ర హేతుః విశిష్టానుభూత్యా ఇతి। విశిష్టా సవికల్పకానుభూతిభ్యః వ్యావృత్తా యా తత్త్వమస్యాదివాక్యజన్యా అఖండానుభూతిః తయా ఇత్యర్థః। తేన సర్వవ్యాపకం అద్వితీయం పరమానంద బోధరూపం చ ఇతి సిద్ధమ్ ॥४॥

## భావదీపిక

తార్కిక, జైన, త్రైదండి మతములు కూడ శ్రుతి,యుక్తి

బాధితములు. మొదట, జీవాత్మ, పరమాత్మ భేదమును అంగీకరించు తార్కికమతము 'తత్త్వమసి', 'అహం బ్రహ్మాస్మి', 'అయమాత్మా బ్రహ్మ' మొదలగు జీవాత్మ, పరమాత్మ ఏకత్వ ప్రతిపాదకములగు శ్రుతులచే బాధితము. 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ', 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' బ్రహ్మవస్తువు ఒక్కటే, రెండవది లేదు. 'నేహ నానాఽస్తి కిఞ్చన' బ్రహ్మయందు నానా రూపమగు జగత్తు లేదు, మిథ్య అను అర్థము గల శ్రుతులచే బాధితము. ప్రపంచ, బ్రహ్మలకు సత్యములగు భేదాభేదములను అంగీకరించు జైన, త్రైదండి మతములు, ఆత్మ క్షణికము అనగా క్షణమాత్రము ఉండు జ్ఞానస్వరూపము అను సౌగత మతము 'ఐతదాత్మ్యమిదం సర్వమ్' ఈ సమస్త జగత్తు, సద్రూప బ్రహ్మయే, స్వరూపముగా గలది, బ్రహ్మయే, ప్రపంచము యొక్క స్వరూపము, 'ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః' ఆత్మ, ఆకాశము వలె సర్వవ్యాపకుడు, నిత్యమైనవాడు అను అర్థము గల శ్రుతులచే బాధితము. ఈ సాంఖ్యాది మతము లన్నియు, సమీచీనములు కావు అను ప్రతిజ్ఞ చేయబడగా, 'విశుద్ధాత్మకత్వాత్' అను హేతువు ప్రదర్శింపబడుచున్నది. బ్రహ్మవస్తువు నిర్వికల్ప, అద్వితీయ, చైతన్యరూప మగుటవలన అని ఆ హేతువునకు అర్థము. ఇట్టి బ్రహ్మ, సాంఖ్యాదులకు సమ్మతము కాదు. ఇందులకు కారణము 'విశిష్టానుభూత్యా' అని చూపబడినది. 'విశిష్టా' అనగా, సవికల్పక అనుభవములకంటె విలక్షణమైన 'అనుభూత్యా' తత్త్వమస్యాది వాక్యములచేత కలిగిన అఖండ అర్థానుభూతి చేత, మహావాక్యముల వలన నిర్వికల్పక అఖండ

అర్థానుభవము కలుగుటచే బ్రహ్మావరకమగు మూలాజ్ఞానము నశించుచున్నది, బ్రహ్మస్వరూపానుభవము కలుగుచున్నది. అందుచేత సర్వవ్యాపకము, అద్వితీయము, పరమానందబోధ రూపము అగు బ్రహ్మ, సిద్ధించుచున్నది. ఇచట, బ్రహ్మ, సకల జగదధిష్ఠాన మగుటచే, జగత్తాదాత్మ్యము ఉపలక్షణముగా నున్నది. అట్లే, ద్వితీయాభావము కూడ ఉపలక్షణమని గ్రహించవలెను. ॥४॥

'దశశ్లోకి' యందలి తురీయ శ్లోకమునకు
భావదీపికాఖ్య
ఆంధ్ర వివరణము సమాప్తము,



## శ్లో. ౨౫ న చోర్ధ్వం న చాధః న చాన్తః న బాహ్యమ్

సి ద్ధా న్త బి న్దుః

నను 'స ఏషోఽణిమా', 'అణో రణీయాన్' ఇతి బ్రహ్మణః అణుత్వ శ్రుతేః 'అంగుష్ఠమాత్రః పురుషః, 'ఆరాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః' ఇత్యాది శ్రుతిప్రతిపాదిత అణుత్వవిశిష్ట జీవాభిన్నత్వాచ్చ న బ్రహ్మణః సర్వవ్యాపకత్వమ్ ఇత్యాశఙ్క్య 'బ్రహ్మైవ ఇద మమృతం పురస్తాత్, బ్రహ్మ పశ్చాత్, బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ। అధశ్చోర్ధ్వం చ ప్రసృతమ్। బ్రహ్మైవేదం, విశ్వమిదం వరిష్ఠమ్।' 'తదేతత్ బ్రహ్మపూర్వమ్, అనపరమ్, అనన్తరమ్, అబాహ్యమ్। ఇత్యాద్యాః శ్రుతయః నిర్విశేషమేవ బ్రహ్మ ప్రతిపాదయన్తీతి పూర్వోక్తమేవ ద్రఢయన్నాహ న చోర్ధ్వమితి।

భా వ దీ పి క

ఓయీ! 'సః య ఏషః అణిమా' ఆ ఈ ఆత్మ (బ్రహ్మ) అణుస్వరూపుడు. 'అణోరణీయాన్' అణువుకంటెను సూక్ష్మమైన వాడు అను శ్రుతివలన,

''అంగుష్ఠమాత్రః పురుషః, ఆరాగ్రమాత్రః అవరోఽపి దృష్టః'' అని అంగుష్ఠపరిమాణము,ఆరాగ్రపరిమాణము గల జీవునితో అభేద మును బ్రహ్మకు చెప్పుటవలన, బ్రహ్మకు సర్వవ్యాపకత్వము లేదు అను ఆశంక చేసికొని, 'బ్రహ్మైవేదం అమృతం పురస్తాత్' అను శ్వేతాశ్వతర శ్రుతి, ఈ ప్రపంచము, విశ్వము అమృతమైన

బ్రహ్మవస్తువే అయిఉన్నది. ఈ బ్రహ్మ తూర్పున, పడమట, దక్షిణమున, ఉత్తరమున, క్రింద, పైన, అంతట వ్యాపించి ఉన్నది. ఈ బ్రహ్మ, కారణము లేనిది, కార్యము లేనిది. బాహ్య అభ్యంతరములు లేనిది అను అర్థము గల శ్రుతులు నిర్విశేష బ్రహ్మను సర్వవ్యాపకముగా ప్రతిపాదించుచున్నవి గనుక, బ్రహ్మకు అంగుష్ఠపరిమాణత్వాదులు, అంగుష్ఠపరిమాణమగు హృదయదేశమున, ఉపలభ్యమాను డగుటచేత ఔపచారికములు. జీవునకు ఉపాధియగు బుద్ధిచేతనే ఆరాగ్రపరిమాణ వ్యవహారము, అణుత్వము, బ్రహ్మ దుర్జ్ఞేయము అను అభిప్రాయమున వర్ణింపబడినది. కనుక, సర్వవ్యాపకత్వము బ్రహ్మకు యుక్తమయినదని ఈ ముందు 'న చోర్ధ్వమ్' శ్లోకముచే దృఢపరచుచున్నారు.

శ్లో॥ న చోర్ధ్వం న చాధః నచాన్తః న బాహ్యం
న మధ్యం న తిర్యఙ్ న పూర్వాపరా దిక్।
వియద్వద్వ్యాపకత్వాత్ అఖణ్డైకరూపః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ ౫

## సిద్ధాన్తబిన్దుః

వియద్వద్వ్యాపకత్వాత్ 'ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః' ఇతి శ్రుతేః, వియతః వ్యాపకత్వాత్ ఇతి వా। 'జ్యాయాన్ ఆకాశాత్', 'మహతో మహీయాన్' ఇత్యాది శ్రుతేః। జీవస్యాపి సకల దేహవ్యాపి చైతన్యోపలబ్ధ్యా మహత్త్వేఽపి ఉపాధిధర్మాధ్యాసేన ఆరాగ్రమాత్రత్వాభిధానమ్। 'బుద్ధే ర్గుణేన ఆత్మగుణేన చైవ ఆరాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః' ఇతి శ్రుతేః। బ్రహ్మణశ్చ సూక్ష్మత్వాభిప్రాయేణ అణుత్వవ్యపదేశాత్। శేషం అతిరోహితార్థమ్॥ ౫

### భా వ దీ పి క

'వియద్వద్వ్యాపకత్వాత్'- 'ఆకాశమువలె సర్వవ్యాపకుడు, నిత్యుడు ఆత్మ' అను అర్థము గల శ్రుతిచే బ్రహ్మకు ఆకాశముతో పోల్చి, సర్వవ్యాపకత్వము చెప్పబడినది. లేదా, 'వియతః వ్యాపకత్వాత్'- ఆకాశముకంటె గూడ, వ్యాపకమైన వాడగుటచేత అని రెండవ పక్షమున అర్థము. ఇందులకు 'జ్యాయాన్ ఆకాశాత్' ఆకాశముకంటె గూడ, పెద్దవాడు అను శ్రుతి, ప్రమాణము. బ్రహ్మాధిష్ఠానమునందు ఆకాశము, తాదాత్మ్యముచే కల్పింపబడినది- సృజింపబడినది. కనుక, ఆకాశమును వ్యాపించి, బ్రహ్మ ఉండుటచే, అధిష్ఠానమగు బ్రహ్మ, అంతకంటె సూక్ష్మమైనది. జీవుడు, తన చైతన్యప్రకాశముచే నఖశిఖపర్యంతము వ్యాపించి ఉపలబ్ధమగుటచే మహత్పరిమాణము గలవాడు. అయినను, ఉపాధియగు బుద్ధియొక్క ధర్మాధ్యాసచేత 'ఆరాగ్రపరిమాణము గలవాడు' అని శ్రుతి వర్ణించినది. ఈ ఆరాగ్రమాత్రశ్రుతికి పూర్వము 'బుద్ధే ర్గుణేన ఆత్మగుణేన చైవ' అని కలదు. అనగా, జీవాత్మకు వర్ణించిన ఆరాగ్రపరిమాణగుణము 'బుద్ధే ర్గుణేన' అని బుద్ధియొక్క గుణమేనని, స్పష్టముగా శ్రుతి, వివరించినది. 'అవరోఽపి' 'న విద్యతే వరః యస్మాత్' అను వ్యుత్పత్తిచే అపరిచ్ఛిన్నుడు అని అర్థము. 'స ఏషః అణుః' అను అణుశ్రుతి, బ్రహ్మవస్తువు సూక్ష్మము, అనగా దుర్జ్ఞేయము అను అభిప్రాయముతో ప్రవృత్తమైనది. తక్కిన శ్లోకభాగము స్పష్టార్థము. ॥౫॥

'దశశ్లోకి' యందలి పంచమ శ్లోకమునకు
భావదీపికాఖ్య
ఆంధ్ర వివరణము సమాప్తము.

## శ్లో. ౬ న శుక్లం న కృష్ణం న రక్తం న పీతమ్

### సిద్ధాన్తబిన్దుః

నను, బ్రహ్మణః జగదుపాదానత్వాత్ ఉపాదాన ఉపాదేయ యోశ్చ అభేదాత్ విచిత్ర జగదభిన్నత్వేన బ్రహ్మణః దుఃఖ రూపత్వాత్ న తదభిన్నత్వేన జీవస్య పరమపురుషార్థప్రాప్తిః ఇత్యాశఙ్క్య బ్రహ్మణః స్వప్రకాశ పరమానందరూపత్వాత్ నిఖిల జగద్భ్రమాధిష్ఠానత్వేన కారణత్వవ్యపదేశాత్ అధ్యస్తేన చ సమం సంబంధాభావాత్ న తత్ర అనర్థలేశోఽప్యస్తి ఇత్యాహ న శుక్లమితి।

### భావదీపిక

ఓయీ! బ్రహ్మ, జగత్తునకు ఉపాదానకారణము కదా! ఉపాదానకారణమగు బ్రహ్మకు, ఉపాదేయమగు జగత్తునకు మృద్ఘటములకు వలె అభేదము. కనుక, సుఖ, దుఃఖ, మోహము లతో విచిత్రమైన జగత్తుకంటె అభిన్నుడు గనుక, బ్రహ్మ, దుఃఖ రూపుడు, అతి దుఃఖము గలవాడు. ఆ బ్రహ్మతో అభేదమును సంపాదించుటవలన, జీవునకు పరమ పురుషార్థప్రాప్తి లేదని ఆశంకించుకొని బ్రహ్మ, స్వప్రకాశ పరమానందరూపుడు. ఆయన యందు ఈ జగత్తు భాసించుచున్నది. కనుక, నిఖిల జగద్భ్రమకు అధిష్ఠాన మగుటచే జగత్కారణ మని వ్యవహరింపబడినాడు. అధ్యస్తమైన జగత్తుతో అధిష్ఠాన మగు బ్రహ్మకు వాస్తవముగా ఎట్టి సంబంధము లేదు. కనుక, బ్రహ్మభేదముచే జీవునకు అనర్థము, లేశము కూడ, లేదని ఈ 'న శుక్లమ్' అను శ్లోకముచేత బోధించుచున్నారు.

శ్లో॥ న శుక్లం న కృష్ణం న రక్తం న పీతం
న కుబ్జం న పీనం న హ్రస్వం న దీర్ఘమ్।
అరూపం తథా జ్యోతిరాకారకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ ౬

## సిద్ధాన్తబిన్దుః

కుబ్జం అణు, పీనం మహత్। తేన అణు మహత్ హ్రస్వం దీర్ఘమితి చతుర్విధ పరిమాణనిషేధాత్ ద్రవ్యత్వ ప్రతిషేధః। రూప్యత ఇతి రూపమ్, ప్రమేయమ్। న ప్రమేయం అరూపమ్। తేన సర్వేషామేవ ద్రవ్య, గుణ, కర్మాది పదార్థానాం తత్ తత్ వాద్యభ్యుపగతానాం నిషేధః। తథా చ శ్రుతయః 'అస్థూలం అనణు అహ్రస్వం అదీర్ఘం అలోహితమ్' ఇత్యాద్యాః। 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథా అరసం నిత్యం అగన్ధవచ్చ యత్' ఇత్యాద్యాశ్చ సర్వానర్థశూన్యం పరమాత్మస్వరూపం ప్రతిపాదయన్తి। శ్రౌతస్యాపి అర్థస్య న్యాయేన నిర్ణయాయ హేతుమాహ। జ్యోతిరాకారకత్వాదితి। స్వప్రకాశ జ్ఞానరూపత్వేన అప్రమేయత్వాత్। ప్రమేయత్వే ఘటాదివత్ జడత్వాపత్తేః। ఏతత్ అప్రమేయం ధ్రువం ఇత్యాది శ్రుతేః ఇత్యర్థః।

## భావదీపిక

కుబ్జం అనగా, అణుపరిమాణము. పీనం– మహత్పరిమాణము. అందుచేత 'అణు, మహత్, హ్రస్వం, దీర్ఘం' అను చతుర్విధ పరిమాణములను నిషేధించుటవలన, ద్రవ్యత్వమును నిషేధించి నట్లైనది. ఆత్మయందు ద్రవ్యత్వము లేదు. అరూపమ్– ఇచట

'రూప' శబ్దమునకు ప్రమేయము అని అర్థము. శుక్లాది రూపములు ఇదివఱకే నిషేధింపబడినవి. ప్రమేయము అనగా, చిద్భాస్యము, జడము. అరూపమ్ అనగా, జడము కానిది. దీనిచేత ఆ యా వాదులు అంగీకరించు ద్రవ్య, గుణ, కర్మలు మొదలగు పదార్థములను నిషేధించినట్లైనది. నిషేధ మనగా, 'నఞ్' అర్థము భేదము, అత్యంతాభావము- రెండును అయిఉన్నవి. అస్థూలమ్- అస్థూలము మొదలగుచోట్ల, స్థూలాదిభేదము, స్థూలాత్యంతాభావము కూడ గ్రహింపబడుచున్నవి. అశబ్దం- శబ్దము లేనిది, అస్పర్శం స్పర్శ లేనిది. అరూపమ్ రూపము లేనిది. అరసమ్- రసము లేనిది. అగంధవచ్చ- గంధముగల పృథివికంటె భిన్నమైనది బ్రహ్మ'- ఈ మొదలగు శ్రుతులు సమస్తమైన అనర్థములు లేని పరమాత్మ స్వరూపమును ప్రతిపాదించుచున్నవి. ద్రవ్యాది ప్రపంచమే అనర్థమని భావము. శ్రుతియందు చెప్పబడిన అర్థమును యుక్తి చేత (న్యాయముచేత) నిర్ణయించుటకొఱకు హేతువును 'జ్యోతి రాకారకత్వాత్' అని చెప్పుచున్నారు. బ్రహ్మవస్తువు, స్వప్రకాశ జ్ఞానరూప మగుటచే, ప్రమేయము (చిద్భాస్యము) కాదు. ప్రమేయమే అగుచో, ఘటాదులవలె బ్రహ్మ, జడము కావలసి వచ్చును. 'ఏతదప్రమేయం ధ్రువమ్' మొదలగు శ్రుతులవలన అని అర్థము. ॥౬॥

''దశశ్లోకి' యందలి షష్ఠ శ్లోకమునకు

భావదీపికాఖ్య

ఆంధ్ర వివరణము సమాప్తము.

## శ్లో. ౭ నశాస్తా నశాస్త్రం నశిష్యో నశిక్షా....

### సి ద్ధా న్త బి న్దుః

నను, కస్య బ్రహ్మభావః ఉపదిశ్యతే బ్రహ్మణః అబ్రహ్మణో వా? నాన్త్యః, తస్య జడత్వాత్ అసత్త్వాచ్చ। న ప్రథమః,ఉపదేశానర్థక్యాత్। బ్రహ్మభావస్య స్వత ఏవ సిద్ధత్వాత్ జీవస్య స్వతః బ్రహ్మభావేఽపి అవిద్యావ్యవధానం జ్ఞానేన నివర్త్యతే ఇతిచేన్న। అవిద్యానివృత్తేః ఆత్మభిన్నత్వే ద్వైతాపత్తేః బ్రహ్మణః అసిద్ధి ప్రసఙ్గాత్। తదుక్తం వార్తికే-

శ్లో॥ అవ్యావృత్తాననుగతం వస్తు బ్రహ్మేతి భణ్యతే।
బ్రహ్మార్థో దుర్లభోఽత్ర స్యాత్ ద్వితీయే సతి వస్తుని॥ ఇతి।

అభిన్నత్వే చ ఉపదేశానర్థక్యమ్ ఇత్యుక్తమ్। అత్ర కిం పరమార్థతః ఫలాభావం అభిప్రైషి, కిం వా ప్రతీతోఽపి? తత్ర ఆద్యం ఇష్టాపత్త్యా పరిహరతి 'న శాస్తా' ఇతి।

### భా వ దీ పి క

ఓయీ! 'తత్త్వమసి' వాక్యముచే బ్రహ్మభావము ఎవనికి ఉపదేశింపబడుచున్నది? బ్రహ్మకా? లేక, అబ్రహ్మకా? అబ్రహ్మకు అను రెండవ పక్షము సరి కాదు. బ్రహ్మ కానిది జడము, లేనిది కదా! మొదటి పక్షము సరి కాదు. బ్రహ్మకు బ్రహ్మోపదేశ మెందులకు? బ్రహ్మభావము, ఉపదేశము లేకుండగనే, సిద్ధించినది కదా! అట్లు కాదు. జీవుడు, వాస్తవముగా (ఉపదేశము లేకుండ గానే) బ్రహ్మస్వరూపుడు అయినను,అవిద్య, స్వరూపజ్ఞానమునకు

వ్యవధానమును కలిగించుచున్నది. జ్ఞానముచేత ఆ అవిద్య అనెడు వ్యవధానము నివర్తింపజేయబడుచున్నది అనినచో, అదియు సరి కాదు. జ్ఞానముచే అవిద్యానివృత్తి, ఆత్మభిన్నమై, సత్యమైనచో, బ్రహ్మకంటె రెండవ వస్తువు సత్యమైనది అంగీకరించుట వలన, ద్వైతము ఆపాదించును. బ్రహ్మ, వస్తుపరిచ్ఛేదముచే బ్రహ్మయే కాకపోవును. 'అనన్తం బ్రహ్మ' దేశ, కాల, వస్తు పరిచ్ఛేదరహితము బ్రహ్మ అని చెప్పబడుచున్నది కదా। వార్తికమునందు, బ్రహ్మవస్తువు ఇట్లు చెప్పబడినది. ధర్మ ధర్మి భావరహితమైన, అఖండమైన వస్తువు బ్రహ్మ అని చెప్పబడుచున్నది. సత్యమగు రెండవ వస్తువు ఉన్నప్పుడు, 'బ్రహ్మ' శబ్దార్థమే, దుర్లభము అగును.'

ఇపుడు, సమాధానము చెప్పుచున్నారు. అబ్రహ్మకు బ్రహ్మోపదేశము అను పక్షము అంగీకార్యము కాదు. బ్రహ్మ స్వరూపుడైన జీవునకే, బ్రహ్మోపదేశము అను మొదటి పక్షమే స్వీకరింపబడుచున్నది. ఇచట, బ్రహ్మకు బ్రహ్మోపదేశము వ్యర్థము అని ఆశంకింపబడినది. కాని, బ్రహ్మోపదేశమునకు ఫలము పారమార్థికముగా లేదని అభిప్రాయమా? లేక, ప్రతీతి సిద్ధముగా ఫలము లేదని అభిప్రాయమా? మొదటి పక్షమే అయినచో, బ్రహ్మవస్తువు ఒక్కటే గనుక, పారమార్థికముగా ఉపదేశమునకు ఫలము లేకపోవుట మాకు ఇష్టమైనదానినే, ఆపాదించినట్లైనది అని, 'న శాస్త్రా' అను శ్లోకము చేత పరిహరించుచున్నారు.

శ్లో॥ న శాస్తా న శాస్త్రం న శిష్యో న శిక్షా
న చ త్వం న చాహం న చాయం ప్రపఞ్చః।
స్వరూపావబోధో వికల్పాసహిష్ణుః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ ౭

## సి ద్ధా న్త బి న్దుః

శాస్తా ఉపదేశకర్తా గురుః। శాస్త్రం ఉపదేశకరణమ్। శిష్యః ఉపదేశకర్మ। శిక్షా ఉపదేశక్రియా। త్వం శ్రోతా। అహం వక్తా। అయం సర్వప్రమాణసన్నిధాపితః ప్రపఞ్చః దేహేన్ద్రియాదిః అర్థః పరమార్థతో నాస్తి ఇత్యర్థః। ద్వితీయం నిరాకరోతి 'స్వరూపావబోధః వికల్పాఽసహిష్ణుః' ఇతి। అయమర్థః। యద్యపి అవిద్యానివృత్తిః ఆత్మా అనాత్మా వా ఇతి వికల్పనే కిమపి ఫలం నిరూపయితుం న శక్యతే। తథాఽపి స్వరూపావబోధః విజ్ఞానఫలం అనుభూయతే। న చ ఏతత్ కథమితి వికల్పనీయమ్। సర్వ ద్వైతోమపర్దేన వికల్పాసహిష్ణుత్వాత్। నహి దృష్టే రనుపపన్నం నామ। తథా చ శ్రుతిః— 'న నిరోధో న చోత్పత్తిః న బద్ధో న చ సాధకః। న ముముక్షుః న వై ముక్తః ఇత్యేషా పరమార్థతా॥' 'బ్రహ్మైవ ఇద మగ్ర ఆసీత్, తదాత్మానమేవావేత్, అహం బ్రహ్మాస్మీతి', 'తస్మాత్ తత్సర్వ మభవత్' ఇత్యాద్యాః। పూర్వమపి బ్రహ్మస్వరూపస్యైవ సతః జీవస్య జ్ఞానాత్ బ్రహ్మ భావం దర్శయతి। సర్వం చ ద్వైతం వారయతి ॥౭॥

## భా వ దీ పి క

శాస్తా న=ఉపదేశముచేయు గురువు లేడు. శాస్త్రం న=ఉపదేశ

సాధనమగు వేదాంత మహావాక్యము శాస్త్రము లేదు. శిష్యః న= ఉపదేశము చేయబడువాడులేడు, శిక్షా=ఉపదేశించుట అను క్రియ, త్వం=వినునట్టి నీవు, అహం=చెప్పునట్టి నేను, అయం ప్రపంచః =ప్రత్యక్షాది నిఖిల ప్రమాణములచే గోచరమగు దేహేంద్రియాది సమస్త ప్రపంచము, వ్యవహారకాలములోనివి, పరమార్థముగా లేవు. పరమార్థము బ్రహ్మవస్తువు, అద్వితీయము, ఒక్కటే అయి ఉన్నది. గురు, శిష్య, శాస్త్ర ఉపదేశాదులు వ్యవహారకాలము లోనివి. స్వరూపసాక్షాత్కారము కలిగించును. వికల్పములకు తావు లేదు. అనగా, స్వరూపావబోధము ప్రకాశమాన పూర్ణానంద రూపము. అవిద్యానివృత్తి, మహావాక్యజన్య చరమ వృత్తి ఫలముగా ప్రతీతమగుచున్నది. అవిద్యానివృత్తి, ఆత్మరూపమా? అనాత్మరూపమా? అను వికల్పము వలన, ఎట్టి ఫలము నిరూపించుటకును శక్యము కాదు. కొందఱు ఆత్మరూప మనియే అందురు. అజ్ఞాననివృత్తి, పూర్ణానందము, ప్రకాశమైనపుడు జీవన్ముక్తునిచే కల్పితము. కనుక, అజ్ఞాననివృత్తికి ఫలత్వము జీవన్ముక్తునికి ప్రతీతిగోచర మగుచున్నది. అవిద్యయే లేనప్పుడు, అవిద్యా నివృత్తి, ఫల మెట్లగునను ప్రశ్నకు కూడ, తావు లేదు. శాస్త్రముచే- మహావాక్యముచే అఖండ స్వరూపబోధ అనుభవగోచర మైనపుడు, ద్వైత ప్రపంచము భాసించదు. అదివఱకు భాసించినది ఎట్లు ఈ ద్వైతము నివృత్త మగునను వికల్పము నిలబడనేరదు. "న హి దృష్టేః అనుపపన్నం నామ" యుక్తివాదము అనుభవ బాధితము. అనుభవముచేత యుక్తివాదము బాధింపబడును. అనుభవసిద్ధార్థమున, యుక్తి విరోధము శంకించరాదు. శ్రుతి, ఈ విషయమునే చెప్పుచున్నది. నిరోధః = నాశము (ప్రళయము)

న=లేదు, ఉత్పత్తిః=పుట్టుక (ప్రపంచమునకు) లేదు. బుద్ధః= తత్త్వజ్ఞాని, న=లేడు. సాధకః=శ్రవణాదులు చేయువాడు లేడు. ముముక్షుః న=తాను మోక్షమును పొందవలెనను కోరిక గలవాడు లేడు. ముక్తః న=అజ్ఞాననివృత్తి కలవాడు లేడు. ఇదియే, పరమార్థము. అనగా సృష్టి, ప్రళయ, బంధ, మోక్షాది వ్యవహారము అవిద్యాదశలోనిది. శుద్ధ చిద్రూపమగు బ్రహ్మ వస్తువు ఒక్కటే పరమార్థము. 'బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీత్' సృష్టికి పూర్వము బ్రహ్మయే ఉండెను. ఆ బ్రహ్మ 'అహం బ్రహ్మాస్మి' అని తనను తెలిసికొనెను. ఆ బ్రహ్మభావము వలన, సర్వాత్మభావమును పొందెను. మొదలగు శ్రుతులు బ్రహ్మకే బ్రహ్మభావము అను పక్షమును సమర్థించుచున్నవి. అనగా, జీవుడు, బ్రహ్మస్వరూపుడై ఉండగానే, జ్ఞానము వలన అజ్ఞానము విఘటితము కాగా, బ్రహ్మభావమును చూపుచున్నవి. సమస్త ద్వైతభావమును నివారించుచున్నవి. ॥౭॥

'దశశ్లోకి' యందలి సప్తమ శ్లోకమునకు
భావదీపికాఖ్య
ఆంధ్రవివరణము సమాప్తము.

---

# శ్లో. ౮ న జాగ్రన్న మే స్వప్నకో వా సుషుప్తిః ....

## సిద్ధాన్తబిన్దుః

నను, ఆత్మనః స్వప్రకాశ చైతన్యరూపత్వే సర్వదా భాసమానత్వేన జాగ్రత్స్వప్నసుషుప్త్యాది వ్యవస్థా కథమ్ । న చ భ్రాంత్యైవ వ్యవస్థా ఇతి వాచ్యమ్ । తథా సతి సర్వస్యైవ స్వప్నత్వాపత్తిః ఇతి చేన్న । లక్షణతః త్రయాణామపి స్వప్నత్వేఽపి ప్రతిభాసతః అవిద్యాకృత విశేషసంభవాత్ సదసద్విలక్షణత్వేన చ సవిశేషత్వాత్ వ్యవస్థోపపత్తేః । పరమార్థతస్తు న కాఽపి వ్యవస్థా ఇత్యాహ, 'న జాగ్రత్' ఇతి ।

## భావదీపిక

ఓయీ ! ఆత్మ, స్వప్రకాశచైతన్యము అయినపుడు, ఎల్లప్పుడు ప్రకాశించుచుండును గనుక, జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అను వ్యవహారవ్యవస్థ ఎట్లు కుదురును ? భ్రాంతిచేతనే వ్యవస్థ అని చెప్పరాదు. అట్లయినచో, అన్ని అవస్థలు, స్వప్నావస్థక్రిందకే వచ్చును అనినచో, అట్లు కాదు. ఉన్న వస్తువు, మఱియొక రీతిగా భాసించుట అను లక్షణముచే మూడు అవస్థలును, స్వప్నము క్రిందకే వచ్చును. మూడు అవస్థలును, మాయామాత్రములే అని భావము. అయినను, ఇంద్రియములతో విషయములు భాసించుట, ఇంద్రియాపేక్ష లేకనే, విషయావభాసము అను అవిద్యామూలకమైన విశేషము సంభవించుట వలన, జాగ్రత్తు అనియు, స్వప్నము అనియు వేఱు వేఱు వ్యవహారము. ఈ మూడు అవస్థలును, సదసద్విలక్షణములు. సత్ అని గాని,

అసత్ అని గాని, చెప్పుటకు వీలుకానివి. కనుక, సవిశేషములు. సూక్ష్మ అవాంతరభేదముచే ఇది జాగ్రత్తు అనియు, ఇది స్వప్న మనియు, ఇది సుషుప్తి అనియు వ్యవస్థ ఉపపన్నమే అగు చున్నది. అవిద్యావినిర్ముక్త పరమార్థ దశయందు ఈ జాగ్రదాది వ్యవస్థ ఏమియు లేదు. జీవభావమునందే అవస్థాత్రయాభిమానము కాని, బ్రహ్మస్వరూపమునందు అవస్థాత్రయము లేదని భావము.

శ్లో॥ న జాగ్రన్న మే స్వప్నకో వా సుషుప్తిః
న విశ్వో న వా తైజసః ప్రాజ్ఞకో వా।
అవిద్యాత్మకత్వాత్ త్రయాణాం తురీయః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ ౮

## సిద్ధాన్తబిన్దుః

అత్ర లయక్రమేణ పౌర్వాపర్యవ్యపదేశః। తథా హి। అస్మిన్ మతే పదార్థో ద్వివిధః। దృక్ దృశ్యం చ। అన్యేషాం వాదిపరికల్పితానాం పదార్థానాం అత్రైవ అన్తర్భావాత్। తత్ర దృక్పదార్థః ఆత్మా పారమార్థికః ఏకః। సర్వథా ఏకరూపోఽపి ఔపాధికభేదేన త్రివిధః। ఈశ్వరః, జీవః, సాక్షీ చ ఇతి। తత్ర కారణీభూత అజ్ఞానోపాధిః ఈశ్వరః। అన్తఃకరణ తత్సంస్కారావచ్ఛిన్న అజ్ఞానోపహితః జీవః। ప్రపఞ్చితంచ ఏతత్ అధస్తాత్। అవిద్యాప్రతిబింబ ఈశ్వరపక్షే బింబచైతన్యం సాక్షీ। బింబేశ్వర పక్షే తు బింబప్రతిబింబ ముఖానుగత ముఖస్వరూపవత్ జీవేశ్వరానుగత సర్వానుసంధాతృ చైతన్యం సాక్షీ ఇత్యుచ్యతే। వార్తికకారమతే తు ఈశ్వర ఏవ సాక్షీ ఇతి ద్వైవిధ్యమేవ జీవేశ్వర భేదేన దృశః।

తత్ర ఈశ్వరోఽపి త్రివిధః। సోపాధిభూత అవిద్యాగుణ త్రయభేదేన బ్రహ్మ విష్ణు రుద్ర భేదాత్। కారణీభూత సత్త్వ గుణావచ్ఛిన్నః విష్ణుః పాలయితా। కారణీభూత రజఉపహితః బ్రహ్మ స్రష్టా। హిరణ్యగర్భస్తు మహాభూతకారణత్వాభావాత్ న బ్రహ్మ। తథాఽపి స్థూలభూత స్రష్టృత్వాత్ క్వచిత్ బ్రహ్మేతి ఉపచర్యతే । కారణీభూత తమ ఉపహితః రుద్రః సంహర్తా । ఏవం చ ఏకస్యైవ చతుర్భుజ, చతుర్ముఖ, పంచముఖాద్యాః పుమాకారాః శ్రీ, భారతీ, భవాన్యాద్యాశ్చ స్త్ర్యాకారాః । అన్యే చ మత్స్య కూర్మాదయః అనన్తావతారాః లీలయైవ ఆవిర్భవన్తి భక్తానుగ్రహార్థ మిత్యవధేయమ్ ।

## భావదీపిక

నాకు జాగ్రదవస్థ లేదు. స్వప్నము లేదు. సుషుప్తి లేదు. నేను జాగ్రదభిమాని యగు విశ్వుడను గాను. స్వప్నాభిమాని యగు తైజసుడను గాను. సుషుప్తిదశాభిమాని యగు ప్రాజ్ఞుడను గాను. ఆ ముగ్గురును అవిద్యాదశలోనివారు. నేను అవస్థా త్రయాభిమానరహితుడను. అవిద్యావినిర్ముక్తుడను. అద్వితీయు డను. ప్రపంచము బాధింపబడినను, మిగిలి ఉండువాడను. పరమానంద బోధస్వరూపుడను. ఏ ధర్మములు లేనివాడను.

ఇచట, లయక్రమముతో జాగ్రదాది పౌర్వాపర్యము వ్యవ హరింపబడుచున్నది. అది ఉపపాదింపబడుచున్నది. ఈ మతమున, పదార్థము రెండు విధములు. దృక్ అనియు దృశ్యము అనియు వ్యవహరింపబడును, ఇతర వాదులు ఎన్ని పదార్థములను కల్పించి చెప్పినను, ఆ పదార్థము లన్నింటికి ఈ

దృక్ దృశ్యములందే అంతర్భావము. ముందు దృక్స్వరూపము చెప్పబడుచున్నది. దృక్ పదార్థము ఆత్మవస్తువై యున్నది. అది, పారమార్థికము, సత్యము, ఏకము. ఎల్లప్పుడు, ఏకరూపముగా ప్రకాశించునది. అయినను, ఉపాధిభేదముచే ఆ ఆత్మ మూడు విధములు. ఈశ్వరుడు, జీవుడు, సాక్షి అని వ్యవహరింపబడును. ప్రపంచకారణమగు అజ్ఞానము (అవిద్య, మాయ) ఉపాధిగా గలవాడు ఈశ్వరుడు. అంతఃకరణ సంస్కారావచ్ఛిన్న మగు అజ్ఞానము ఉపాధిగా గలవాడు జీవుడు. ఈ విషయము ఇదివరకే వివరింపబడినది. కొందరు అవిద్యాప్రతిబింబము ఈశ్వరుడని అందురు. వారి పక్షమున, బింబచైతన్యము సాక్షి. మరికొందరు బింబభూతుడు ఈశ్వరుడు అని చెప్పుదురు. అపుడు, బింబమే, ఈశ్వరుడని అంగీకరించినందు వలన, బింబ, ప్రతిబింబముఖము లకు అనుగతమగు బింబత్వ, ప్రతిబింబత్వ వినిర్ముక్తమగు శుద్ధ ముఖస్వరూపము వలె ప్రతిబింబ జీవ, బింబభూత ఈశ్వర అనుగత బింబత్వ ప్రతిబింబత్వ వినిర్ముక్త సర్వానుసంధాయి చైతన్యము సాక్షి యని వ్యవహరింపబడును. వార్తికకారమతమున, ఈశ్వరుడే, సాక్షి గాన, దృక్కునకు (దృక్ పదార్థమునకు) జీవుడు, ఈశ్వరుడు కూడ, మూడు విధములు. తన ఉపాధియగు అవిద్యయందు సత్త్వరజస్తమోగుణ భేదము చేత విష్ణువు, బ్రహ్మ, రుద్రుడు అను భేదములు కలవాడగును. జగత్కారణభూత సత్త్వ గుణ విశిష్టుడు విష్ణువు, జగత్పాలకుడు రజోగుణావచ్ఛిన్నుడు, బ్రహ్మ,. సృష్టికర్త. హిరణ్యగర్భుడైనవో, మహాభూతములను సృజించినవాడు కాడు. కనుక, మూర్తిత్రయములోనివాడు కాడు. అయినను, పంచీకృత పంచమహాభూత మహాకార్య భౌతిక సృష్టి

చేయువాడు. కావున, హిరణ్యగర్భుని గూడ, కొన్ని చోట్ల, 'బ్రహ్మ'యని గౌణముగా వ్యవహరించుట గలదు. కారణీభూత అవిద్యోపాధి తమోగుణ ఉపాధితో గూడినవాడు రుద్రుడు. సంహారము చేయువాడు. తేలిన పర్యవసాన మేమనగా, ఒకే ఈశ్వరుడు చతుర్భుజ విష్ణు, చతుర్ముఖ బ్రహ్మ, పంచముఖ రుద్రాది పురుషాకారములు, లక్ష్మి, సరస్వతి, పార్వతి మొదలగు స్త్రీ ఆకారములు, మఱికొన్ని మత్స్య, కూర్మాది అనంత అవతారములు ఈశ్వరవిలాసముచే భక్తానుగ్రహార్థము ఆవిర్భవించుచున్నవని గ్రహించవలయును.

శ్లో॥ చిన్మయస్య అద్వితీయస్య నిష్కలస్య అశరీరిణః ।
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా ॥

బ్రహ్మ, రూపము లేనిది. చిన్మయము, అద్వితీయము, నిరవయవము. శరీరము లేనిది. నిరాకారము. అట్టి బ్రహ్మ వస్తువును గ్రహించుట బుద్ధికుశలతమీద ఆధారపడినందున, ముందు, ఉపాసన చేయుటకై ఉపాసకునకు బ్రహ్మసాక్షాత్కారార్థము రూపము, ఆకారము లేని బ్రహ్మకు శాస్త్రమునందు సాధకుల సౌకర్యము కొఱకై రూపము, ఆకారము కల్పింపబడినది. సాకార ఉపాసన ద్వారా చిత్తము ఏకాగ్రమై నిర్గుణ, నిరాకార, శుద్ధ బ్రహ్మను సాక్షాత్కరించుకొనుటకు యోగ్యమగును.

## సిద్ధాన్తబిన్దుః

జీవోఽపి త్రివిధః । స్వోపాధ్యవాన్తరభేదేన విశ్వ, తైజస, ప్రాజ్ఞభేదాత్ । తత్ర అవిద్యాన్తఃకరణ స్థూల శరీరావచ్ఛిన్నః జాగ్రదవస్థాభిమానీ విశ్వః । స ఏవస్థూల శరీరాభిమానరహితః

ఉపాధిద్వయోపహితః స్వప్నాభిమానీ తైజసః । శరీరాన్తఃకరణ ఉపాధిద్వయరహితః అన్తఃకరణసంస్కారావచ్ఛిన్న అవిద్యామాత్రోపహితః సుషుప్తాభిమానీ ప్రాజ్ఞః । ఏతేషాం చ స్వతన్త్రి ఉపాధిభేదాభావేన స్వతన్త్రిభేదాభావేఽపి అవాన్తర ఉపాధిభేదాత్ ఏకత్వేఽపి అవాన్తరభేదః వ్యవహ్రియతే । సాక్షీ తు సర్వానుసంధాతా సర్వానుగతః తురీయాఖ్యః ఏకవిధ ఏవ । తత్ర ఉపాధిభేదేనాపి న క్వచిద్భేదః । తదుపాధేః ఏకరూపత్వాత్ ।

అవిద్యా తద్వ్యాప్య తత్కార్యాత్మకః ప్రపఞ్చ దృశ్య పదార్థః । తస్య అపారమార్థికత్వేఽపి వ్యావహారిక సత్త్వాభ్యుపగమాత్, న స్వాప్నిక పదార్థవత్ నిరూపణం వ్యర్థమ్ । ఉపాసనాదౌ ఉపయోగాత్ ఇతి ।

### భావ దీపిక

జీవుడు కూడ, మూడు విధములు. జీవోపాధియొక్క అవాంతర భేదముల చేత విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అని మూడు విధములు. అందు, అవిద్య, అంతఃకరణము, స్థూల శరీరము - మూడింటియొక్క తాదాత్మ్యభావము కలిగి జాగ్రదవస్థ అభిమానము కలవాడు విశ్వుడు. ఆ జీవుడే, స్థూల శరీరాభిమానమును వీడినవాడై అవిద్య, అంతఃకరణ మను ఉపాధిద్వయముతో గూడినవాడై స్వప్నావస్థను అభిమానించువాడు. తైజసునకు స్థూల శరీరాభిమానము ఉండదు. శరీర, అంతఃకరణ ఉపాధిద్వయము నందు తాదాత్మ్యభావమును వీడి, అంతఃకరణసంస్కారములతో

గూడిన అవిద్య ఒక్కటే ఉపాధిగా గలవాడై, సుషుప్త్యవస్థను అభిమానించువాడు ప్రాజ్ఞుడు. వీరికి స్వతంత్ర ఉపాధిభేదములు లేనందున, అత్యంతము భిన్నమైనవారు కాకపోయినను, ఉపాధి త్రయమునందు, ఉపాధిద్వయమునందు, ఏకోపాధియందు మాత్రమే తాదాత్మ్యభావము ఉండుటచేత ఒకే జీవుడు, అవాంతర భేదములతో విశ్వ, తైజస, ప్రాజ్ఞులుగా వ్యవహరింపబడు చున్నాడు. సాక్షి అయితే, విశ్వ, తైజస, ప్రాజ్ఞుల సర్వవ్యవహార మును అనుసంధానము చేయువాడు. ముగ్గురిలోను, అనుస్యూత ముగా ఉన్నవాడు, నాలుగవవాడు (తురీయుడు) ఒకే విధము కలిగియున్నాడు. విశ్వ, తైజస, ప్రాజ్ఞులకు సాక్షి ఒక్కడే (సాక్షి భేదము లేదు). సాక్షిస్వరూపమునందు విశ్వాది ఉపాధిభేదము భేదహేతువు కాదు. సాక్షియొక్క ఉపాధి, ఏకరూపమై ఉండును.

ఇంతవరకు దృక్, దృశ్య పదార్థములలో దృక్స్వరూపము వివరింపబడినది. ఇపుడు, దృశ్యపదార్థము వివరింపబడుచున్నది. అవిద్యయు, అవిద్యకు లోబడి, తత్కార్యరూపమగు అవ్యాకృత, భూత, భౌతిక, పదార్థము దృశ్యపదార్థము. ఈ దృశ్యపదార్థము పారమార్థిక సత్యము కానప్పటికి, వ్యావహారిక సత్యముగా అంగీ కరింపబడుటవలన, వ్యావహారిక ప్రపంచము ప్రాతిభాసిక,స్వాప్నిక పదార్థమువంటిది కాదు. స్వాప్నిక పదార్థనిరూపణము వ్యర్థము. వ్యావహారికపదార్థ నిరూపణము ఉపాసనాదులందు ఉపయోగ పడుటచే దృశ్య పదార్థ నిరూపణము చేయబడుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

సోఽపి త్రివిధః। అవ్యాకృత మూర్త అమూర్త భేదాత్। తత్ర సాభాసా అవిద్యా మూర్తామూర్త ప్రపఞ్చ బీజశక్తిరూపా। తదజన్యత్వేఽపి తన్నివృత్తౌ నివర్తమానత్వేన తద్వ్యాప్త్యైః చైతన్య తత్సంబంధ జీవేశ్వరవిభాగ చిదాభాసైః సహ అనాదిత్వాత్ అవ్యాకృత మిత్యుచ్యతే। అయం చ అవ్యాకృతపదార్థః ఈశ్వరోపాధిః। సా చ స్వయం జడాఽపి అజడేన చిదాభాసేన ఉజ్జ్వలితా పూర్వపూర్వసంస్కార జీవకర్మ ప్రయుక్తా సతి శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకాని ఆకాశ వాయు తేజో జల పృథివ్యాఖ్యాని పఞ్చభూతాని జనయతి। తత్ర పూర్వ పూర్వ భూతభావాపన్నాయాః అవిద్యాయాః ఉత్తరోత్తరం ప్రతి కారణత్వాత్ పూర్వ పూర్వ భూతగుణానాం ఉత్తరోత్తర భూతేషు అనుప్రవేశః। ఏవం అవిద్యాత ఏవ అంధకారోఽపి భావరూప ఏవ ఆవరణాత్మా చాక్షుష జ్ఞానవిరోధీ ఆలోకనాశ్యశ్చ। ఝుటితి విద్యుదాదివత్ ఆవిర్భవతి తిరోభవతి చ ఇతి సిద్ధాన్తః। సంసారహేతు దేహాను పాదానాచ్చ। న శ్రుతిషు సృష్టిప్రక్రియాయా మామ్నాత ఇతి అవిరోధః। దిక్ కాలౌ అప్రామాణికత్వాత్ న ఉక్తౌ। ఆకాశస్యైవ దిగ్వ్యవహార హేతుత్వాత్। దిశ శ్రోత్ర మితి శ్రుతేశ్చ। కాలస్తు అవిద్యైవ। తస్యా ఏవ సర్వాధారత్వాదితి। అయం చ అవ్యాకృత పదార్థః ఈశ్వరోపాధిః।

## భావదీపిక

ఆ దృశ్యపదార్థము అవ్యాకృతము, మూర్తము, అమూర్తము అని మూడు విధములు. వానిలో చిదాభాసునితో

గూడిన అవిద్య, మూర్తామూర్త ప్రపంచమునకు బీజశక్తి రూపముగా ఉన్నది. బీజశక్తి అనగా, మూర్తామూర్త ప్రపంచమునకు ప్రయోజకమగు సూక్ష్మావస్థ. బీజమునందు వృక్షము వలె దీనియందు ప్రపంచము సంస్కారరూపముగా ఉండును. ఈ అవ్యాకృతము చైతన్య చిత్సంబంధ జీవ ఈశ్వర చిదాభాసులతో అనాది అని వ్యవహరింపబడును.

శ్లో॥ జీవ ఈశో విశుద్ధా చిత్ తథా జీవేశయోర్భిదా ।
అవిద్యా, తచ్చితోర్యోగః షడస్మాక మనాదయః ॥

అని అభియుక్త (ప్రామాణికుల) వచనము. అవిద్య, నివృత్తమగుచో, తక్కిన అనాది పదార్థములు గూడ, నివృత్తములగును గనుక, అవి అవిద్యాజన్యములు కాకపోయినను, అవిద్యావ్యాప్యములు. ఈ అవ్యాకృత పదార్థము ఈశ్వరోపాధి. ఆ ఈశ్వరోపాధి, స్వయముగా జడమైనను, చిత్ప్రతిబింబమగు చిదాభాసుడు, జడము కానందున, ఆ చిదాభాసునిచే ప్రకాశించినదై పూర్వపూర్వ సంస్కార జీవకర్మలచే ప్రేరితమగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ స్వరూపములగు ఆకాశ, వాయు, తేజో, జల, పృథివీ సంజ్ఞలు గల పంచ మహాభూతములను జనింపజేయుచున్నది. పూర్వపూర్వ భూతభావమును పొందిన అవిద్యయే, ఉత్తరోత్తర భూతగుణములందు సంక్రమించుచుండును. అనగా, ఆకాశము, శబ్దగుణము కలది కాగా, ఆకాశభావాపన్నయైన అవిద్య నుండి జనించు వాయువు, తన గుణమగు స్పర్శను, ఆకాశగుణమగు శబ్దమును-రెంటిని కలిగియుండును. అట్లే, తేజస్సు, తన గుణ మగు రూపమును, పూర్వభూతగుణములగు శబ్ద, స్పర్శలను

కలిగియుండును. జలమునకు శబ్ద, స్పర్శ, రూప, రసములు నాలుగు గుణములు, పృథివికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అయిదు గుణములు. ఈవిధముగా అవిద్యనుండియే, అంధకారము (చీకటి/తమస్సు)కూడ, భావపదార్థము, ఆవరణస్వభావము కలది, చాక్షుష జ్ఞానమునకు ప్రతిబంధకమైనది, ఆలోకము (వెలుతురు) చే నశించునది, శీఘ్రముగా మహావిద్యుత్తు వలె ఆవిర్భవించుచు, తిరోభావము పొందునది అని సిద్ధాంతము.

అయితే, సంసారహేతువగు శరీరమునకు తమస్సు, ఉపాదానకారణము కాకపోవుటవలన, శ్రుతు లందు సృష్టిప్రకరణమున, తమస్సు సృజింపబడినట్లు చెప్పబడలేదు. కనుక, విరోధము లేదు. దిక్కు, కాలము అను పదార్థములు ప్రామాణికములు కావు గనుక, చెప్పబడలేదు. ఆకాశమే, దిగ్వ్యవహారమునకు గూడ, కారణమని చెప్పవచ్చును. 'దిశ శ్శ్రోత్రమ్' ఆకాశమునుండి శ్రోత్రము అను శ్రుతి కూడ, కలదు. కాలము, అవిద్యయే అయి ఉన్నది. 'సర్వాధారః కాలః' అను న్యాయము అవిద్యయందు వర్తించుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

తాని చ సూక్ష్మాణి అపఞ్చీకృతాని పఞ్చమహాభూతాని అమూర్తాఖ్యాని కారణైక్యాత్ సత్త్వరజస్తమోగుణాత్మకాని । సత్త్వాంశప్రాధాన్యేన జ్ఞానక్రియాశక్త్యాత్మకం ఏకం స్వచ్ఛద్రవ్యం చిత్రరూపమివ మిలిత్వా జనయన్తి । తస్య చ జ్ఞానశక్తిప్రధానాంశః అన్తఃకరణమ్ । తచ్చ బుద్ధిః మనః ఇతి ద్విధా ఉచ్యతే । క్రియాశక్తి ప్రధానాంశః ప్రాణః । స చ పఞ్చధా

ప్రాణోఽపానః వ్యానోదాన స్సమానః ఇతి। ఏవం ఏకైక భూతేభ్యః జ్ఞానక్రియాశక్తిభేదాత్ ప్రత్యేకం ఇంద్రియద్వయం జాయతే। ఆకాశాత్ శ్రోత్ర వాచౌ, వాయోః త్వక్పాణీ, తేజసః చక్షుష్పాదౌ, అద్భ్యః రసన పాయూ, పృథివ్యాః ఘ్రాణోపస్థౌ। అత్ర, తేజోమయీ వాగితి శ్రుతేః తైజసీ వాక్, పాదస్తు నాభస ఇతి కేచిత్। శబ్దవ్యఞ్జక ఇంద్రియత్వేన శ్రోత్రవత్ వాచః నాభసత్వమ్, పాద చికిత్సయా చ చక్షుషః స్వాస్థ్యదర్శనాత్ తైజసత్వమితి యుక్తమ్ ఉత్పశ్యామః। తేజోమయత్వ శ్రుతిస్తు మనసః పఞ్చభూత కార్యస్యాపి అన్నమయస్య శ్రుతిరివ తదుపకార్యతయా వ్యాఖ్యేయా। మనసశ్చ పఞ్చభూత గుణగ్రాహకత్వేన తత్త్వ నిశ్చయాత్ పఞ్చభూతత్మకత్వమ్ ఇతి అన్యదేతత్।

## భావదీపిక

సూక్ష్మములగు ఆ అపంచీకృత పంచ మహాభూతములు అమూర్తము లనునట్టి పేరు గలవి. కారణ అవిద్యైకత్వము వలన, సత్త్వ, రజ, స్తమోగుణాత్మకములు. అందు, సత్త్వాంశ ప్రాధాన్య ముతో జ్ఞాన, క్రియాశక్తులు గల ఒక స్వచ్ఛ ద్రవ్యమును చిత్ర రూపమువలె, కలసి జనింపజేయును. ఆ స్వచ్ఛ ద్రవ్యమునకు జ్ఞానశక్తి ప్రధానాంశ అంతఃకరణము, అది, బుద్ధి, మనస్సు అని రెండు విధములుగా వ్యవహరింపబడును. క్రియాశక్తి ప్రధానాంశము ప్రాణము. అది, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన సమాన నామములతో వృత్తిభేదముచేత అయిదు విధములు.

ఈవిధముగా, ఈ అయిదు భూతములలో ఒక్కొక్క భూతము నుండి జ్ఞానశక్తి, క్రియాశక్తి అను భేదము వలన,

జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అను రెండు ఇంద్రియములు జనించును. ఆకాశము వలన, జ్ఞానశక్తిచే శ్రోత్రము, క్రియాశక్తిచే వాగింద్రియము. ఇట్లే, వాయువు వలన, జ్ఞానేంద్రయము త్వక్కు, కర్మేంద్రియము హస్తము. తేజస్సు వలన, జ్ఞానేంద్రియము చక్షుస్సు, కర్మేంద్రియము పాదము. జలము వలన, జ్ఞానేంద్రియము జిహ్వ, కర్మేంద్రియము పాయువు. పృథివి వలన జ్ఞానేంద్రియము, ఘ్రాణము, కర్మేంద్రియము ఉపస్థ జనించుచున్నవి. ఇచట, తేజోమయీ వాక్' అను శ్రుతివలన, తేజస్సు వలన వాక్కు, ఆకాశము వలన పాదము అని కొందఱు చెప్పుదురు. కాని, శబ్దవ్యంజకములైన ఇంద్రియములే శ్రోత్రము, వాక్కు అయినందున, వాక్కునకు ఆకాశజన్యత్వము చెప్పబడినది. పాదమునందు చికిత్స చేయుట వలన, కంటికి స్వాస్థ్యము చేకూరుటవలన, చక్షుస్సువలెనే పాదము కూడ, తేజస్సు వలన, జనించినదనుటయే యుక్తమని తలంచుచున్నాము. 'తేజోమయీ వాక్' అను శ్రుతి 'అన్నమయం హి సౌమ్య మనః' అను శ్రుతివలె ఉపకారకత్వమును చెప్పుచున్నది. అనగా, తేజోరూపమగు ఘృతాదులవలన, వాగ్వైశద్యము, అన్నము వలన, మనోవికాసము కలుగునని ఆ శ్రుతులను వ్యాఖ్యానించవలెను. మనస్సు, పంచభూతగుణములను గ్రహించుటవలన, పంచభూతాత్మకమనియే, నిశ్చయించవలెననునది, మఱొక విషయము వేఱైనది.

## సిద్ధాన్తబిన్దుః

ఏతేషాం అధిష్ఠాతారో దేవా అపి జ్ఞానక్రియాశక్తిప్రధానాః

'దిగగ్నీ వాతేంద్రౌ ఆదిత్య విష్ణూ వరుణమిత్రౌ అశ్విప్రజాపతీ' ఇతి। తత్ర జ్ఞానశక్తిసమష్టిః అన్తఃకరణమ్। క్రియాశక్తిసమష్టిః ప్రాణః। శబ్ద, స్పర్శ, రూప, రస, గంధగ్రాహకాణి శ్రోత్ర త్వక్ చక్షు రసన ఘ్రాణాఖ్యాని పఞ్చ జ్ఞానేంద్రియాణి। త్వక్చక్షుషీ స్వగ్రాహ్యగుణాశ్రయం ద్రవ్య మపి గృహ్ణీతః। శ్రోత్రమపి చక్షుర్వత్ గత్వా శబ్దగ్రాహకమ్। దూరే శబ్దః ఇతి ప్రత్యయాత్। వచన ఆదాన గతి విసర్గ ఆనందజనకాని వాక్ పాణి పాద పాయు ఉపస్థాఖ్యాని పఞ్చ కర్మేంద్రియాణి। ఏతచ్చ సర్వం మిలిత్వా సప్తదశకం లిఙ్గమ్। జ్ఞానశక్తిప్రాధాన్యేన హిరణ్యగర్భ ఇతి, క్రియాశక్తిప్రాధాన్యేన సూత్రమితి చ ఉచ్యతే। అయం అమూర్త పదార్థః। కార్యత్వాత్ వ్యష్టౌ సమష్టౌ చ జీవోపాధిరేవ। తాని చ తథాభూతాని భూతాని భోగాయతనం శరీరం భోగ్యం చ విషయ మన్తరేణ భోగం జనయితుం అశక్నువన్తి। జీవకర్మప్రయుక్తత్వాత్ స్థూలాయ పఞ్చీకృతాని భవన్తి।

## భావదీపిక

ఈ యింద్రియములకు అధిష్ఠాతలగు దేవతలు కలరు. జ్ఞానశక్తిప్రధానులు వారు, శ్రోత్రేంద్రియమునకు దిక్కు, దేవత వాగింద్రియమునకు అగ్ని, దేవత. త్వగింద్రియమునకు వాయువు, దేవత. హస్తమునకు ఇంద్రుడు దేవత. చక్షురింద్రియమునకు ఆదిత్యుడు, పాదమునకు విష్ణువు, రసనేంద్రియమునకు వరుణుడు. పాయువునకు మిత్రుడు, ఘ్రాణమునకు అశ్వినీదేవతలు, ఉపస్థ ఇంద్రియమునకు ప్రజాపతి, దేవతలు. వానిలో జ్ఞానశక్తి సమష్టి, అన్తఃకరణము. క్రియాశక్తి సమష్టి, ప్రాణము. శబ్ద, స్పర్శ,

రూప, రస, గంధములను గ్రహించునవి జ్ఞానేంద్రియములు. క్రమముగా శ్రోత్రము, త్వక్, చక్షుస్సు, రసన, ఘ్రాణము అను పేరు గలవి అయిదు. త్వగింద్రియము, చక్షురింద్రియము, స్పర్శ, రూపము అను గుణములనే గాక, ఆ గుణములకు ఆశ్రయమగు ద్రవ్యమును గూడ, గ్రహించును. శ్రోత్రేంద్రియము గూడ, చక్షురింద్రియము వలె, విషయదేశమునకు వెళ్ళి, శబ్దమును గ్రహించును, కర్ణశష్కులీదేశమున, శ్రోత్రేంద్రియము ఉండి, తన దగ్గరకు వచ్చిన శబ్దమునే, గ్రహించునను పక్షము యుక్తము కాదు. 'భేరీశబ్దః, దూరే శబ్దః మయా శ్రుతః' భేరీశబ్దము, దూర శబ్దము నా చేత గ్రహింపబడెను అను అనుభవము వలన, అది, యుక్తము కాదు. వాగింద్రియము, పాణి, పాదము, పాయువు, ఉపస్థ అను పేరు గలవి అయిదు కర్మేంద్రియములు. క్రమముగా మాట్లాడుట, పట్టుకొనుట, గమనము, విడచుట, ఆనందము అను కార్యములను జనింపజేయును. ఇది, అంతయు కలసి, పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచప్రాణములు, మనో, బుద్ధులు, పదునేడు కలసి, లిఙ్గశరీరమని పిలువబడును. ఆ లిఙ్గశరీరాభిమాని, జ్ఞానశక్తిప్రాధాన్యముచేత 'హిరణ్యగర్భుడు' అనియు, క్రియాశక్తిప్రాధాన్యముచేత 'సూత్రాత్మ' అనియు, వ్యవహరింపబడుదురు. ఇది, అమూర్తపదార్థము. కార్యమగుటచే వ్యష్టియందును, సమష్టియందును,జీవోపాధియే అయి ఉన్నది. అట్టి అపంచీకృత పంచ మహాభూతములు సుఖదుఃఖానుభవమునకు స్థానమగు శరీరమును, భోగ్యపదార్థము లేకుండా జీవులకు

భోగమును కలిగించుటకు సామర్థ్యము గలవి కావు, కనుక, జీవకర్మ ప్రేరితములై భోగానుగుణ స్థౌల్యము కొఱకు పంచీకృతములు అగుచున్నవి.

సిద్ధాన్తబిన్దుః

తత్ర చ ప్రత్యేకం పఞ్చభూతాని ద్విధా విభజ్యన్తే। తత్ర ఏకైకో భాగః చతుర్ధా విభజ్యతే। తద్భాగచతుష్టయం చ స్వభాగం విహాయ ఇతర భూతచతుష్టయార్ధభాగేషు ప్రవిశతి ఇతి స్వస్య అర్ధ భాగేన ఇతరేషాం అష్టమ భాగేన చ పఞ్చీకరణాత్ మేలనేఽపి ఆధిక్యాత్ ఆకాశాది శబ్దప్రయోగః। అత్ర చ 'త్రివృతం త్రివృతం ఏకైకాం కరవాణి' ఇతి శ్రుతేః, 'త్రివృత్ కుర్వత ఉపదేశాత్' ఇతి సూత్రాచ్చ త్రయాణామేవ మేలన ప్రతీతేశ్చ త్రివృత్కరణమేవ కేచిన్మన్యన్తే। తే వియదధికరణన్యాయేనైవ నిరాకృతాః। తథా హి – తైత్తిరీయకే 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశఃసంభూతః, ఆకాశాద్వాయుః' ఇత్యాది శ్రుతేః, ఛాందోగ్యే చ త్రయాణాం తేజోబన్నానాం సృష్టిశ్రవణేఽపి ద్వయో రుపసంహారః। తేజః ప్రాథమ్య పదార్థధర్మాపేక్షయా ఆకాశ వాయుపదార్థయోః బలీయస్త్వాత్। ఛాందోగ్యే చ 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞానాత్' ఆకాశవాయ్వోః అచేతనయోః బ్రహ్మకార్యత్వస్య అవశ్య వాచ్యత్వాత్। తత్ర పఞ్చానామేవ మేలనేఽపి అవయవత్త్వ అనువాదేన త్రివృత్కరణోపపత్తిః। త్రివృతమేవేతి మతకల్పనాయాం వాక్యభేదప్రసఙ్గః। 'త్రివృత్ కుర్వత ఉపదేశాత్' ఇతి సూత్రం తు అనువాదకత్వాత్ న పంఞ్చీకరణ న్యాయసిద్ధం బాధితుం ఉత్సహతే। మేలనప్రతీతిశ్చ శరీరాదౌ పఞ్చానాం

అవిశిష్టైవ। పఞ్చీకృత పఞ్చమహాభూతానీతి చ భాష్యకారవచనమ్। తస్మాత్ అలం అనేన అనాత్మచిన్తనేన ఇతి దిక్ ।

భా వ దీ పి క

పంచీకరణము చెప్పబడుచున్నది. పంచభూతములు ఒక్కొకక్కటి రెండుగా విభాగములు అగును. అందులో ఒక్కొకక్క భాగము నాలుగు భాగములుగా విభజింపబడును. ఈ నాలుగు భాగములులో తన భాగమును (తన భాగమగు అర్ధమును) వదలి పెట్టి, ఇతర భూతచతుష్టయముయొక్క అర్ధభాగములలో ప్రవేశించును. అపుడు ఒక భూతము యొక్క అర్ధభాగము, ఇతర భూతముల నాల్గింటియొక్క ఎనిమిదవ భాగములు నాలుగు కలసి పంచీకృతభూత మగును. ఈ పంచీకృతభూతములలో ఇతర భూతాంశములు ఉన్నను, ఏ భూతముయొక్క అర్ధభాగము ఇతర భూతములయొక్క ఎనిమిదవ భాగము కంటె అధికమైనందున, ఆ భూతనామముతో, వ్యవహారము చేయబడును. ఎట్లనగా, పంచీకృతాకాశ మనగా, ఆకాశముయొక్క సగభాగము, వాయు, తేజో, జల, పృథివీ భూతములయొక్క ఎనిమిదవ భాగములు నాలుగు కలసి, ఒక అర్ధమై (సగమై), రెండు అర్ధభాగములు పంచీకృత ఆకాశ మగుచున్నది. ఇట్లే, వాయ్వాది పంచీకృతభూతములను గ్రహింపనగును.

ఇచట, ఒక విషయము విచారింపబడుచున్నది. 'త్రివృతం త్రివృతం ఏకాం కరవాణి' అను శ్రుతియు, 'త్రివృత్ కుర్వత ఉపదేశాత్' అను బ్రహ్మసూత్రము తేజస్సు, జలము, పృథివి అను మూడు భూతములకే మేలనమును వర్ణించుటచేత త్రివృ

త్కరణము (భూతత్రయమేళనము) శాస్త్రీయమని కొందఱు అభిప్రాయపడుచున్నారు. వారు వియదధికరణ న్యాయముచేతనే నిరాకరింపబడుచున్నారు.

ఛాందోగ్యమునందు 'తత్తేజ అసృజత' మొదలగు వాక్యములచే తేజోఽబన్న (తేజో,జల, పృథివీ) భూతత్రయసృష్టి చెప్పబడినది. దాని ననుసరించి, ఆ భూతములలో ఒక భూతము సగము, ఇతర భూతములయొక్క చతుర్థాంశములు రెండు త్రివృత్కృత తేజోఽబన్నభూతములు.ఇదియే, త్రివృత్కరణము అని గ్రహించవలయును.

కాని, తైత్తిరీయ శ్రుతియందు 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః' అను రీతిగా ఆకాశ, వాయువుల రీతిగా సృష్టి అధికముగా చెప్పబడినది. వియదధికరణములో ఈ రెండు శ్రుతులకు విరోధపరిహారము చేయుచు, ఛాందోగ్యసృష్టికి, తైత్తిరీయ శ్రుతి ననుసరించి, 'ఆకాశవాయూ సృష్ట్వా తత్తేజోఽసృజత' అని వ్యాఖ్యానము చేసినారు. ఛాందోగ్యములో తేజస్సు, ప్రథమముగాను, తైత్తిరీయములో ఆకాశము ప్రథమముగాను, తేజస్సు, తృతీయము గాను వర్ణించుటలో విరోధపరిహారము ఎట్లు? అని ఆశంకించి, ఛాందోగ్యములోని తేజస్సుయొక్క ప్రాథమ్యము పదార్థధర్మము, తైత్తిరీయములోని ఆకాశ, వాయువులు, పదార్థములు అగుటచే తైత్తిరీయ శ్రుతిని అనుసరించి, సమన్వయము చేయబడినది.

పూర్వమీమాంసలో 'వేదం కృత్వా వేదిం కరోతి' అను శ్రుతియందు వేదకరణమునకు పూర్వాపరభావము అను క్రమము

బోధింపబడినను,మధ్యలో తుమ్ము వచ్చినపుడు, 'క్షుతే ఆచామేత్' ఆచమనము చేయవలెనను స్మృతి, ఆచమన మను పదార్థమును బోధించును గనుక, శ్రుతిబోధిత నిర్ణయము బాధింపబడునని నిర్ణయింపబడినది.

ఇదిగాక, ఛాందోగ్యమునందే 'ఏకస్మిన్ విజ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి' అను ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానప్రతిజ్ఞ చేయబడినది. తేజోబన్నములు మాత్రమే, బ్రహ్మనుండి సృజింపబడినవని అంగీకరించినచో, ఆకాశ, వాయువులు అచేతనములగుటచే అవి గూడ, బ్రహ్మకార్యము లయినందున, సద్రూపబ్రహ్మవిజ్ఞానముచే తేజోబన్నవిజ్ఞానమే కలుగును గాని, ఆకాశ, వాయువిజ్ఞానము కలుగజాలదు. కనుక, సర్వవిజ్ఞానప్రతిజ్ఞ నెరవేరదు. కావున, పంచభూత మేళనముచే పంచీకరణము న్యాయమై ఉన్నది. త్రివృత్కరణ శ్రుతి 'త్రివృత్కుర్వత' అను బ్రహ్మసూత్రమును పంచీకరణములో మూడు భూతముల యొక్క మేళనము గూడ, ఉన్నది గనుక, అయిదింటిలో మూడు భూతములను విడదీసి అనువాదము చేయుటచేత త్రివృత్కరణమునకు ఉపపత్తి చెప్పికొననగును. 'త్రివృతం త్రివృతమ్' అను శ్రుతిలో, 'అబ్భక్షః, వాయుభక్షః' ఇత్యాదులందు జలమునే భక్షించువాడు, వాయువునే భక్షించువాడు అను అవధారణార్థమునే చేసినటుల, త్రివృత్ శ్రుతిలో 'త్రివృతమేవ' అను అవధారణార్థము చేయరాదు. అప్పుడు ఆకాశ, వాయువులు లేవని చెప్పినట్లగును. అనువాదక శ్రుతి, న్యాయసిద్ధమగు పంచీకరణమును బాధింపనేరదు.

ఇదిగాక, భౌతికమగు శరీరములో తేజోఽబన్నముల వలె ఆకాశ, వాయువులు గూడ, చేరిఉండుట చూచుచున్నాము. భాష్యకారులు పంచీకృత పంచమహాభూతములను, పంచీకరణ గ్రంథమున, చెప్పియున్నారు. కనుక, ఇక, ఈ అనాత్మ చింతనము చాలునని పర్యవసితార్థము.

సిద్ధాన్తబిన్దుః

తాని చ పఞ్చీకృతాని పఞ్చమహాభూతాని మూర్తాఖ్యాని మిలిత్వా ఏకం కార్యం ఇంద్రియాణా మధిష్ఠానం భోగాయతనం ఉత్పాదయన్తి। తదేవ శరీర మిత్యుచ్యతే। తత్ర సత్త్వప్రధానం దేవశరీరమ్। రజఃప్రధానం మనుష్య శరీరమ్। తమఃప్రధానం తిర్యగాది స్థావరాన్తం శరీరమ్। తస్య చ శరీరస్య పాఞ్చభౌతికస్యాపి చిత్రరూపస్యైవ।క్వచిత్ న్యూనాధికభావః భూతానాం న విరుధ్యతే। ఏవం విషయా అపి పఞ్చీకృత ఏకైక భూతజన్యాః చతుర్దశ భువనాఖ్యాః ఊర్ధ్వ మధ్య అధోభావేన సత్త్వ రజ స్తమోఽంశప్రధానాః। ఏతత్సర్వం బ్రహ్మాండాఖ్యం విరాడితి మూర్త మితి చ ఉచ్యతే। అయం ఔపనిషదః సృష్టిక్రమః। తద్విపరీతః లయక్రమః।

మూర్తం పఞ్చీకృత పఞ్చమహాభూత తత్కార్యాత్మకం విరాడాఖ్యం పృథివ్యాది ఏకైక భూతలయేన అమూర్తే అపఞ్చీకృత పఞ్చమహాభూతాత్మకే హిరణ్యగర్భాఖ్యే స్వకారణే లీయతే। స ఏవ దైనందిన ప్రలయః।

అమూర్తం చ అవ్యాకృతే పరమేశ్వరోపాధౌ। అవ్యాకృతస్య

తు అనాదిత్వేన కారణాభావాత్ న లయః। స్వకారణే సూక్ష్మ రూపేణ అవస్థానం తల్లక్షణాత్।

అయమేవ ప్రాకృత ప్రలయః। బ్రహ్మజ్ఞానాత్ ఆత్యన్తిక ఉచ్ఛేదస్తు ఆత్యన్తికః ప్రలయః। స చ కారణక్రమేణైవ కారణోచ్ఛేదాదేవ కార్యోచ్ఛేదాత్। సర్వం చ సృష్టిప్రలయాదికం స్వప్న సృష్టి ప్రలయవత్ అపారమార్థికమపి వాసనాదార్ఢ్యాత్ వ్యవహారక్షమమితి న మాయికత్వేఽపి తుచ్ఛత్వ ప్రసఙ్గః। యథా చైతత్ తథా వ్యక్తమాకరే।

### భావదీపిక

ఆ పంచీకృత పంచ మహాభూతములు మూర్తసంజ్ఞ గలవి కలసి ఇంద్రియములకు అధిష్ఠానమగు సుఖ దుఃఖములకు స్థానమైన ఒక కార్యమును పుట్టించుచున్నవి. అదియే, శరీరమని చెప్పబడును. ఆ శరీరములలో సత్త్వగుణప్రధానమైనది దేవ శరీరము. రజోగుణప్రధానము మనుష్య శరీరము. తమోగుణ ప్రధానము పశు, పక్ష్యాది స్థావరాంత శరీరము. ఆ శరీరము పంచభూతములతో ఏర్పడినదైనను, చిత్రరూపమునకు వలె ఆ భూతములకు కొన్నిచోట్ల, న్యూనాధిక భావము (హెచ్చుతగ్గులు) విరుద్ధములు కావు. ఇదేవిధముగా, శబ్ద, స్పర్శాది భోగ్య విషయములు గూడ, పంచీకృత ఏకైక భూతజన్యములగుచు, చతుర్దశ భువనములన్న పేరు గలవై ఊర్ధ్వ, మధ్య, అధోలోక భావముతో సత్త్వ, రజ, స్తమోఽంశప్రధానములై యున్నవి. ఇదియంతయు, బ్రహ్మాండమన్న పేరు గలది. 'విరాట్' అని,

మూర్తము అని పిలువబడును. ఇది, ఉపనిషత్తులందలి సృష్టి క్రమము. ఈ సృష్టిక్రమమునకు విపరీతముగా, లయక్రమము ఉండును. మూర్తమైన పంచీకృత పంచ మహాభూత కార్యాత్మకమగు విరాట్స్వరూపము. పృథివి, జలము మొదలగు ఏకైక భూతలయముచే అమూర్తము, అపంచీకృత పంచమహాభూతాత్మకము, స్వకారణమైన హిరణ్యగర్భతత్త్వమునందు లయ మగుచున్నది. అదియే, దైనందిన ప్రళయము.

అమూర్తము, పరమేశ్వరోపాధియగు అవ్యాకృతమునందు లయమగును. అవ్యాకృతము, అనాది గనుక, ఈ అవ్యాకృతము నుండియే, తిరిగి సృష్టి, జరుగవలయును గనుక, అవ్యాకృతమునకు కారణమునందు లయము లేదు. లయ మనగా, స్వకారణమునందు సూక్ష్మరూపముగా ఉండుట అని లక్షణము. ఎచ్చటనైనను, అవ్యాకృతము లయము చెందినదని వినిపించినపుడు, ఆ అవ్యాకృతము, కార్యాత్మక పరిణామమును ధరించలేదని గ్రహించవలయును. ఇదియే, ప్రాకృత ప్రళయము.

బ్రహ్మజ్ఞానము వలన, ప్రపంచముయొక్క ఉచ్ఛేదము తిరిగి మరల ఉద్భవించకపోవుట అనునట్టి ఆత్యంతిక ప్రళయము సంభవించును. ఈ ఆత్యంతిక ప్రళయము, కారణము నశించగా, కార్యము నశించుచుండును. కారణము పూర్తిగా నశించినపుడు, కార్యప్రపంచము యొక్క అత్యంత నివృత్తి (ఉచ్ఛేదము) జరుగును. సమస్తమైన సృష్టిప్రళయాదికము, స్వప్న సృష్టి ప్రళయమువలె అపారమార్థికము (అసత్యము) అయినను, విషయవాసనాదార్ఢ్యము వలన, వ్యవహారసమర్థ మగుచున్నది.

స్వప్న ప్రపంచము, వ్యావహారిక ప్రపంచము మాయా మాత్రములు. ఒకటి, ప్రాతిభాసికము, మఱియొకటి వ్యావహారికము. అయినను, ఈ స్వప్న, జాగ్రత్ప్రపంచములకు గగన కుసుమాదులకు వలె తుచ్ఛత్వము (నిస్స్వరూపత్వము) లేదు. ఇది అంతయు, శంకర భగవత్పాదభాష్యమునందు సుస్పష్టము.

## సిద్ధాన్తబిన్దుః

ఏవం స్థితే జాగరణాదివ్యవస్థా ఉచ్యతే। ఇన్ద్రియవృత్తికాలీన అర్థోపలబ్ధిః జాగరణమ్। తత్ర చ మూర్తం విరాడాఖ్యం భోగ్యం ప్రత్యక్షాది ప్రమాణషట్కేన వ్యవహ్రియమాణత్వాత్ వ్యావహారికం విశ్వాఖ్యేన జీవేన ఉపపద్యతే। స చ దేహేన్ద్రియాదిషు ప్రవేశాత్ వ్యాపనాద్వా విశ్వః ఇత్యుచ్యతే। విశ ప్రవేశనే। విష్ల్ వ్యాప్తౌ ఇతి చ స్మరణాత్। అత్ర యద్యపి విశ్వేన అమూర్తం అవ్యాకృతం చ అనుమానాదినా అనుభూయతే। తథాఽపి వ్యావహారికం సర్వం విశ్వేనైవ జ్ఞాయతేఽఇతి నియమాత్। స్థూల శరీర ఉపాద్యభిమానిత్వాచ్చ న తస్య అవస్థాన్తరవ్యాపకత్వమ్। శుక్తి రజతాది జ్ఞానానాం అప్రామాణికత్వాత్ తద్విషయస్య అవ్యావహారికత్వేఽపి ఇన్ద్రియవ్యాపార కాలీనత్వాత్ జాగరణత్వోపపత్తిః। జ్ఞానోత్పత్తి ప్రక్రియా చ అధస్తాత్ ఉక్తైవ।

ఏవం జాగ్రద్భోగజనక కర్మక్షయే స్వప్నభోగజనక కర్మోదయే చ సతి నిద్రాఖ్యయా తామస్యా వృత్త్యా స్థూల దేహాభిమానే దూరీకృతే సర్వేంద్రియేషు దేవతానుగ్రహాభావాత్

నిర్వ్యాపారతయా లీనేషు విశ్వోఽపి లీనః ఇత్యుచ్యతే, తదా చ స్వప్నావస్థా। తత్ర చ అన్తఃకరణగత వాసనానిమిత్తః ఇన్ద్రియ వృత్త్యభావకాలీనః అర్థోపలంభః స్వప్నః॥ తత్ర మన ఏవ గజ తురగాది అర్థాకారేణ వివర్తతే। అవిద్యావృత్త్యా చ జ్ఞాయతే ఇతి కేచిత్। అవిద్యైవ శుక్తిరజతాదివత్ స్వప్నార్థాకారేణ పరిణమతే, జ్ఞాయతే చ, అవిద్యావృత్త్యా ఇత్యన్యే।

భావదీపిక

ఇట్లు కాగా, జాగరణము మొదలగు అవస్థలయొక్క వ్యవస్థ చెప్పబడుచున్నది. బాహ్యేంద్రియ వృత్తుల కాలమునందు విషయప్రత్యక్షము జాగరణము. ఆ జాగ్రదవస్థయందు మూర్తము, 'విరాట్' సంజ్ఞ గల బ్రహ్మాండ భోగ్యప్రపంచము ప్రత్యక్షానుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధి ప్రమాణములచేత వ్యవహరింపబడుచున్నందున, వ్యావహారిక మగుచు, 'విశ్వ'సంజ్ఞ గల జీవునిచే ఉపభోగమునకు అనువగు చున్నది. 'విశ ప్రవేశనే' అను ధాతుపాఠము ననుసరించి, దేహేంద్రియాదులయందు ప్రవేశించుటవలన గాని, లేదా, 'విష్ల వ్యాప్తౌ' అను ధాతుపాఠము వలన, దేహేంద్రియాదులయందు వ్యాపించుటవలన గాని, జాగ్రదవస్థాభిమాని యగు జీవుడు, 'విశ్వుడు' అని వ్యవహరింపబడుచున్నాడు. అయితే, ఈ విశ్వుడు అనుమానాది ప్రమాణములచే అమూర్తమును, అవ్యాకృతమును గూడ, గ్రహించుచున్నాడు. అయినన్ను వ్యావహారిక జగత్తు అంతయు, విశ్వునిచేతనే తెలియబడు నను నియమము వల్లను, స్థూల శరీరోపాధియందు అభిమానము ఉండుటవలనను, ఆ

విశ్వుడు జాగ్రదవస్థను విడచి, స్వప్న, సుషుప్త్యవస్థల వఱకు వ్యాపించువాడు కాడు. శుక్తిరజతజ్ఞానము ఇంద్రియములచే గ్రహింపబడనందువలన, వ్యావహారికము కాకపోవుటచే అప్రామాణికమైనను, ఆ భ్రాంతిజ్ఞానవిషయము, వ్యవహారయోగ్యము కాకపోయినను, ఇంద్రియవ్యాపారకాలములోనే ఆ శుక్తిరజత జ్ఞానము కలిగినది గనుక, అది, జాగ్రదవస్థలోనిది అనుట ఉపపన్నమై యున్నది, యుక్తమే అయి ఉన్నది,

జ్ఞానముయొక్క ఉత్పత్తిప్రక్రియ, ఇదివఱకు చెప్పబడి యున్నది.

ఈవిధముగా జాగ్రత్కాల భోగజనక కర్మ క్షీణింపగా, స్వప్నావస్థయందు భోగమును కలిగించునట్టి కర్మ, అభివ్యక్తము కాగా, నిద్ర అనెడి తామస వృత్తి చేత స్థూలశరీరాభిమానము దూరము చేయబడగా, ఆ సమయమున, దేవతానుగ్రహము లేక పోవుటవలన ఇంద్రియము లన్నియు, తమ తమ పనులను చాలించి లీనములు అగును. అట్లు కాగా, విశ్వుడు గూడ, లీనుడని చెప్పబడుచున్నాడు. అప్పుడు స్వప్నావస్థ. ఆ స్వప్నావస్థ యందు అంతఃకరణము నందలి సంస్కారములు నిమిత్తము కాగా, ఇంద్రియవృత్తులు లేని సమయమున, విషయసాక్షాత్కారము స్వప్న మగుచున్నది. అప్పుడు, మనస్సే గజ, తురగా విషయాకారముతో పరిణమించుచున్నది. అవిద్యావృత్తిచే విషయము తెలియబడుచున్నదని కొందఱు అందురు. దవస్థలో అవిద్యయే, శుక్తిరజతరూపముగా ధరించి స్వప్నవిషయాకారముగా గూడ, అవిద్యయే, పరిణమించ

అవిద్యావృత్తిచేతనే, స్వప్నపదార్థములు తెలియబడుచున్నవని కొందఱు అందురు.

## సిద్ధాన్తబిన్దుః

కః పక్షః శ్రేయాన్? ఉత్తరః। అవిద్యాయా ఏవ సర్వత్ర అర్థాధ్యాస జ్ఞానాధ్యాసోపాదానత్వేన క్లృప్తత్వాత్ మనోగత వాసనా నిమిత్తత్వేన చ క్వచిత్ మనఃపరిణామత్వవ్యపదేశాత్।

నను, తదా మనసః దృశ్యాకార పరిణామానభ్యుపగమే ద్రష్టృత్వసంభవేన ఆత్మనః స్వయంజ్యోతిష్ట్వాసిద్ధిరితి చేత్, న। బహిరింద్రియజన్య వృత్త్యభావేన తదానీం మనసః అగ్రాహకత్వాత్। తత్సహకారేణైవ తస్య గ్రాహకత్వనియమాత్ । సవృత్తిక అన్తఃకరణావచ్ఛిన్నస్యైవ, చైతన్యస్య ప్రమాతృత్వనియమాత్। తదా అన్తఃకరణసత్త్వేఽపి ప్రమాతృభావః (ప్రమాతృ అభావః)।

## భావదీపిక

స్వప్నమునందు గజ, తురగాది పరిణామమును మనస్సే ధరించుచున్నదా? అవిద్యయే, శుక్తిరజతాకారముగా పరిణమించి నటుల, స్వప్నపదార్థాకారముగా గూడ, పరిణమించుచున్నదా? అను రెండు పక్షములలో ఏ పక్షము ప్రశస్యతరము? 'అవిద్యా పరిణామము, అను తరువాతి పక్షమే, ప్రశస్తమైనది. ప్రాతిభాసిక అధ్యాసస్థలములందు అవిద్యయే, శుక్తిరజత విషయాధ్యాసకును, శుక్తిరజతజ్ఞానాధ్యాసకును, ఉపాదానకారణముగా అంగీకరింపబడుటవలన, స్వప్నపదార్థ జ్ఞానాధ్యాస స్థలమునందు గూడ, అవిద్యాపరిణామిత్వపక్షమే యుక్తము. 'సధీః స్వప్నో భూత్వా'

మొదలగు కొన్ని శ్రుతులందు మనఃపరిణామత్వ వ్యవహారము మనోగతమైన వాసనలు నిమిత్తకారణముగా ఉండుటచేతనని గ్రహింపనగును.

ఓయీ! స్వప్నమున, మనస్సు, దృశ్యాకారముగా పరిణమించుట లేదు అని అంగీకరించినచో, 'అత్రాయం పురుషః స్వయంజ్యోతిః' అను శ్రుతి, స్వప్నావస్థయందు ఆత్మకు స్వయంజ్యోతిష్ట్వమును (ఆత్మ ఒకటియే, వ్యవహారసాధనమగు జ్యోతి) ప్రతిపాదించుట కుదరనేరదు. మనస్సు, ద్రష్ట కావచ్చును గదా! అనినచో, అట్లు కాదు. స్వప్నమునందు బహిరింద్రియము వలన కలుగు వృత్తులు ఉండవు. కనుక, మనస్సు,అపుడు విషయగ్రాహకము కాజాలదు. ప్రత్యక్షాది ప్రమాణజన్య వృత్తి సహకారము చేతనే, మనస్సునకు పరిణామిత్వము కలుగును. అపుడు, అంతఃకరణము ఉన్నను, బహిరింద్రియవృత్తి లేకపోవుటచే, ప్రమాతృత్వము లేదుగనుక, ద్రష్టృత్వము లేదు. కావున, ఆత్మ ఒక్కటియే, స్వప్నభాసకము. అందువలన,స్వయంజ్యోతిష్ట్వము అప్పుడు సిద్ధించుచున్నది.

### సిద్ధాన్తబిన్దుః

కిమధిష్ఠానం స్వప్నాధ్యాసస్య? మనోఽవచ్ఛిన్నం జీవచైతన్య మిత్యేకే। మూలాజ్ఞానావచ్ఛిన్నం బ్రహ్మచైతన్యమిత్యపరే। కిం శ్రేయః? మతభేదేన ఉభయమపి। తథా హి। జాగ్రద్బోధేన స్వప్నభ్రమ నివృత్త్యభ్యుపగమాత్ అధిష్ఠానజ్ఞానాదేవచ భ్రమనివృత్తేః బ్రహ్మచైతన్యస్య చ అధిష్ఠానత్వే

సంసారదశాయాం తద్జ్ఞానాభావాత్ జ్ఞానేన సర్వ ద్వైత నివృత్తేః న జాగ్రద్బోధాత్ స్వప్నభ్రమనివృత్తిః స్యాత్। స హి కర్తా ఇతి చ జీవకర్తృత్వశ్రుతేః ఆకాశాది ప్రపఞ్చవత్ సర్వ సాధారణ్యాపత్తేశ్చ। న మూలాజ్ఞానావచ్ఛిన్నం బ్రహ్మచైతన్యం అధిష్ఠానమ్।

భావదీపిక

స్వప్నమునందు అధ్యాసకు అధిష్ఠానము ఏది? మనోఽవచ్ఛిన్నమగు జీవచైతన్యము అధిష్ఠానమని కొందఱు చెప్పుదురు. మఱికొందఱు మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మచైతన్యము అధిష్ఠానమని అందురు. ఏ పక్షము ఉత్తమమైనది? మతభేదముచే రెండును, యుక్తములే అగుచున్నవి. ఆ విషయమే, ఉపపాదింపబడుచున్నది. జాగ్రద్బోధ (మెలకువ) వచ్చుటతోడనే, స్వప్న భ్రమ, నివర్తించును గనుక, అధిష్ఠానజ్ఞానము చేతనే, భ్రమ నివర్తించవలెను. గనుక, బ్రహ్మచైతన్యమే, అధిష్ఠానమైనచో, సంసారదశయందు బ్రహ్మజ్ఞానము లేదు గనుక, స్వప్నభ్రమ నివర్తించుట సాధ్యము కాదు. ఒకవేళ, బ్రహ్మజ్ఞానమే కలిగినచో, సర్వద్వైతప్రపంచము నివర్తించును గనుక, జాగ్రద్బోధ వలన, స్వప్ననివృత్తి చెప్పుట సంభవించదు. 'స హి కర్తా' అను శ్రుతి, జీవకర్తృత్వమునే చెప్పుచున్నది. బ్రహ్మచైతన్యము అధిష్ఠానమైనచో, ఆకాశాది ప్రపంచము వలె, స్వప్నము గూడ, సర్వ సాధారణము కావలసివచ్చును. కనుక, మూలాజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మచైతన్యము స్వప్నాధ్యాసకు అధిష్ఠానము కానేరదు.

సి ద్ధా న్త బి న్దుః

నను, జీవచైతన్యస్య అనావృతత్వేన సర్వదా భాసమానత్వాత్ కథ మధిష్ఠానమ్? సత్యమ్। తత్రాపి స్వప్నఅధ్యాసానుకూల వ్యావహారిక సంఘాతభానవిరోధి అవస్థానజ్ఞానాభ్యుపగమాత్। స్వప్నదశాయాం చ 'అహం మనుష్యః' ఇత్యాది ప్రాతీతిక సంఘాతాన్తరభావాభ్యుపగమాత్। శయ్యాయాం స్వపిమీతి శయ్యాన్తరభానవత్। భానసామగ్ర్యభావశ్చ తుల్య ఏవ।

భా వ దీ పి క

జీవచైతన్యము ఎల్లప్పుడు ప్రకాశించును గనుక, అజ్ఞానముచే అవృతము కాదు. అజ్ఞానావృతము గాని, శుక్తికి అధిష్ఠానము కాజాలదు కదా! నిజమే. ఆత్మ, స్వయంజ్యోతి గనుక, ఎల్లప్పుడు ప్రకాశించుచుండును. అయినను, జాగ్రద్దశయందు దేహేంద్రియాది సంఘాతాభిమానము ఉండగా స్వప్నము రాదు గనుక, స్వప్నానుభవము ననుసరించి, వ్యావహారిక సంఘాతాభిమానమును దూరముగా జేయునట్టి మనోఽవచ్ఛిన్న చిద్విషయక అవస్థా అజ్ఞానము అంగీకరింపబడుచున్నది. స్వప్నములో 'నేను మనుష్యుడను' అని సంఘాతాభిమానము అనువృత్తమగుచున్నది గదా! అని శంకించరాదు. స్వప్నములోని మనుష్యత్వాభిమానము ఆ అవస్థకు మాత్రమే, పరిమితమైనది ఉత్పన్నమగును. అది, జాగ్రత్కాలీన మనుష్యత్వాభిమానము కాదు. ప్రక్కమీద పరుండి, కల గనుచున్నాను అనునపుడు, స్వప్నములోని శయ్య, జాగ్రత్కాలములోని శయ్యయొక్క భానము కాదు. శయ్యా

విషయమున, ఇంద్రియసన్నికర్ష లేకపోవుట ఎట్లు, స్వప్నశయ్యాభిన్నమో, అదేవిధముగా, మనుష్యత్వాభిమాన విషయమున గూడ, వ్యావహారిక సామగ్రి లేనందున, స్వప్నమునందు మనుష్యత్వాభిమానము కూడ, ప్రాతిభాసికమే, వ్యావహారికము కాదు.

## సిద్ధాన్తబిన్దుః

నను, 'అహం మనుష్యః' ఇతి వ్యావహారిక సంఘాతజ్ఞానస్య ప్రమాణాజన్యత్వాత్ కథం అజ్ఞాననివర్తకతా? అవస్థాన్తర అన్యథా అనుపపత్త్యా తత్కల్పనే సుషుప్తావపి స్వప్నబాధక జ్ఞానం ఆస్థీయేత। తచ్చ అనిష్టమ్। జాగ్రత్త్వాపత్తేః ఇతి చేత్, సాధు, అవోచః। స్వప్నావస్థాజ్ఞానస్యైవ అన్తఃకరణ లయసహితస్య సుషుప్తిరూపత్వాత్ న తత్ర తద్బాధః। జాగరణే తు మిథ్యైవ స్వప్నః అభాత్ ఇతి అనుభవాత్ అహమితి జ్ఞానస్య ప్రమాణాజన్యత్వే ఽపి యథార్థత్వాత్ శరీరాదిజ్ఞానస్య చ ప్రమాణజన్యత్వాత్ అవస్థాజ్ఞాన విరోధిత్వం అనుభవసిద్ధమ్। విశేషాజ్ఞానం తు న ప్రమాణజన్యవృత్తిమన్తరేణ నివర్తతే। సాక్షిణశ్చ అవిద్యానివర్తకత్వాభావః అజ్ఞానసాధకత్వేనైవ ధర్మిగ్రాహక మానసిద్ధ ఇతి న కిఞ్చిత్ అనవద్యమ్।

## భావదీపిక

ఓయీ! 'అహం మనుష్యః' అను జాగ్రద్దశలోని వ్యావహారిక ప్రథమ జ్ఞానము ప్రమాణజన్యము కాదు గనుక, స్వప్నమునకు ప్రయోజకమగు అజ్ఞానము ఎట్లు నివర్తింపజేయును? స్వప్నావస్థ పోనిదే, జాగ్రదవస్థానుభవము కుదరదు గనుక, ఆ స్వప్న

ప్రయోజక అజ్ఞానము నివర్తించునని కల్పన జేసినచో, సుషుప్తి వ్యవస్థ కలిగినపుడు గూడ, స్వప్నబాధక జ్ఞానము అంగీకరించ వలసియుండును. అది, ఇష్టము కాదు గదా! సుషుప్తిలో జ్ఞానము ఉన్నచో, అది జాగ్రదవస్థయే, సుషుప్తికి జాగ్రదవస్థను ఆపాదించినట్లగునని అనినచో, చక్కగా పలికితివి. స్వప్నావస్థా ప్రయోజనమగు అజ్ఞానమే, అన్తఃకరణలయముతో గూడికొనినదై సుషుప్తిరూపము అగుచున్నది. కనుక, సుషుప్తియందు స్వప్నావస్థకు బాధ చెప్పబడదు. జాగ్రత్తునందైనచో, నాకు మిథ్యాభూతమైన స్వప్నము భాసించినదను అనుభవము వలన, 'అహ'మను అజ్ఞానమునకు ప్రమాణజన్యత్వము లేకపోయినను, యథార్థము (అజ్ఞాత అబాధిత మనోవచ్ఛిన్న చిద్విషయకము) గనుక, శరీరాది జ్ఞానమైతే, ప్రమాణజన్యము గనుక, అవస్థాఅజ్ఞానమునకు స్వప్న విరోధిత్వము (బాధకత్వము) అనుభవసిద్ధము. విశేషాజ్ఞానము, ప్రమాణము వలన, కలిగిన వృత్తి కలుగక, నివర్తింపజాలదు. సాక్షికి అవిద్యానివర్తకత్వము లేదు. మీదుమిక్కిలి 'అహం న జానామి' అను ప్రతీతిచే అజ్ఞానమునకు ప్రకాశకుడగుటచేతనే సాక్షిజ్ఞానము వలన, అజ్ఞాననివృత్తి లేకపోవుట, ధర్మిగ్రాహకమైన సాక్షిప్రమాణసిద్ధము. కనుక, సాక్షికి అవిద్యానివర్తకత్వము లేకపోవుటలో ఎట్టి దోషము లేదు.

## సిద్ధాన్తబిన్దుః

'యావన్తి జ్ఞానాని తావన్తి అజ్ఞానాని' ఇతి చ అభ్యుపగమాత్ శుక్తిజ్ఞానేనైవ వ్యావహారిక సంఘాతజ్ఞానేన అజ్ఞాననివృత్తావపి

పునరపి కదాచిత్ రజతభ్రమవత్ న స్వప్నాధ్యాసానుపపత్తి రితి జీవచైతన్యమేవ అధిష్ఠానమితి పక్షే న కోఽపి దోషః । యథా తు పునః బ్రహ్మజ్ఞానాదేవ అజ్ఞాననివృత్త్యభ్యుపగమః తథా రజ్జ్వాం దండభ్రమేణ సర్పభ్రమతిరోధానవత్ అధిష్ఠానజ్ఞానాభావేఽపి జాగ్రద్భ్రమేణ స్వప్నభ్రమ తిరోభావోపపత్తేః । బ్రహ్మ చైతన్యమేవ స్వప్నాధ్యాసాధిష్ఠానమితి పక్షేఽపి న కశ్చిత్ దోషః। ప్రతి జీవం స్వప్నాధ్యాసాసాధారణ్యం తు మనోగతవాసనానాం అసాధారణ్యాదేవ । మనోఽవచ్ఛిన్నం బ్రహ్మచైతన్యమేవ అధిష్ఠానమ్ । ఏతస్మిన్నపి పక్షే అవస్థాఅజ్ఞానస్య ఆవరకత్వాంగీకారాత్ న కాఽపి అనుపపత్తిః। అత ఏవ శాస్త్రేషు క్వచిత్ క్వచిత్ తథా వ్యపదేశః ।

## భావదీపిక

'ఎన్ని జ్ఞానములు కలవో, అన్ని అజ్ఞానములు' అని అంగీకరించుటవలన, శుక్తిజ్ఞానము చేత ఒకమారు రజతభ్రమ, నివృత్తి అయినను, మరల, కాలాంతరమున, రజతభ్రమ కలుగు విధముగా 'అహం మనుష్యః' అను వ్యావహారిక సంఘాతజ్ఞానముచేత ఒక అజ్ఞానము నివృత్తమైనను, స్వప్నాధ్యాసకు అనుపపత్తి లేదు. కావున, జీవచైతన్యమే, స్వప్నాధ్యాసకు అధిష్ఠాన మను పక్షము నందు ఏ దోషము లేదు. మూలాజ్ఞానావచ్ఛినమగు బ్రహ్మ చైతన్యమే, స్వప్నాధ్యాసకు అధిష్ఠానము అను పక్షమునందు గూడ, సంసారిదశయందు బ్రహ్మజ్ఞానము లేదు గనుక, మూలాజ్ఞానము నివృత్తము కాకపోయినను, రజ్జువునందు మొదట, సర్పభ్రమ కలిగి, తరువాత, దండభ్రమ కలిగినపుడు, అధిష్ఠానజ్ఞానము

లేకపోయినను, పూర్వభ్రమకు (సర్పభ్రమకు) జాగ్రద్భ్రమచే స్వప్నభ్రమ, తిరోభావము చెందును గనుక, ఈ పక్షమునందు గూడ, ఏ దోషమును, లేదు.

అయితే, స్వప్నాధ్యాస, ఆ యా జీవులకు పరిమితమై అసాధారణ మగుట మనోగతవాసనలను అసాధారణములైనవానిని నిమిత్తముగా అంగీకరించుట వలన, ఉపపన్న మగును. మనోఽవచ్ఛిన్న బ్రహ్మచైతన్యమే, అధిష్ఠానము అను ఈ పక్షమునందు అవస్థా అజ్ఞానములు కూడ, ఆవరకములుగా అంగీకరించుటవలన, ఏ అనుపపత్తియు లేదు. కనుకనే, శాస్త్రములందు కొన్ని కొన్ని చోట్ల, ఆవిధముగా వ్యవహరించుట జరుగుచున్నది.

## సిద్ధాన్తబిన్దుః

నను, మనోఽవచ్ఛిన్నచైతన్యస్య అధిష్ఠానత్వే అహం గజః ఇత్యాది అహంకారసామానాధికరణ్యేన గజప్రతీతిః స్యాత్ । ఇదం రజతమితి శుక్తిసామానాధికరణ్యేన రజతప్రతీతివత్। న తు అయం గజ ఇతి । బ్రహ్మచైతన్యస్య అధిష్ఠానత్వపక్షేఽపి గజః ఇత్యాకారైవ ప్రతీతిః స్యాత్, న తు అయం గజ ఇతి । తత్రాపి ఇదంకారాస్పదీభూత బాహ్యార్థాభావస్య సమానత్వాత్ ఇతి చేన్న। ఆద్యే పక్షే అహంకారస్య శుక్తివత్ అధిష్ఠానానవచ్ఛేదకత్వాత్ । శుక్తిరజతమితివత్ అహం గజ ఇతి న భ్రమాకారప్రసఙ్గః। అహమితి జ్ఞానస్యైవ శుక్తిరితి జ్ఞానస్యైవ భ్రమవిరోధిత్వాత్ । ఇదమంశస్య చ భ్రమావిరోధిన ఏవ తత్ర భానాభ్యుపగమాత్। స్వప్నే తు గజః ఇత్యాకారవత్ అయం ఇత్యాకారోఽపి కల్పిత ఏవ । ఉభయాకార

బాధేఽపి అధిష్ఠానీభూత చైతన్యాబాధాత్ న శూన్యవాదప్రసఙ్గః। జాగ్రద్దశాయామపి శుక్తిదంకారవిలక్షణస్య ప్రాతీతికస్యైవ రజతేదంకారస్య భానాభ్యుపగమాచ్చ। అధ్యస్తమేవ హి పరిస్ఫురతి భ్రమేషు ఇతి న్యాయాత్।

భావదీపిక

ఓయీ! మనోవచ్ఛిన్న చైతన్యము అధిష్ఠానమగుచో, 'అహం గజః' అనురీతిగా, అహంకారసామానాధికరణ్యముతో (అహంకారాభేదప్రతీతితో) గజప్రతీతి ఉండవలయును. 'ఇదం రజతమ్' అను రజతప్రతీతి, శుక్తిసామానాధికరణ్యముతో ప్రతీతమగుచున్నది గదా! కాని, స్వప్నమునందు గూడ, 'అయం గజః' అని ఇదమాకారప్రతీతియే, గజమునందు కలుగుచున్నది. బ్రహ్మచైతన్యము అధిష్ఠాన మను పక్షమునందు గూడ, 'గజః' అను ఆకారముతో స్వప్నమునందు ప్రతీతి ఉండవలయును. 'అయం గజః' అను ప్రతీతి ఉండరాదు. ఇదంకారమునకు ఆస్పదమగు బాహ్యపదార్థము స్వప్నమునందు, లేదు గదా! అనినచో, అట్లు కాదు. మొదటి పక్షమున, అహంకారము శుక్తివలె భ్రమప్రయోజకమైన అజ్ఞానములో విషయతావచ్ఛేదకము కానేరదు. శుక్తిరజత మను ప్రతీతి లేనివిధముననే, 'అహం గజః' అని భ్రమాకారమునకు ప్రసక్తి లేదు. 'అహమ్' అను జ్ఞానము వలెనే, 'శుక్తిః' అను జ్ఞానమే భ్రమకు విరోధి అయి ఉన్నది. 'అయం' అను ఇదమంశము భ్రమకు విరోధి కానిది ఆ భ్రమయందు అంగీకరింపబడినది గనుక. స్వప్నమునందైతే, 'గజః' అను ఆకారము వలెనే, 'అయం' అను ఆకారము కూడ, జాగ్రత్కాలీన ఇదమంశ

విలక్షణమైనది అంగీకరింపబడుచున్నది, కల్పింపబడుచున్నది. ఇదమాకార, గజాకార ఉభయమునకు బాధ కలిగినను, అధిష్ఠానభూత చైతన్యమునకు బాధ లేదు గనుక, శూన్యవాదప్రసఙ్గము లేదు. జాగ్రద్దశయందు గూడ, శుక్తీదంకారము కంటె, విలక్షణమగు ప్రాతిభాసిక రజతేదంకారమును అంగీకరించుచున్నాము. 'భ్రమల యందు అధ్యస్తమే పరిస్ఫురించును' అని న్యాయమై ఉన్నది.

## సిద్ధాన్తబిన్దుః

శుక్తీదమంశభానపక్షేఽపి న ఇదమంశ సత్యత్వం అధ్యాసే ప్రయోజకమ్। కింతు అధిష్ఠాన సత్యత్వమ్। అధిష్ఠానం చ తత్ర అజ్ఞాతం శుక్తిచైతన్యమివ। అత్రాపి సాక్షిచైతన్యం విద్యత ఏవ ఇతి ఉపపాదితమ్। తస్మాత్ న పక్షద్వయేఽపి కాఽప్యనుపపత్తిః। అత్ర చ స్వాప్నిక పదార్థభోక్తా తైజస ఇత్యుచ్యతే। పిత్తాఖ్య తేజఃప్రధానకత్వాత్। ఆదిత్యాది జ్యోతిరన్తరేణాపి భాసకత్వాత్ ఇతి వా। ఏవం జాగ్రత్ స్వప్నభోగద్వయేన శ్రాన్తస్య జీవస్య తదుభయకారణకర్మక్షయే జ్ఞానశక్త్యవచ్ఛిన్నస్య సవాసనస్య అన్తఃకరణస్య కారణాత్మనాఽవస్థానే సతి విశ్రావస్థానం సుషుప్త్యవస్థా। న కిఞ్చిత్ అవేదిషమితి కారణమాత్రోపలంభః సుషుప్తిః।

తత్ర జాగ్రత్ స్వప్న భోగపదార్థ జ్ఞానాభావేఽపి సాక్ష్యాకారం సుఖాకారం అవస్థా అజ్ఞానాకారం చ విద్యాయాః వృత్తి త్రయం అభ్యుపేయతే। అహంకారాభావాచ్చ న ఏకా విశిష్టవృత్తిః సుషుప్త్యభావప్రసఙ్గాచ్చ। అత ఏవ వృత్తిరూపస్య ఉపలంభస్య అభావాత్ న ప్రలయే అతివ్యాప్తిః।

భావదీపిక

శుక్తియందు 'ఇదం రజతమ్' ఇది, రజతము అను భ్రాంతి జ్ఞానమునందు రజతమునందు తాదాత్మ్యముతో భాసించునట్టి ఇదమంశ, పురోవర్తి శుక్తియందలి ఇదమంశయే, భాసించుచున్నది అను పక్షమునందు గూడ, శుక్తీదమంశ సత్యత్వము రజతాధ్యాసకు (భ్రాంతికి) ప్రయోజకము కాదు. మఱేమనగా, అధిష్ఠానమగు శుక్తియొక్క సత్యత్వము ప్రయోజకము. అచట, అధిష్ఠానము అజ్ఞాతమగు శుక్తిచైతన్యమైనటులనే, స్వప్నావస్థయందు గూడ, సాక్షిచైతన్యము ఉండనే ఉన్నదని ఉపపాదింపబడినది. కనుక, రెండు పక్షములందును, ఏ అనుపపత్తియు లేదు. ఇచట, స్వప్నపదార్థభోగము కలవాడు, తైజసుడు అని వ్యవహరింపబడును. ఆ సమయమున,పిత్తమను తేజస్సు ప్రధానముగానుండును గనుక, లేదా, ఆదిత్యాది జ్యోతిస్సులు లేకపోయినను, స్వప్నపదార్థములను ప్రకాశింపజేయుచున్నాడు గనుక, తైజసుడని వ్యవహారము.

ఈ విధముగా, జాగ్రత్ స్వప్నభోగములు రెంటిచేతను, అలసిన జీవునకు ఉభయభోగకారణమగు కర్మయొక్క క్షయము కాగా, జ్ఞానశక్తి సహితము, సంస్కారోపేత మగు అంతఃకరణము తనకు కారణ మగు అజ్ఞానమునందు సంస్కారరూపేణ ఉండగా, జీవునకు విశ్రాంతిస్థానము సుషుప్త్యవస్థ. 'నేను ఏమియు తెలిసికొనినవాడను కాకపోతిని' (తెలియక ఉంటిని) అని కారణమాత్ర (స్థూల, సూక్ష్మ దేహవ్యాపారము లేని) కేవల అజ్ఞానముయొక్క సాక్షాత్కారము సుషుప్తి. సుషుప్తియందు జాగ్రత్ స్వప్న భోగ్య

పదార్థజ్ఞానము లేకపోయినది, సాక్ష్యాకారము, సుఖాకారము, అవస్థా అజ్ఞానాకారములగు అవిద్యావృత్తులు మూడు అంగీకరింపబడు చున్నవి. అహంకారము లేదు గనుక, సుఖఅజ్ఞానసాక్షులతో జాగ్ర దాదులందువలె ఒకే విశిష్టవృత్తి కాదు. విశిష్టవృత్తియే అయినచో, అహంకారము ఉండును గనుక, సుషుప్త్యవస్థ కాకపోవలసి వచ్చును. కనుకనే, సుషుప్తిలో అవిద్యావృత్తులు ఉండుట, ప్రలయములో వృత్తియొక్క ఉపలంభము లేకపోవుట అను భేదము వలన, సుషుప్తిలక్షణమునకు ప్రలయమునందు అతివ్యాప్తి లేదు.

## సిద్ధాన్తబిన్దుః

తత్ర తత్కల్పనాబీజాభావాత్ । ఇహ చ 'సుఖ మహ మస్వాప్సమ్, న కిఞ్చిదవేదిషమ్' ఇతి సుప్తోత్థితస్య పరామర్శాత్, అననుభవే చ పరామర్శానుపపత్తేః । అన్తఃకరణోపరాగకాలీన అనుభవజన్యత్వాభావాచ్చ న తత్త్వోల్లేఖాభావేఽపి స్మరణ త్వానుపపత్తిః । స్మరణే తత్త్వోల్లేఖనియమాభావాచ్చ । జాగ్ర ద్దశాయాం అస్వాప్సమితి అనుభవానుపపత్తేః । లిఙ్గాభావేన ఆశ్రయాసిద్ధ్యా చ అనుమానస్య అసంభవాత్ । అహఙ్కారస్తు ఉత్థానసమయ ఏవ అనుభూయతే। సుషుప్తౌ లీనత్వేన తస్య అనను భూతత్వేన స్మరణానుపపత్తేః । ముఖప్రతిబింబాశ్రయే దర్పణే జపాకుసుమలౌహిత్యాధ్యాసేన రక్తం ముఖమితి ప్రతీతివత్ అహంకారాశ్రయతోయాః సాక్షిచైతన్యస్య స్మరణాశ్రయత్వాత్ అహమస్వాప్సమితి సామానాధికరణ్యప్రతీతిః । న పునః అహం సుఖీతివత్ ఆశ్రయతయా స్మృతి సంశయ విపర్యయాణాం

సాక్షిచైతన్య ఆశ్రయత్వనియమాత్ । అహఙ్కారస్య చ ప్రమాణజన్య జ్ఞానాశ్రయత్వనియమాత్ । ప్రమాతృత్వేనైవ తత్కార్యతావచ్ఛేదాత్ । అప్రమాతృత్వావచ్ఛేదేన చ అవిద్యాయా ఏవ కారణత్వాత్। అత ఏవ అనాప్తవాక్యాదిజన్య పరోక్షవిభ్రమోఽపి అవిద్యావృత్తిరేవేతి అభ్యుపగమః వేదాన్తవిదామ్ ।

## భావదీపిక

ప్రలయమునందు అవిద్యావృత్తులు కలదని కల్పించుటకు తగిన కారణము లేనందువలన, వృత్తులు గల సుషుప్తికంటె ప్రలయము భిన్నమైనది. సుషుప్తియందైతే, 'నేను, హాయిగా నిద్రపోయితిని, ఏమియు, నాకు తెలియదు అని నిద్రనుండి లేచిన వానికి పరామర్శ, అనగా, స్మరణము కందు. అనుభవము లేనిదే, స్మరణము ఉపపన్నము కాదు గనుక, జాగ్రత్స్మృతిచేత సుషుప్తి కాలమునందు వృత్త్యనుభవము కల్పింపబడుచున్నది. అయితే, సాధారణముగా, స్మరణము 'సః' అను ఆకారముతో తచ్ఛబ్దో ల్లేఖముతో ఉండును. కాని, ఇచట సుఖానుభవాదులు అన్తఃకరణ ఉపరాగకాలమున, జనించినవి కావు గనుక, దేశ, కాల, అవస్థా సూచకమగు తచ్ఛబ్దోల్లేఖము లేకపోయినను, స్మరణ మగుటలో అనుపపత్తి ఏమియు లేదు. స్మరణమునందు దేశ, కాల విశిష్ట రూపముతో స్మృతి, వివక్షితమైనపుడే, తచ్ఛబ్దోల్లేఖము ఉండును. కాని, అనుభవసమాన విషయస్మరణములో తత్త్వోల్లేఖము ఉండదు. జాగ్రద్దశయందు 'నిద్రపోయితిని' అనెడి భూతకాలిక అనుభవము ఉపపన్నము కాదు. ఈ సుఖాదిజ్ఞానము అనుమాన ప్రమాణమునకు గూడ, గోచరము కాదు. హేతువు లభించనందున,

ఆశ్రయాసిద్ధి చేతనే అనుమానప్రమాణము ఇచట, ప్రసక్తము కాదు. అహంకారమైతే, నిద్రనుండి లేచినతరువాతనే, అనుభవింపబడుచున్నది. సుషుప్తిలో, లీనమై ఉండుటచేత అహంకారము ఆ సుఖమును అనుభవించలేదు. కావున, జాగ్రదవస్థలోని అహంకారము, స్మరించుట ఉపపన్నము కాదు. ఇక, ఏమనగా, ముఖప్రతిబింబమునకు, ఆశ్రయమైన దర్పణమునకు జపాకుసుమము దగ్గఱ ఉన్నపుడు, ఆ జపాకుసుమముయొక్క లౌహిత్యము (ఎఱ్ఱదనము), దర్పణమునందు భాసించుటచే 'రక్తం ముఖమ్' అను ప్రతీతి కలుగుచున్నది. ముఖమునందు, దర్పణమునందు అధ్యాసచే భాసించిన లౌహిత్యమే, ముఖమునందు భాసించినదని భావము. సాక్షిచైతన్యము, అహంకారమునకు ఆశ్రయమగుటచే స్మరణమునకు ఆశ్రయ మగుటవలన, 'అహమస్వాప్సమ్' 'నేను నిద్రపోయితిని' అను స్మరణాశ్రయత్వము సాక్షిచైతన్యము ద్వారా, ప్రతీత మగుచున్నది. అంతియేకాని, 'అహం సుఖీ' అను అనుభవమునందువలె, అహంకారగత సుఖాకార వృత్త్యనుభవమువంటిది కాదు. స్మృతి, సంశయ, విపరీత జ్ఞానములు సాక్షిచైతన్యాశ్రయములే అను నియమము కలదు. అహంకారము, ప్రయాణమువలన కలిగిన జ్ఞానమునకే, ఆశ్రయమన్న నియమము వలన, అహంకారమునకు ప్రమాత్వము చేతనే, అహంకారపరిణామ కార్యతావ్యాప్తి కలదు. ఎచట, అప్రమాత్వమో, అచట, అవిద్యయే కారణమై యున్నది (పరిణమించునది). కనుకనే, యథార్థవక్త కాని (అప్తుడుకాని) పురుషుని వాక్యము

వలన, కలిగిన పరోక్ష భ్రాంతిస్థలమునందు అవిద్యావృత్తియే గాని, అంతఃకరణవృత్తి కాదని వేదాంతవిదులు అంగీకరింతురు.

సిద్ధాన్తబిన్దుః

తత్ర అన్తఃకరణవృత్తిజనక సామగ్రీసంభవేఽపి ప్రమాత్వాభావావరోధేన అన్తఃకరణస్య అసామర్థ్యాత్। నామాదిషు బ్రహ్మాధ్యాసస్తు ఇచ్ఛాధీనతయా భ్రమప్రమావిలక్షణ మనోవృత్తిరేవ, కామాదివత్। తదుక్తమ్। అత ఏవ చోదనాజన్యత్వాత్ మానసీ క్రియైవ సా। న జ్ఞాన మితి। ఏతేన తర్కస్యాపి మనోవృత్తిత్వం వ్యాఖ్యాతమ్। వ్యాప్యారోపేణ వ్యాపకారోపక ప్రసజ్జనాత్మకస్య తర్కస్య ఇచ్ఛాధీనతయా భ్రమ ప్రమ విలక్షణత్వాదితి। అత ఏవ మనన నిదిధ్యాసనసహితే శ్రవణాఖ్యే వేదాన్తవాక్యవిచారే శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః ఇత్యాది విధిరపి ఉపపద్యతే। తస్య చతుర్విధ అన్వయ వ్యతిరేకాది తర్కరూపత్వాత్। దృగ్దృశ్యాన్వయ వ్యతిరేకః। సాక్షి సాక్ష్యాన్వయ వ్యతిరేకః। ఆగమాపాయి తదవధి అన్వయ వ్యతిరేకః। దుఃఖి పరమ ప్రేమాస్పద అన్వయ వ్యతిరేక ఇతి। (సమన్వయాధ్యాయ, అవిరోధాధ్యాయ, సాధనాధ్యాయ, ఫలాధ్యాయాః।) అనువృత్త వ్యావృత్త, అన్వయ వ్యతిరేకః పఞ్చమః। ఏతచ్చ సర్వేషాం వేదాన్తానుకూల తర్కాణాం చతుర్లక్షణే మీమాంసాది ప్రతిపాదితానాం ఉపలక్షణమితి అభియుక్తాః। విస్తరస్తు వేదాన్త కల్పలతికాయాం అనుసంధేయః।

భావదీపిక

సుషుప్తియందును, అవిద్యావృత్తులు, సుఖాకారము అజ్ఞాన

ఆకారము, సాక్ష్యాకారము కలవి-మూడు ఉండును. అహంకారము, లీనమగుటచే అవి (ఏకవృత్తి కాదు) విశిష్టవృత్తి స్వప్నపదార్థములు. అవిద్యావృత్తి (పరిణామము), స్మృతి, సంశయ విపర్యయములు, అనధిగత అబాధిత విషయము కలవి కానందున ప్రమావృత్తులు కావు. ప్రత్యక్షాది ప్రమాణములచే యథార్థ అనుభవము (ప్రమ) అంతఃకరణపరిణామము (వృత్తి). శబ్దము వలన (అనాప్త వాక్యము వలన) పరోక్షభ్రమ కూడ, అవిద్యావృత్తియే అయి ఉన్నది. వృత్తి అనగా, పరిణామము. భ్రమాత్మక జ్ఞానము లన్నియు, అవిద్యాపరిణామములే. శబ్ద జ్ఞానము, పదార్థోపస్థితి అను సామగ్రి సమానమైనను, జ్ఞానమునకు ప్రమాత్వము లేదు. కావున, అది, అంతఃకరణపరిణామము కాదు. 'నామ బ్రహ్మేత్యుపాసిత' నామమును బ్రహ్మాభేదముతో ఉపాసించవలెను అను వాక్యమునందు నామయందు బ్రహ్మదృష్టి ఆధ్యాస (ఆరోపము) ఏది కలుగుచున్నదో, ఆ నామబ్రహ్మబుద్ధి, భ్రమ కాదు. నామము బ్రహ్మ కాదని తెలియునుగనుక. ప్రమయు, కాదు, బాధితము గనుక. ఈ నామయందు బ్రహ్మతాదాత్మ్యకారవృత్తి (బ్రహ్మాధ్యాస) శాస్త్రవిధీచ్ఛ వలన, జనించినదగుటచే మనోవృత్తియే, అయి ఉన్నది. కామము, సంకల్పము మనోవృత్తులుగా పేర్కొనబడినవి గదా! ఈ నామబ్రహ్మాధ్యాస జ్ఞానము కాదు. శాస్త్రవాక్యము వలన, జనించిన మానస క్రియయే గాని, జ్ఞానము కాదని భాష్యమునందు స్పష్టముగా పేర్కొనబడినది.

ఇట్లు, చెప్పుటచేత తర్కము కూడ, మనోవృత్తిరూపమని చెప్పినట్లయినది. 'వ్యాప్యారోపేణ వ్యాపకారోపక స్తర్కః।' అని

తర్కమునకు లక్షణము. 'పర్వతో వహ్నిమాన్' అను అనుమితి స్థలమునందు 'యది వహ్నిర్న స్యాత్ తర్హి ధూమోఽపి న స్యాత్' పర్వతమునందు వ్యాప్యమగు వహ్న్యభావమును ఆరోపించి, ధూమాభావము అను వ్యాపకముయొక్క ప్రసంజనము (ఆపాదనము) చేయబడును. ఈ ధూమాభావాపాదనము ధూమము ప్రత్యక్షసిద్ధ మగుటచే ఇచ్ఛాధీనము. భ్రమ, ప్రమావిలక్షణము.

కనుకనే 'శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః' అను వాక్యమున, మనన నిదిధ్యాసములతో గూడిన వేదాన్తవాక్య విచార రూప మగు శ్రవణమునందు (మానస వృత్తి, క్రియ అగుటచే) విధి, ఉపపన్న మగుచున్నది. జ్ఞానమైనచో, విధి, ఉపపన్నము కాదు (న జ్ఞానే విధిః।). ఇచ్ఛ లేకపోయినను, ప్రమాణభూతము లగు ఇంద్రియములకు, విషయమునకు సన్నికర్ష కలిగినపుడు జ్ఞానము కలుగును. జ్ఞానము, అజ్ఞాననివర్తకము. క్రియారూపక మగు వృత్తి, ఇచ్ఛవలననే, కలుగును. కనుక, ఈ నామబ్రహ్మ ధ్యాసలు విధిగోచరములు. 'శ్రోతవ్యః' అనుచోట, 'శ్రవణ'మను పేరు గల వేదాంతవాక్యవిచారము మానసవృత్తి, క్రియ అగుట చేతనే శ్రవణవిధి అను వ్యవహారము కుదురుచున్నది. అట్లు కాక ఆ శ్రవణము జ్ఞానరూపమే అగుచో, విధ్యాభాస మగునే గాని, విధి కానేరదు. క్రియయందు విధిగాని, జ్ఞానమునందు విధి కుదరదు అని పర్యవసానము. మనన, నిదిధ్యాసనములతో గూడిన శ్రవణ మను పేరు గల వేదాన్తవాక్య విచారమునందు మానసక్రియ అగుటచేతనే, విధి ఉపపన్న మగుచున్నది.

'శవణ'మనగా, తర్కరూపము. ఆ తర్కము, దృక్ దృశ్య

అన్వయవ్యతిరేకము, సాక్షి సాక్ష్య అన్వయవ్యతిరేకము, ఆగమాయి తదవధి అన్వయవ్యతిరేకము, దుఃఖి పరమప్రేమాస్పద అన్వయవ్యతిరేకము అని నాలుగు విధములు. అనువృత్త వ్యావృత్త అన్వయవ్యతిరేక మను అయిదవ తర్కము కూడ, గలదు. ఇది, బ్రహ్మాత్మైక్యపర వేదాన్తానుగ్రాహక చతుర్లక్షణీ శారీరకమీమాంసాప్రతిపాదిత తర్కములకు అన్నింటికి ఉపలక్షణము అని ప్రామాణికులు అందురు. విస్తరమైతే, 'వేదాన్త కల్పలతిక' యందు చూడదగినది.

ఇచట, సంగ్రహముగా తర్కస్వరూపము చెప్పబడుచున్నది. తత్త్వమస్యాదివాక్యము బ్రహ్మాత్మైక్యపరము కాకపోయినచో, అపుడు, ఉపక్రమోపసంహారాదులచే అద్వైత బ్రహ్మబోధకమై ఉండెడిది కాదు. ఈ మొదలైన తర్కము శ్రవణము. వాక్యజన్య జ్ఞానము పరోక్షనిశ్చయ సంపాదక తర్కము. నిదిధ్యాసనము, అపరోక్షనిశ్చయత్వ సంపాదకతర్కము. దృక్దృశ్యాన్వయ వ్యతిరేక మనగా, దృగ్రూపమగు ఆత్మయందు దృశ్యములకు తాదాత్మ్యము. దృక్యందు కల్పితత్వమును దృశ్యములకు కల్పితత్వమును తెలియజేయుటవలన, వ్యతిరేకము. అనగా, దృశ్యాభావము సిద్ధించుచున్నది. అటులనే, సాక్షియందు సాక్ష్యములగు తద్వృత్తులకు తాదాత్మ్యముచే కల్పితత్వము, సాక్ష్యాభావము సాక్షి, సాక్ష్య అన్వయవ్యతిరేకము. ఉత్పత్తి వినాశములు గల పదార్థములు కొంతకాలమే ఉండి పోవునవి గనుక, ఆ పదార్థములకు అధిష్ఠానమగు ఆత్మ, అవధిభూతము. ఇది, ఆగమాపాయి తదవధి అన్వయవ్యతిరేకము. పరమ ప్రేమాస్పదమగు ఆత్మయందు 'అహం దుఃఖీ' అని దుఃఖతాదాత్మ్యము

అన్వయము. అది కల్పిత అహంకారగతము, ఆత్మయందు దుఃఖము లేకపోవుట, దుఃఖి పరమప్రేమాస్పద అన్వయవ్యతిరేకము. ఇదికాక, పుష్పమాలయందు దారము అనువృత్తము, పుష్పములు వ్యావృత్తములు. అట్లే, సద్రూపమగు ఆత్మయందు ఘట పటాదులు వ్యావృత్తములు, సద్రూపమగు ఆత్మ, అనువృత్తము. అనువృత్తమగు సూత్రము వ్యావృత్తములైన పుష్పములకంటె భిన్నమగు రీతిగా, వ్యావృత్తములగు ఘట, పటాదులకంటె అనువృత్తమగు సద్రూపమైన ఆత్మ, భిన్నము. ఇది అనువృత్త వ్యావృత్తాన్వయ వ్యతిరేకము, అనువృత్తమునందు వ్యావృత్తములు కల్పితములు, లేవు.

సిద్ధాన్తబిన్దుః

తదేవం సుషుప్త్యవస్థాయాం అస్తి ఆనందభోగః, తద్భోక్తా చ, సుషుప్త్యభిమానీ ప్రాజ్ఞః ఇత్యుచ్యతే। ప్రకర్షేణ అజ్ఞత్వాత్ తదానీం విశేషావచ్ఛేదాభావేన ప్రకృష్ట జ్ఞత్వాద్వా। తదా చ అన్తఃకరణస్య లయేఽపి తత్సంస్కారేణ అవచ్ఛేదాత్ న జీవాభావప్రసఙ్గః న వా సర్వజ్ఞాపత్తిః।

ఈశాభేద ప్రతిపాదనం చ శరీరేన్ద్రియాద్యభిమాన రహితత్వేన ఉపచారాత్। తత్సంస్కారస్య చ నిమిత్తకారణత్వేన సాక్ష్యాశ్రిత కార్యోపాదానకోటౌ అప్రవేశాత్, న తద్భేదేఽపి సాక్షిభేదః।

జాగరణే తు అన్తఃకరణస్య ప్రమాత్రాశ్రిత కార్యోపాదాన కోటౌ ప్రవేశాత్ తద్భేదేన ప్రమాతృభేద ఏవ। సాక్షిణ ఏవ చ అధికోపాధివిశిష్టస్య ప్రమాతృత్వాత్ న అనుసంధానానుపపత్తిరితి।

శ్లో॥ మాతృమానప్రభేదేఽపి ప్రతిదేహం న భిద్యతే।
సాక్షీ బాహ్యార్థవత్ యస్మాత్ స ఆత్మేత్యుచ్యతే తతః॥

శ్లో॥ వ్యభిచారో మిథో యద్వత్ ప్రమాత్రాదేః స్వసాక్షికః।
సర్వమాత్రాద్యభావార్థసాక్షిత్వాత్ న తథాఽఽత్మనః॥

ఇతి వార్తికకారపాదైః వ్యవహారదశాయామపి సాక్షిభేద నిరాకరణాత్ సుషుప్తౌ తద్భేదకల్పనం కేషాంచిత్ వ్యామోహ ఏవ ఇతి అవధేయమ్।

## భావదీపిక

కావున, ఈవిధముగా సుషుప్త్యవస్థయందు సుఖానుభవము కలదు. ఆ సుఖమును అనుభవించువాడు సుషుప్త్యవస్థాభిమాని, ప్రాజ్ఞుడని వ్యవహరింపబడును. ప్ర–ప్రకర్షేణ అజ్ఞః। సుషుప్తి సమయమున, ఘట పటాది విశేషజ్ఞానము తేనివాడు. లేదా, ప్రకర్షేణ జ్ఞః ప్రజ్ఞః. ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః, స్వార్థే అణ్'। ప్రకృష్ట జ్ఞానము కలవాడు. దుఃఖమునకు కారణమగు విశేషజ్ఞానము (ఘట, పటాది జ్ఞానము) లేకపోవుటవలన, 'ప్రాజ్ఞ' వ్యవహారము. సుషుప్తియందు అంతఃకరణము లయము చెందినను, ఆ అంతః కరణసంస్కారములు (అంతఃకరణముయొక్క సూక్ష్మావస్థ) ఉండుటవలన, జీవుడు లేకపోవుట అను ప్రసక్తి లేదు. ఈశ్వరునితో, 'సతా సౌమ్య తదా సంపన్నో భవతి' అను శ్రుతిచే పరమాత్మతో ఏకమైనను, సర్వజ్ఞత్వము జీవునకు లేదు. 'ప్రజాః అహరహః బ్రహ్మ గచ్ఛన్తి' అను ఈశ్వరాభేదప్రతిపాదనము శరీరేంద్రియాభిమానము లేకపోవుటచేత ఈశ్వరసాధర్మ్యముచే

ఈశ్వరవ్యవహారము ఔపచారికము (గౌణము). ముఖ్య ధర్మము కాదు.

అంతఃకరణ సంస్కారములు స్మృతికి కారణమైనవి, నిమిత్త కారణములైనందున, స్మృతికార్యోపాదానకోటిలో (అవిద్య యందు) ప్రవేశించనందువలన, సంస్కారభేదము ఉన్నను, సాక్షిభేదము లేదు. జాగరణమునందైతే, అంతఃకరణము ప్రమాతను ఆశ్రయించిన కార్యోపాదానకోటిలో చేరినందున, సంస్కారభేదముచేత ప్రమాతృభేదమే అంగీకరింపబడును. సాక్షియే, వృత్తితో గూడిన మనోవచ్ఛిన్నచిద్రూపుడై ప్రమాతృత్వము కలిగియున్నందువలన, పూర్వాపర ప్రతిసంధానమునకు, అవస్థాత్రయ ప్రతిసంధానమునకు అనుపపత్తి లేదు.

పూజ్యులగు వార్తికకారులు వ్యవహారదశయందే సాక్షి భేదమును నిరాకరించినారు. ప్రతి శరీరమున, ప్రమాత, ప్రమాణ భేదము ఉన్నను, బాహ్యార్థములకు వలె, సాక్షియగు ఆత్మకు భేదము లేదు. ప్రమాతలకు ఒకరు ఉన్నపుడు, మఱియొకరు లేక పోవుట ఆత్మసాక్షికము. సర్వప్రమాతలను, ప్రమాణములను వారు లేకపోవుటను ప్రకాశింపజేయు ఆత్మకు (సాక్షికి) భేదము లేదని చెప్పి ఉన్నారు.

ఇట్లు కాగా, కొందఱు సుషుప్తియందు సాక్షిభేదమును కల్పించుట వ్యామోహ మనియే తెలియవలయును.

సిద్ధాన్తబిన్దుః

నను, దుఃఖ మహ మస్వాప్సమితి కస్యచిత్ కదాచిత్

పరామర్శాత్ సుషుప్తౌ దుఃఖానుభవోఽపి అస్తు। న తదానీం దుఃఖ సామగ్రీ విరహేణ తదభావాత్। సుఖస్య చ ఆత్మస్వరూపత్వేన నిత్యత్వాత్। శయ్యాదేః అసమీచీనత్వేన చ దుఃఖమితి ఉపచారాత్। దుఃఖమ్ అహ మస్వాప్సమితి ప్రత్యయోపపత్తిః।

అథ వా, అవస్థాత్రయస్యాపి త్రైవిధ్యాఙ్గీకారాత్ సుషుప్తావపి దుఃఖ ముపపద్యతే। తథా హి। ప్రమాజ్ఞానం జాగ్రజ్జాగ్రత్। శుక్తి రజతాది విభ్రమః జాగ్రత్స్వప్నః। శ్రమాదినా స్తబ్ధీభావః జాగ్రత్సుషుప్తిః। ఏవం స్వప్నే మంత్రాదిప్రాప్తిః స్వప్న జాగ్రత్। స్వప్నేఽపి స్వప్నో మయా దృష్టః ఇతి బుద్ధిః స్వప్న స్వప్నః।జాగ్రద్దశాయాం కథయితుం న శక్యతే స్వప్నావస్థాయాం చ యత్కిఞ్చి దనుభూయతే స్వప్న సుషుప్తిః। ఏవం సుషుప్త్యవస్థాయామపి సాత్త్వికీ యా సుఖాకారా వృత్తిః సా సుషుప్తిజాగ్రత్। తదనన్తరం సుఖ మహ మస్వాప్సమితి పరామర్శః। తత్రైవ యా రాజసీ వృత్తిః సా సుషిప్తిస్వప్నః। తదనన్తర మేవ దుఃఖ మహ మస్వాప్సమ్ ఇతి పరామర్శోపపత్తిః। తత్రైవ యా తామసీ వృత్తిః సా సుషుప్తిసుషుప్తిః। తదనన్తరం గాఢం మూఢోఽహ మస్వాప్స మితి పరామర్శః। యథా చ ఏతత్ తథా వాసిష్ఠవార్తికామృతాదౌ స్పష్టమ్।

భా వ దీ పి క

ఓయీ! 'నేను దుఃఖముతో నిద్రపోయితిని' అని ఒకానొకనికి ఒకానొకప్పుడు జాగ్రత్కాలములో పరామర్శ (స్మరణ) కలదు

గనుక, సుషుప్తిదశయందు దుఃఖానుభవము గూడ, ఉండునా? అట్లు కాదు. అప్పుడు, దుఃఖమునకు కారణ సముదాయము లేనందున, సుషుప్తిలో దుఃఖము జనించదు. సుఖమైనచో, ఆత్మ స్వరూపమే గనుక, ఆత్మ, నిత్య మగుటచే ఆ సుఖము గూడ నిత్యమగుటవలన, సుషుప్తియందు సుఖమునకు కారణసామగ్రి యొక్క అపేక్ష లేదు. అయితే, 'ఈ రోజు నిద్ర బాగా పట్టలేదు, దుఃఖముతోనే గడచినది' అను ప్రత్యయము సుషుప్తియందు దుఃఖానుభవము వలన కాదు. మఱేమనగా, జాగ్రత్కాలమునందు శరీరాదులు సరిగా లేనందున, 'దుఃఖసాధన శయ్య యందు పరుంటిని' అనియే, ఆ దుఃఖ శబ్దార్థము. శయ్యయందు అసమీచీనత్వము దుఃఖముగా ఉపచారముచే వ్యవహరింపబడినది.

అథవా, మఱియొకవిధముగా సమాధానము చెప్పుచున్నాము. జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థాత్రయమునకు గూడ, ప్రత్యేకము త్రైవిధ్యమును అంగీకరించుటవలన, సుషుప్తియందు గూడ, దుఃఖము ఉపపన్న మగుచున్నది. ఈ విషయమే, ఉపపాదింప బడుచున్నది. ఇంద్రియాదులచేత (ప్రత్యక్షాది ప్రమాణముల చేత) కలుగు యథార్థ జ్ఞానము 'ఇది ఘటము' అను మొదలైనది 'జాగ్రత్ జాగ్రత్' అగును. జాగ్రదవస్థయందే, శుక్తియందు రజతాది భ్రాంతి 'జాగ్రత్స్వప్నము'. శ్రమాదులచే స్తబ్ధీభావము ('నేను' అను అహమాకారవృత్తి దక్క, ఇతర వృత్తులు లేక పోవుట) 'జాగ్రత్సుషుప్తి' అగును. ఇట్లే, స్వప్నమునందు కొందఱికి (సుకృతము చేసినవారికి) మంత్రోపదేశము (సాక్షాత్కారము) లభించును. అది, 'స్వప్నజాగ్రత్తు' అగును.

స్వప్నములో గూడ, మఱియొక స్వప్నము చూడబడినదను బుద్ధి, 'స్వప్నస్వప్నము'. 'స్వప్నావస్థలో ఏదియో, నాచేత అనుభవింపబడినది, కాని, 'ఇది' అని జాగ్రద్దశలో నేను చెప్పలేకున్నాను' అనునది 'స్వప్నసుషుప్తి'. ఇదేవిధముగా, సుషుప్తి దశయందును, సాత్త్వికసుఖాకారవృత్తి, 'సుషుప్తి జాగ్రత్తు' అగును. ఆ సుషుప్తి తరువాతనే, 'హాయిగా నిద్రపోయితి'నను పరామర్శ (స్మరణము) జాగ్రత్కాలమున, కలుగును. అట్లే, సుఖాకార రాజస వృత్తి సుషుప్తిస్వప్నము. దీని తరువాతనే, ఈ రోజు దుఃఖముతో (కలతతో) నిద్రపోయితి నను పరామర్శ, జాగ్రత్కాలమున, కలుగును. ఆ సుషుప్తియందే, తామసవృత్తి, 'సుషుప్తిసుషుప్తి'. దానితరువాత, ఈవేళ, నేను గాఢనిద్ర పోయితిని, ఏమియు, తెలియలేదు' అను పరామర్శ కలుగును.

ఈవిధముగా జాగ్రదాది అవస్థలందు ప్రత్యేకము మూడు అవస్థలు కలవు. ఈ విషయము వాసిష్ఠరామాయణముసందును, 'వార్తికామృతము' మొదలగు గ్రంథములందును విస్పష్టము.

## సిద్ధాన్తబిన్దుః

ఏవం అధ్యాత్మం విశ్వః, అధిభూతం విరాట్, అధిదైవం విష్ణుః। అధ్యాత్మం జాగ్రత్, అధిదైవం పాలనం, అధిభూతం సత్త్వగుణః, ఏవం అధ్యాత్మం తైజసః, అధిభూతం హిరణ్యగర్భః, అధిదైవం బ్రహ్మా। అధ్యాత్మం స్వప్నః, అధిదైవం సృష్టిః, అధిభూతం రజోగుణః, ఏవం అధ్యాత్మం ప్రాజ్ఞః అధిభూతం అవ్యాకృతం అధిదైవం రుద్రః। అధ్యాత్మం సుషుప్తిః,

అధిదైవం ప్రలయః అధిభూతం తమోగుణః। ఏవం అధ్యాత్మ అధిభూత అధిదైవానాం ఏకత్వాత్ ప్రణవావయవత్రయ సహితానాం ఉపహితానాం ఉపాసనయా హిరణ్యగర్భలోకప్రాప్తిః। అన్తఃకరణశుద్ధిద్వారా క్రమముక్తిశ్చ।ఏతత్సర్వోపాధినిరాకరణేన సాక్షిచైతన్యమాత్ర జ్ఞానేన తు సాక్షాదేవ మోక్షః ఇతి। తదేవం త్రయాణామపి అవస్థాత్రయ సహితానాంవిశ్వ తైజస ప్రాజ్ఞానాం అవిద్యాత్మకత్వాత్ దృశ్యత్వేన చ మిథ్యాత్వాత్ అనుపహితః కేవలః సాక్షీ తురీయాఖ్యః అహమస్మి ఇత్యర్థః। ఏవం వ్యవహారతః సర్వవ్యవస్థోపపత్తేః పరమార్థతః కస్యా అపి వ్యవస్థాయాః అభావాత్ న కాఽపి అనుపపత్తిః। విస్తరేణ చ ఏతత్ ప్రపఞ్చితం అస్మాభిః వేదాన్తకల్పలతికాయా మితి ఉపరమ్యతే॥ ॥౧॥

భావదీపిక

ఇదేవిధముగా, అధ్యాత్మ, అధిదైవ, అధిభూత, విభాగముతో విశ్వ, తైజస, ప్రాజ్ఞ వ్యష్టి జీవరూపములు, అవ్యాకృతాది విరాట్, హిరణ్యగర్భ, రుద్రాది అవ్యాకృత సమష్టి జీవరూపములు, ప్రణవావయవములైన అకార, ఉకార, మకారములతో ఐక్యోపాసన చేత హిరణ్యగర్భలోకప్రాప్తి, అంతఃకరణశుద్ధిద్వారా క్రమముక్తియు కలుగుచున్నవి. సర్వోపాధినిరాకరణము చేసి సాక్షి చైతన్యమాత్రజ్ఞానముతో సాక్షాత్తుగానే, మోక్షము లభించును. వివరణ ఇవ్వబడుచున్నది.

అధ్యాత్మము, స్థూల శరీరమును అభిమానించుకొని ఉన్నవాడు విశ్వుడు. అధిభూతము స్థూల భూతములను అభిమానించుకొని

ఉన్నవాడు విరాట్. అధిదైవము స్థూల వ్యష్టి సమష్టి అభిమాని దేవతారూపము విష్ణువు. అధ్యాత్మము జాగ్రత్తు, అధిదైవము పాలనము, అధిభూతము సత్త్వగుణము. ఇట్లే, అధ్యాత్మము తైజసుడు, అధిభూతము హిరణ్యగర్భుడు, అధిదైవము బ్రహ్మ. అధ్యాత్మము స్వప్నము, అధిదైవము సృష్టి, అధిభూతము రజోగుణము. ఇట్లే, అధ్యాత్మము ప్రాజ్ఞుడు, అధిభూతము అవ్యాకృతము, అధిదైవము రుద్రుడు, అధ్యాత్మము సుషుప్తి, అధిదైవము ప్రలయము, అధిభూతము తమోగుణము.

ఈ విధముగా అవస్థాత్రయముతో గూడిన విశ్వ, తైజస, ప్రాజ్ఞులు, అవిద్యాత్మకులు, అవిద్యాదశలోనివారగుట వలన, దృశ్యత్వ హేతువుచే మిథ్యాత్వము కలవారు. ఉపాధిరహితమగు కేవల సాక్షి, తురీయ ఆత్మస్వరూపుడను నేను అయి ఉన్నానని అర్థము. ఈ విధముగా వ్యవహారదశలో సర్వ వ్యవహారములకు ఉపపత్తి ఉండుటవలన, వ్యవస్థకు భంగము లేదు. పరమార్థమున, అవిద్యయే, లేదు గనుక, అవిద్యాదశలోని అవస్థాత్రయము లేదు. కావున, పరమార్థస్వరూపమునందు ఏ వ్యవస్థయును, లేదు కావున, ఆత్మైకత్వ దర్శనమునందు, అనుపపత్తి ఏదియు లేదు. ఈ విషయము 'వేదాంతకల్పలతిక' యను గ్రంథమునందు మాచే విస్తరముగా వివరింపబడినదని ఇంతటితో విరమింపబడుచున్నది. ॥౮॥

'దశశ్లోకి' యందలి అష్టమ శ్లోకమునకు
భావదీపికాఖ్య
ఆంధ్ర వివరణము సమాప్తము.



## శ్లో. ౯ అపి వ్యాపకత్వాత్ హితత్వప్రయోగాత్....

### సిద్ధాన్తబిన్దుః

ననుౕ జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థాసహితానాం త్రయాణా మపి తదభిమానినాం మిథ్యాత్వాత్ తత్సాక్షిణోఽపి మిథ్యాత్వం స్యాత్, అవిశేషాత్ ఇత్యాశఙ్క్య విశేషాభిధానేన సాక్షిణః సత్యత్వ మాహ ।

శ్లో॥ అపి వ్యాపకత్వాత్ హితత్వ ప్రయోగాత్
స్వతఃసిద్ధభావాత్ అనన్యాశ్రయత్వాత్ ।
జగత్తుచ్ఛ మేతత్ సమస్తం తదన్యత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥౯॥

న దృష్టేః ద్రష్టారం పశ్యేః ఇతి సాక్షిణం ప్రకృత్య 'అతోఽన్యదార్తమ్' ఇతి శ్రుతేః సాక్షిణః అన్యత్సాక్ష్యం సర్వం జగత్ తుచ్ఛమ్। న తు సాక్షీ బాధావధిత్వాత్, భ్రమాధిష్ఠానతయా జ్ఞాతత్వాచ్చ, తద్బాధగ్రాహకాభావాచ్చ ఇత్యాది అనుక్త సముచ్చయార్థః అపి శబ్దః । అథ 'యదల్పం తన్మర్త్యమ్' ఇతి శ్రుతేః పరిచ్ఛిన్నత్వ తుచ్ఛత్వయోః సమవ్యాప్తత్వాత్ పరిచ్ఛిన్నత్వ తుచ్ఛత్వ నివృత్తిరిత్యాహ। వ్యాపకత్వాదితి।

### భావదీపిక

ఓయీ! జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలతో కూడుకొనిన తదభిమానులగు విశ్వ, తైజస, ప్రాజ్ఞులకు ముప్వురికి మిథ్యాత్వము వలన, వారిని వారి అవస్థలను భాసింపజేయు సాక్షికి గూడ,

మిథ్యాత్వము వచ్చును గదా! మిథ్యాత్వమునకు ప్రయోజకమగు అవిద్యకత్వము సాక్షియందు గూడ, సమానమే కదా! అని ఆశంకించి, విశేషమును తెలుపుటచే సాక్షికి సత్యత్వమును 'అపి వ్యాపకత్వాత్' అను శ్లోకముచేత చెప్పుచున్నారు.

ఇచట, 'అపి'శబ్దము అనుక్తసముచ్చాయకము. శ్లోకములో చెప్పని హేతువులను గూడ, చేర్చుకొనవలెనని సూచించును. ముందు, శ్రుతిప్రమాణము ఉదాహరింపబడుచున్నది. 'నదృష్టే ర్ద్రష్టారం పశ్యేః' దృష్టికి ద్రష్ట యగు నిత్య దృగ్రూపుడైన సాక్షిని చూడలేవు అని సాక్షిని ప్రకృతముగా జేసికొని, 'అతోఽన్యదార్తమ్' ఈ సాక్షికంటె భిన్నమైనది నశించునది, అను శ్రుతి వలన,సాక్షికంటె అన్యమగు సాక్ష్యము సాక్షిచే భాసించు సర్వ జగత్తు, తుచ్ఛము (మిథ్య). సాక్షి, మిథ్యాభూతుడు కాడు, సత్యమైనవాడు అని తెలియుచున్నది. సాక్షిసత్యత్వమున, యుక్తి చెప్పబడుచున్నది. ప్రపంచబాధకు అవధిభూతుడై మిగిలి ఉన్నవాడగుటచేతను, జగత్తుయొక్క భ్రమకు అధిష్ఠానముగా తెలియదగినవాడగుటచేతను (తెలిసికొనదగినవాడగుటచేతను) బాధ, భ్రమల సిద్ధి కొఱకు ప్రకాశకుడగు సాక్షిని సత్యముగా అంగీకరించవలెను. మఱియు, సాక్షియొక్క బాధను గ్రహించు వాడు లేకపోవుటవలనను, సాక్షికి సత్యత్వము సిద్ధించుచున్నది. 'అథ యదల్పం తన్మర్త్యమ్' అను శ్రుతివలన, పరిచ్ఛిన్నమగు వస్తువు నశించును అను శ్రుతివలన, 'యత్ర యత్ర పరిచ్ఛిన్నత్వం తత్ర తత్ర తుచ్ఛత్వమ్' సమవ్యాప్తములగుటచే సాక్షియందు, వ్యాపకత్వము వలన, పరిచ్ఛిన్నత్వము లేదు, తుచ్ఛత్వము

(మిథ్యాత్వము, వినాశిత్వము) లేదని చెప్పుచున్నారు.

సిద్ధాన్తబిన్దుః

సర్వం ఖల్విదం బ్రహ్మేతి సర్వాత్మత్వోపదేశేన దేశకాల అపరిచ్ఛిన్నత్వాత్ ఆకాశాదీనాం చ దేశకాలపరిచ్ఛిన్నత్వేఽపి ఆపేక్షికమహత్త్వేన వ్యాపకత్వోపచారాత్।

నను, సర్వవ్యాపకత్వేన నిత్యత్వాత్ భావరూపత్వాచ్చ ఆత్మా న దుఃఖనివృత్తిరూపః, నాపి సుఖరూపః। సుఖస్య అనిత్యత్వేన నిత్య ఆత్మస్వరూపత్వానుపపత్తేః। తథా చ ఆత్మ స్వరూపో మోక్షః అపురుషార్థ ఏవ ఇత్యాశఙ్క్య నేత్యాహ। హితత్వ ప్రయోగాదితి। హితత్వం పురుషార్థమ్। 'తదేతత్ ప్రేయః పుత్రాత్, ప్రేయో విత్తాత్, ప్రేయో అన్యస్మాత్ సర్వస్మాత్, అన్తరతరం యదయమాత్మా' ఇతి। 'యో వై భూమా తత్సుఖమ్' 'ఏష పరమానన్దః', 'ఏష హ్యేవ ఆనందయాతి', 'విజ్ఞాన మానన్దం బ్రహ్మ' ఇత్యాదిభిః శ్రుతిభిః తస్య పరమానన్దరూపత్వోపదేశాత్।

భావదీపిక

'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను శ్రుతి, బ్రహ్మకు సర్వాత్మత్వమును ఉపదేశించుటచేత బ్రహ్మ (ఆత్మ), దేశ, కాల పరిచ్ఛేదము లేనిది. అనగా, సర్వదేశములందు, సర్వకాలము లందును, ఉండునది. ఆకాశాదులు దేశ, కాలపరిచ్ఛేదము లేనివని కొందఱు, భావించినను, 'ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః' మొదలగు శ్రుతులందు వ్యాపకత్వమును వ్యవహరించినను, ఆ ఆకాశాదులకు ఆపేక్షికమహత్త్వముచే వ్యాపకత్వము గౌణముగా

వ్యవహరించబడినదే గాని, వాస్తవముగా ఆకాశాదులు కూడ, దేశ, కాల పరిచ్ఛిన్నములే అయి ఉన్నవి. కనుక, ఆత్మవస్తువు, ఒక్కటియే, సర్వవ్యాపకమైనది. ఓయీ! ఆత్మ, సర్వవ్యాపక మగుటచే నిత్యమని చెప్పుచున్నావు. అది, భావరూపము (భావ పదార్థము), దుఃఖనివృత్తిరూపము (అభావము) కాదు. అట్లే, ఆత్మ, సుఖరూపము కూడ, కాదు. సుఖము అనిత్యముగా లోక ప్రసిద్ధము. అది, నిత్య ఆత్మ స్వరూపము కాదు. మీరు మోక్షము ఆత్మస్వరూపమని అనుచున్నారు. పురుషార్థము దుఃఖనివృత్తి, సుఖములే కదా! ఆత్మ, దుఃఖనివృత్తి, సుఖరూపము కానపుడు, ఆత్మస్వరూపమగు మోక్షము పురుషార్థమే కాదు. అనగా, ఎవ్వరును కోరుకొనరు అని ఆశంకించి, అట్లు కాదు 'హితత్వ ప్రయోగాత్' అని చెప్పుచున్నారు. హితత్వము అనగా, పురుషార్థత్వము. ఈ ఆత్మ, పుత్రునికంటె ప్రేమాస్పదమైనది, ప్రియతమమైనది. అపరిచ్ఛిన్నమైన ఏ భూమ (బ్రహ్మ)కలదో,సుఖస్వరూపమైనది. ఇది, పరమానందస్వరూపము. ఈ బ్రహ్మయే, ప్రాణులకు ఆనందమును కూర్చును. బ్రహ్మ, విజ్ఞానస్వరూపము, ఆనంద స్వరూపము అను శ్రుతులచే ఆత్మ, శ్రుతులయందు పరమానంద స్వరూపముగా ఉపదేశింపబడెను.

## సిద్ధాన్తబిన్దుః

తస్య చ నిత్యత్వేఽపి లోకే ధర్మజన్య తదన్తఃకరణవృత్తి వ్యఙ్గ్యతయా తదుత్పత్తివినాశోపచారః। అజ్ఞానవ్యవహితస్య చ తస్య అప్రాప్తస్యైవ జ్ఞానమాత్రాత్। అవిద్యానివృత్త్యా ప్రాప్తిరివ

భవతీతి తదుద్దేశేన ముముక్షుప్రవృత్త్యుపపత్తిః। అధ్యస్తస్య ప్రపఞ్చస్య దుఃఖరూపస్య అధిష్ఠానత్వాత్ స ఏవ అభావ ఇతి దుఃఖాభావరూపత్వేనాపి తస్య పురుషార్థతా।

నను, మోక్షే సుఖం సంవేద్యతే వా,న వా? నాద్యః। తదానీం దేహేంద్రియాద్యభావేన తద్వ్యఞ్జకాభావాత్। వ్యఞ్జకాభావేఽపి తత్సంవేదనాభ్యుపగమే సంసారదశాయామపి తథా ప్రసఙ్గాత్। న ద్వితీయః। అపురుషార్థతాపత్తేః। జ్ఞాయమానస్యైవ తస్య పురుషార్థత్వాత్। అత ఏవ శర్కరా తద్భోజినోరివ వైష్ణవం మన్యానాం ఉద్గార ఇతి చేత్, నేత్యాహ। స్వతస్సిద్ధభావాదితి। స్వప్రకాశజ్ఞానరూపత్వాదిత్యర్థః।

భావదీపిక

ఆత్మ, సుఖస్వరూపము, నిత్యము అయినను, లోకము నందు పుణ్యము వలన, కలిగిన అంతఃకరణవృత్తిచే ఆ స్వరూప సుఖము అభివ్యక్త మగుటవలన, అభివ్యంజకమగు అంతఃకరణ వృత్తియొక్క ఉత్పత్తిచే అభివ్యఙ్గ్యమగు (అభివ్యక్తమగు) ఆత్మ స్వరూప సుఖముయొక్క ఉత్పత్తివ్యవహారము. ఇట్లే, పుణ్యాధీన మైన అంతఃకరణవృత్తియొక్క నాశముచే ఆత్మసుఖమునందు వినాశవ్యవహారము ఔపచారికము. ఆత్మస్వరూపసుఖము ప్రాప్తమై యున్నను, అజ్ఞాన మను ఆవరణవలన, వ్యవహితమైనందున, అప్రాప్తమువంటిది కాగా, కేవల జ్ఞానముచేత అవిద్యానివృత్తి వలన, పొందబడినట్లు అగుచున్నది. కావున, ముముక్షుజనము నకు మోక్షమును ఉద్దేశించి, ప్రవృత్తి, ఉపపన్న మగుచున్నది.

ఇట్లే, ఆత్మయందు, అధ్యస్తమగు ప్రపంచము దుఃఖరూపము గనుక, దానికి అధిష్ఠానమగు పరమానందస్వరూప ఆత్మ, ప్రపఞ్చాభావ, దుఃఖాభావరూపు డగుచున్నాడు. అందుచేత ఆత్మ, దుఃఖాభావరూపముచే గూడ, పురుషార్థ మగుచున్నాడు.

ఓయీ! మోక్షమునందు సుఖము అనుభవించబడునా, లేదా, మొదటి పక్షము యుక్తము కాదు. అపుడు, శరీరము, ఇంద్రియములు లేవు గనుక, సుఖానుభవమునకు వ్యంజ్యకములు లేవు. వ్యంజకము లేకపోయినను, సుఖానుభవమును అంగీకరించినచో, సంసారదశయందు (విద్య లేకపోయినను), మోక్ష ప్రసంగము కలుగును. మోక్షమునందు సుఖము అనుభవింపబడదను రెండవ పక్షమునందు, ఆ అజ్ఞాయమానమైన సుఖము పురుషార్థమే కాదు. జ్ఞాయమానమైన సుఖమే, పురుషార్థము. కనుకనే, శర్కర, తద్భోక్తలకు వలె అని వైష్ణవులమని అనుకొను వారు పలుకుచుందురు. శర్కర (పంచదార) మధురస్వరూపమే గాని, దానికి సుఖము తెలియదు. సకల కళ్యాణగుణవిశిష్టుడగు విష్ణువు, నాచేత సేవింపబడువాడని సేవించునట్టి భక్తునకే, మోక్షము (బ్రహ్మభావము), మోక్షము కాదు అని అనినచో, అట్లు కాదు. 'స్వతఃసిద్ధభావాత్' ఆనందస్వరూపుడే గాక, స్వప్రకాశ జ్ఞాన స్వరూపుడు గూడ, అగుటవలన, స్వరూపప్రకాశముతో ఆనందానుభవము ఉండుటచే బ్రహ్మభావము, మోక్షము అగుచున్నది.

సిద్ధాన్తబిన్దుః

యద్యపి సంసారదశాయాం అవిద్యావృతస్వరూపత్వాత్

ఆత్మా పరమానన్దరూపతయా న ప్రథతి। తథాఽపి తత్త్వవిద్యయా అవిద్యానివృత్తౌ స్వప్రకాశతయా స్వయమేవ పరమానన్దతయా ప్రకాశత ఇతి న వ్యఞ్జకాపేక్షా। నను, సుఖస్య స్వప్రకాశజ్ఞాన రూపత్వేఽపి న ఆత్మరూపతా। జ్ఞానస్య ధాత్వర్థరూపతయా క్రియాత్వేన సాశ్రయత్వాత్। జానామీతి ప్రతీతిః। జ్ఞానం అహమస్మీతి అప్రతీతేశ్చ।

తథా చ, కథం అద్వైతవాదః? ఇత్యాశఙ్క్య, నేత్యాహ। అనన్యాశ్రయత్వాదితి। 'యత్సాక్షా దపరోక్షాద్బ్రహ్మ', 'అయమాత్మా సర్వాన్తరః', 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ', 'విజ్ఞాన మానన్దం బ్రహ్మ' ఇతి శ్రుతేః స్వప్రకాశజ్ఞానానన్దరూప ఏవ ఆత్మా। అన్తఃకరణాది ఉపాధితాదాత్మ్యాధ్యాసో న చ తద్వృత్తౌ జ్ఞానాధ్యాసాత్ జానామీతి తదాశ్రయత్వప్రతీతిః। ధాత్వర్థత్వం ఉత్పత్తి వినాశవత్త్వం చ అన్తఃకరణవృత్తేరేవ ఇతి జ్ఞప్తిరూప ముఖ్యజ్ఞానస్య సర్వాధిష్ఠానత్వేన అన్యాశ్రయత్వాభావాత్ న ద్వైతాపత్తిః। తేన జ్ఞానసుఖాత్మకః ఆత్మా సత్యః। తద్భిన్నం చ సర్వం జగత్ అసత్యమితి సిద్ధమ్ ॥ ౯ ॥

## భావదీపిక

విచారించగా, సంసారదశయందు ఆత్మ, అవిద్యావృత స్వరూపుడు గనుక, ఆత్మయొక్క పరమానందరూపము ప్రకాశించదు. అట్లైనను, తత్త్వవిద్యచేత అవిద్యానివృత్తి కలుగగా, ఆత్మ, స్వప్రకాశుడు గనుక, ఆ ప్రకాశముచేతనే, తాను, స్వయముగానే (వృత్తియొక్క అపేక్ష లేకయే) పరమానంద

స్వరూపముతో, ప్రకాశించును. కావున, మోక్షదశయందు ఆనందానుభవమునకు వ్యంజక వృత్తియొక్క అపేక్ష లేదు.

ఓయీ ! సుఖము స్వప్రకాశజ్ఞానరూపమైనను, ఆత్మ రూపము కాదు. జ్ఞానము 'జ్ఞ అవగమనే' అను ధాతువుయొక్క అర్థ మగుటచే క్రియ అగుటవలన, ఆశ్రయమును అపేక్షించును. లోకమునందు గూడ, 'జానామి' (జ్ఞానమునకు ఆశ్రయుడను) అను ప్రతీతియే, కలదు. 'జ్ఞానం అహమస్మి' నేను జ్ఞానము అగుచున్నాను అనెడి ప్రతీతి లేదు. దీనినిబట్టి, జ్ఞానము, ఆశ్రయము. రెంటిని అనుభవములో అంగీకరించవలసియున్నది. అందువలన, అద్వైతవాదము ఎట్లు కుదురును ? అని ఆశంకించి, అట్లు కాదు. అని 'అనన్యాశ్రయత్వాత్' అను హేతువును చూపుచున్నారు. బ్రహ్మ, సాక్షాదపరోక్షము. ఈ ఆత్మ, సర్వమునకు ఆంతరము. బ్రహ్మ, సత్యము (త్రికాలాబాధ్యము), జ్ఞానస్వరూపము, దేశ, కాల, వస్తుపరిచ్ఛేదరహితము. బ్రహ్మ,విజ్ఞానస్వరూపము, ఆనంద స్వరూపము అను అర్థము గల శ్రుతులవలన, ఆత్మ, స్వప్రకాశ జ్ఞానానందస్వరూపుడే. ఆ ఆత్మకు అంతఃకరణము అను ఉపాధితో తాదాత్మ్యాధ్యాసచేత అంతఃకరణపరిణామ మగు విషయాకారవృత్తి యందు జ్ఞానము అను వ్యవహారము ఔపచారికముగా చేసి 'జానామి' అంతఃకరణ తాదాత్మ్యావచ్ఛిన్నమైన ఆత్మనగు నేను వృత్తిరూపమైన ఔపచారిక జ్ఞానమునకు ఆశ్రయుడను అని ప్రతీతి కలుగుచున్నది. ఈ వృత్తిరూపజ్ఞానమే, 'జానామి' అనుచోట, 'జ్ఞ' ధాతువునకు అర్థము. ఈ వృత్తిరూప జ్ఞానమునకు ఉత్పత్తి వినాశములు కలవు. చిద్రూపమగు ముఖ్యజ్ఞానమునకు (ఆత్మకు)

సర్వాధిష్ఠానత్వము చేత తానే, సర్వ జగత్తునకు ఆశ్రయము అగుచున్నది. ఆత్మకు మఱియొక ఆశ్రయము లేదు. అధిష్ఠానమగు ఈ ఆత్మయందు సర్వజగత్తు, అధ్యస్తము గాన, ఆత్మ, ఒక్కటే వస్తువగుటచే జగత్తుచేత ద్వైతముయొక్క ప్రసంగము (ద్వైతాపత్తి) లేదు. అందుచేత జ్ఞానసుఖాత్మకుడగు ఆత్మ, సత్యమైనవాడు. ఆత్మభిన్నమగు సమస్త జగత్తు, అసత్యమని సిద్ధించినది. ॥ ౯ ॥

'దశశ్లోకి' యందలి నవమ శ్లోకమునకు

భావదీపికాఖ్య

ఆంధ్ర వివరణము సమాప్తము.



## శ్లో. ౧౦ న చైకం తద్వత్ ద్వితీయం కుతః స్యాత్....

సిద్ధాన్తబిన్దుః

నను, సర్వస్య జగతః తుచ్ఛత్వే తన్నిషేధేన ఆత్మతత్త్వ ప్రతిపత్తిః న స్యాత్। న హి శశవిషాణం నిషిధ్యతే। క్వచిత్ ప్రమితిం, క్వచిత్ నిషిధ్యతే ఇతి న్యాయాత్। తథా చ, నిషేధ అనుపపత్త్యైవ న జగతః తుచ్ఛత్వమ్ ఇతి। నేత్యాహ।

శ్లో॥ న చైకం తదన్యత్ ద్వితీయం కుతః స్యాత్
న వా కేవలత్వం న చాకేవలత్వమ్।
న శూన్యం న చాశూన్య మద్వైతకత్వాత్
కథం సర్వవేదాన్తసిద్ధం బ్రవీమి॥ ౧౦

ఏకత్వసంఖ్యాయోగి ఏకత్వమ్। తదపేక్షాబుద్ధిజన్య ద్విత్వ సంఖ్యాయోగి ద్వితీయమ్। తతః ఏకాభావే ద్వితీయం కుతః స్యాత్? ద్వితీయం చ తృతీయాదీనామపి ఉపలక్షణమ్। నను, ఏకమేవాద్వితీయమితి శ్రుత్యా ఏకత్వం ప్రతిపాద్యతే। నేత్యాహ। న వా కేవలత్వమితి। కేవలత్వం ఏకత్వమ్। తస్య అవిద్యకత్వాత్। యది ఆత్మనః ఏకత్వం శ్రుత్యా న ప్రతిపాద్యతే తర్హి, ప్రత్యక్షాది ప్రమాణవశాత్ అనేకత్వమేవ స్యాత్ ఇతి చేత్, నేత్యాహ। నచాకేవలత్వమితి। అకేవలత్వం అనేకత్వమ్। 'నేహ నానాఽస్తి కిఞ్చన', 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ', 'అథాత ఆదేశో నేతి నేతి' ఇత్యాది శ్రుతిభ్యః।

## భావదీపిక

ఓయీ! ఆత్మవస్తువు ఒక్కటే సత్యము, సమస్తమైన జగత్తు అసత్యము, మిథ్యాభూతము, లేనేలేదు (అసత్) అని పలుకుచున్నావు. జగత్తే, తుచ్ఛమైనచో, ఆ జగత్తును నిషేధించుట వలన, ఆత్మతత్త్వజ్ఞానము కలుగనేరదు. శశవిషాణము (కుందేటికొమ్ము) లేదు (శశశృంగం నాస్తి) అని ఎవరును, నిషేధించరు. ఒకచోట, యథార్థజ్ఞానమునకు విషయమైన వస్తువు, ఘటాదులు, మఱియొక ప్రదేశమునందు నిషేధింపబడుచున్నవి. ఇది, న్యాయము. మఱియొకచోట, నిషేధింపబడినను, ఒకచోట నిషేధింపబడు వస్తువు, సత్యమై ఉండవలెను గదా! కనుక, ప్రపంచమే లేనిచో, ప్రపంచనిషేధము కుదరదు. కావున, జగత్తు, అసత్యము కాదు. కావున, ద్వైతమే, తప్పక అంగీకరించవలసి వచ్చుచున్నదని అనినచో, అట్లు కాదు అని 'న చైకమ్' అను శ్లోకముతో చెప్పుచున్నారు.

ఏకమ్- ఏకత్వసంఖ్య గల వస్తువు. న చ=లేదు. ఏకత్వ సంఖ్య, గుణము. దానికి ఆశ్రయము ద్రవ్యము. గుణ, గుణి భావము ఉన్నప్పుడే ఏకమని వ్యవహారము. ఆత్మ, నిర్ధర్మకము. గుణ గుణిభావము లేనిది. ఏకత్వసంఖ్య గూడ, అవిద్యాకల్పిత పదార్థము. ఆత్మయందు అవిద్యాకల్పితమగు ఈ ఏకత్వగుణము లేదు. కనుక, ఆత్మ, ఏకత్వసంఖ్య కలది కాదు. 'తదన్యత్ ద్వితీయమ్'=ఏకముకంటె భిన్నమైనది రెండవది. 'అయమేకః, అయమేకః' ఇది ఒక్కటి, ఇది ఒక్కటి అను అపేక్షాబుద్ధిచే ద్విత్వమన్న సంఖ్య జనించును. ద్విత్వ సంఖ్య కలది

ద్వితీయము. ఏకత్వసంఖ్యయే కల్పితమైనప్పుడు, ద్విత్వసంఖ్య కలది సత్యముగా ఎచ్చటనుండి వచ్చును? 'రెండు, ఒకటి మూడు' అన్నట్లుగా తృతీయ చతుర్థాదులు గూడ, లేవని ఉప లక్షణముగా తెలిసికొనవలెను.

ఓయీ! 'ఏకమేవాద్వితీయమ్' అను శ్రుతి, ఏకత్వమును ప్రతిపాదించుచున్నది గదా! అనినచో, అట్లు కాదు. 'న వా కేవలత్వమ్' కెవలత్వ మనగా, ఏకత్వము. ఆ ఏకత్వము అవిద్యా కల్పితములైనవానిలోనిది, ఆత్మను స్పృశించదు. శ్రుతి, ఆత్మకు ఏకత్వమును ప్రతిపాదించనిచో, ప్రత్యక్షాదిప్రమాణముల వలన, అనేకత్వమును అంగీకరించవలసివచ్చును అనినచో, అట్లు కాదు. 'న చాకేవలత్వమ్' అకేపలత్వ మనగా, అనేకత్వము, న చ = లేదు. 'నేహ నానాఽస్తి కిఞ్చన' ఈ బ్రహ్మయందు ఈషణ్మాత్ర మైనను, భేదము లేదు. ఆత్మభిన్నమగు వస్తువు లేదు. 'ఏక మేవాద్వితీయం బ్రహ్మ' బ్రహ్మ, సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితము. 'అథాత ఆదేశః నేతి నేతి' ఇకమీదట, ఆదేశము. అనగా,అజ్ఞాతార్థజ్ఞాపనము చేయబడుచున్నది. నేతి నేతి=ఇదం న, ఇదం న=ఇది కాదు, ఇది కాదు - ఈ మొదలగు శ్రుతులవలన మూర్తము కాదు, అమూర్తము కాదు.

## సిద్ధాన్తబిన్దుః

తర్హి, సర్వప్రతిషేధాత్ శూన్యమేవ స్యాత్ ఇతి। నేత్యహ। న శూన్యమితి। 'అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేద చేత్,

అస్తి బ్రహ్మేతి చేద్ వేద, సన్తమేనం తతో విదురితి', 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ', 'సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్' ఇత్యుపక్రమ్య 'ఐతదాత్మ్య మిదం సర్వమ్, తత్ సత్యం, స ఆత్మా, తత్త్వమసి' ఇత్యాది శ్రుతిభిః సత్యత్వ ప్రతిపాదనాత్। సర్వభ్రమాధిష్ఠానత్వాత్ సర్వబాధావధిత్వాచ్చ। తర్హి సత్యత్వ జ్ఞానత్వాది ధర్మవదపి స్యాత్। నేత్యాహ। న చ అశూన్యమితి। ఏకం అద్వితీయ మితి పదద్వయేన సర్వభేద ప్రతిషేధేఽపి ఏవకారేణ ధర్మిధర్మభావాది భేదప్రతిషేధాత్। సర్వత్ర హేతుమాహ। అద్వైతకత్వాదితి। ద్విధా ఇతం ద్వీతమ్। తస్య భావః ద్వైతమ్। తదుక్తం వార్తికే-

"ద్విధేతం ద్వీతమిత్యాహుః తద్భావో ద్వైత ముచ్యతే।" ఇతి। న విద్యతే ద్వైతం ద్విధాభావః యత్ర తత్ అద్వైతమితి అక్షరార్థః। 'సలిల ఏకో ద్రష్టా అద్వైతః' ఇతి శ్రుతేః। ప్రతియోగి జ్ఞానస్యైవ అభావబుద్ధౌ కారణత్వాత్ ద్వైతస్య అనిర్వచనీయ త్వాఙ్గీకారేణ ప్రత్యక్షాది వేద్యత్వాత్ నిషేధోపపత్తిః ఇత్యర్థః।

### భావదీపిక

అట్లయినచో, సర్వప్రతిషేధము వలన, శూన్యమే తత్త్వముగా అంగీకరించినట్లగును అనినచో, అట్లు కాదు. 'న శూన్యమ్, 'అసన్నేవ స భవతి' అను శ్రుతి, బ్రహ్మకు సత్యత్వ మును ప్రతిపాదించుచున్నది. బ్రహ్మ, లేదు అని తెలిసికొనినచో, వాడు, లేనివాడే అగును. బ్రహ్మ, ఉన్నది అని తెలిసికొనినచో, అతడు, ఉన్నవాడగును అని విజ్ఞులు తెలిసికొనుచున్నారు (తలంచుచున్నారు). బ్రహ్మనుండియే, జీవులు వహ్నివిస్ఫులింగ

న్యాయముచే వచ్చినవారు గనుక, బ్రహ్మ లేకపోయినచో, జీవులకు అస్తిత్వమే లేదని భావము. బ్రహ్మ, సత్యము, జ్ఞానము, అనంతము. ఈ జగత్తు సృష్టికి పూర్వము, సద్రూపమగు బ్రహ్మ గానే ఉండెను అని మొదలుపెట్టి, ఈ జగత్తు అంతయు, ఆ సద్వస్తు స్వరూపమే, అది సత్యము, అదియే ఆత్మ. నీవు ఆత్మ స్వరూపుడవు - ఈ మొదలగు శ్రుతులు ఆత్మకు సత్యత్వమును ప్రతిపాదించుటవలనను, సర్వజగద్భ్రమకు అధిష్ఠానమగుట వలనను, సర్వజగత్తునకు నాశమేర్పడినను, మిగిలి ఉండునది అగుటవలనను, ఆత్మ, శూన్యము కాదు. అట్లయినచో, ఆత్మకు సత్యత్వ, జ్ఞానత్వాది ధర్మములు అంగీకరించినట్లయినది గదా అనినచో, అట్లు కాదు. 'న చాశూన్యమ్', 'ఏకం అద్వితీయమ్' అను రెండు పదములచేత సజాతీయభేదము, విజాతీయభేదము నిరాకరింపబడినది. 'ఏవ'కారముచేత ధర్మ ధర్మి భావరూపమగు భేదము గూడ, నిషేధింపబడుచున్నది. దీనికి కారణమును చెప్పుచున్నారు - 'అద్వైతకత్వాత్' అని. ద్విధా = రెండు విధములుగా, ఇతం=అయినది 'ద్వీతం' అని చెప్పబడును. 'తస్య భావః ద్వైతమ్' దాని ధర్మము ద్వైతము. బ్రహ్మకు ఘటాదిరూప ఆరోప్యప్రకారము, ఆ ఘటాదులతో అధిష్ఠానమునకు సంసర్గము అనగా, సంబంధము - ఈ రెండును 'ద్వైతమ్' అని చెప్పబడును. వార్తికమునందు,

"ద్విధా ఇతం ద్వీతమిత్యాహుః తద్భావో ద్వైత ముచ్యతే।" అని ఇట్లే చెప్పబడినది. "న విద్యతే ద్వైతం ద్విధాభావః యత్ర తత్ అద్వైతమ్" ఏ బ్రహ్మయందు ఈ ప్రకారద్వయము లేదో,

ఆ బ్రహ్మ, అద్వైతము. ఇది, 'అద్వైత' మను శబ్దము యొక్క అక్షరార్థము. ''సలిలః ఏకః ద్రష్టా అద్వైతః'' అని మఱియొక శ్రుతి. ఆత్మ, సలిలము వలె శుద్ధమైనవాడు, ఒక్కడు, సాక్షి, అద్వైత స్వరూపుడు అని శ్రుతిప్రమాణము వలన, ఆత్మాద్వైతము. ఆత్మవస్తువు ఒక్కటే అనునది సిద్ధాంతము. ''నేతి నేతి'', ''నేహ నానాఽస్తి'' అను ప్రపంచనిషేధ శ్రుతుల వలన, ప్రతియోగి యగు ప్రపంచము ప్రమితము, యథార్థజ్ఞాన విషయము కావలయునను నియమము లేదు. అభావబుద్ధికి ప్రతియోగి జ్ఞానమే, చాలును. మేము ద్వైత ప్రపంచమును అనిర్వచనీయమైనదిగా అంగీకరింతుము గనుక, ప్రత్యక్షాది ప్రమాణములచే అనిర్వచనీయ ప్రతియోగి జ్ఞానము సిద్ధించుచున్నది. పరమార్థముగా (సత్యముగా) లేదని నిషేధింపబడుచున్నది. ఈవిధముగా, ద్వైతనిషేధమునకు ఉపపత్తి గ్రహించవలయునని అర్థము.

## సిద్ధాన్తబిన్దుః

తర్హి, ఏతాదృశః ఆత్మా, అఙ్గులినిర్దేశేన ప్రతిపాద్యమితి। నేత్యాహ । కథం బ్రవీమీతి। కిమ్ ఆక్షేపే। అద్వైతకత్వేన వాగవిషయత్వాత్। అవచనేనైవ ప్రోవాచ। 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ', 'న విజ్ఞాతేః విజ్ఞాతారం విజానీయాత్' ఇత్యాది శ్రుతిభ్యః। వాగవిషయత్వే వేదాన్తానాం కథం తత్ర ప్రామాణ్య మితి చేత్, న। అవిషయేఽపి ఆత్మని తదాకారవృత్తి మాత్రేణ తదవిద్యానివర్తకత్వాత్ ఇత్యాహ సర్వ వేదాన్తసిద్ధమితి। తథా చ శ్రుతిః 'యస్యామతం తస్య మతం మతం యస్య న వేద

సః', 'అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతం మవిజానతామ్', 'యన్మనసా న మనుతే తేనాహుర్మనో మతం తదేవ బ్రహ్మ త్వం విద్ధి', 'నేదం యదిద ముపాసతే' ఇత్యాదిభిః విషయత్వం ఆత్మనో దర్శయతి । తదేవం వేదాన్తవాక్యజన్య అఖండాకారవృత్త్యా అవిద్యానివృత్తౌ తత్కల్పిత సకలానర్థనివృత్తౌ పరమానందస్సన్ కృతకృత్యో భవతీతి సిద్ధమ్ ॥౧౦

భా వ దీ పి క

అట్లయినచో, ఆత్మ, ఇట్టివాడు (అజరః, అమరః, అమృతః) అని వ్రేలితో నిర్దేశించి తెలుపరాదా? అనినచో, అట్లు కాదు అని చెప్పుచున్నారు. 'కథం బ్రవీమి' ఇతి. 'కిమ్' శబ్దము ఆక్షేపార్థకము. ఎట్లు చెప్పుదును? వ్రేలుపెట్టి చూపించలేనని భావము. అద్వైతతత్త్వేన=భేదముతో గూడిన దృశ్యముకంటె భిన్నమైనందున, వాగింద్రియమునకు గోచరము కాకపోవుటవలన, అవచనేనైవ ప్రోవాచ=మాట లేకుండగనే, మౌనముచేతనే, గురువు ఉపదేశించెను. అనగా, శబ్దము చేత జాతి, గుణ, క్రియాది ధర్మములు కల అర్థమే బోధింపబడును. బ్రహ్మయందు ఏ ధర్మములు లేవు. కనుక, బ్రహ్మ, శబ్దముచే బోధింపబడదు అని మౌనముతో బోధించెను. 'యతో వాచో నివర్తన్తే' ఏ బ్రహ్మనుండి బోధించలేక, వాక్కులు మరలునో, 'అప్రాప్య మనసా సహ' ఏ బ్రహ్మ, మనసునకు గూడ, గోచరము కాదో, 'న విజ్ఞాతేః విజ్ఞాతారం విజానీయాత్' మనోవృత్తిరూపమగు జ్ఞానము స్వప్రకాశ రూపమును భాసింపజేయలేదు అను శ్రుతుల వలన. బ్రహ్మ, సాక్షి వాక్కుచేత బోధింపబడుటకు శక్యము కానిది అయినచో, ఆ

బ్రహ్మయందు వేదాంతములు ఎట్లు ప్రమాణములగును ? 'ఔపనిషదం బ్రహ్మ' ఉపనిషత్తులచేతనే బ్రహ్మ, తెలియబడును అని ఎట్లు చెప్పుచున్నారు? అనినచో, అట్లు కాదు. ఆత్మ (బ్రహ్మ), స్వప్రకాశము గనుక, వాక్కునకు గోచరము కాదు, అవిషయము. అయినను, ఆత్మాకారవృత్తి, ఆవశ్యకము. వేదాంతములచేత, అఖండ బ్రహ్మాత్మాకారవృత్తి చేత, ఆత్మ స్వరూపావరకమైన అవిద్య, నివర్తించును. కనుక, వేదాంతములు బ్రహ్మాత్మయందు ప్రమాణములైనవి. అవిషయము అనగా, ఆత్మాకారవృత్తిప్రతిఫలిత చైతన్యభాస్యము కాదు. ఘటాదులందు ఘటాకారవృత్తివ్యాప్యత్వము, వృత్తిప్రతిఫలిత చైతన్య భాస్యత్వము- రెండును కలవు. బ్రహ్మాత్మయందు వృత్తి విషయత్వమే కలదు. వృత్తిప్రతిఫలిత చైతన్యప్రకాశాపేక్ష లేదు. సూర్యునియందు దివిటీ వలె స్వప్రకాశమగు ఆత్మయందు వృత్తి ప్రతిబింబ ప్రకాశము వెలవెలబోవును. ప్రకాశకము కాదని భావము. శ్రుతి, ఇట్లే చెప్పుచున్నది. ఎవనికి ప్రమాణఫలమునకు అవిషయమైనది, ప్రమాణఫలవిషయముగా తెలియబడినది అను అభిప్రాయము కలదో, అతడు తెలిసినవాడు కాడు. తెలిసిన వారలకు తెలియబడనిది, తెలియనివారికి తెలియబడినది. అనగా, స్వప్రకాశచైతన్యస్వరూపమగు ఆత్మ, ప్రమాణఫల (ప్రతిబింబ ప్రకాశ) భాస్యము కాదు. మనస్సుతో దేనిని మననము చేయలేడో, ఏ ఆత్మచేత మనస్సు, మననవృత్తిచే అనుగ్రహింపబడి ప్రకాశింపజేయబడునో, అదియే, బ్రహ్మ అని నీవు తెలిసికొనుము. దేనిని ఉపాసించుచున్నారో, ఆ వస్తువు బ్రహ్మ కాదు. ఉపాసన,

సగుణమునందే వర్తించును. నిర్గుణ బ్రహ్మ, ఉపాసనావృత్తికి గూడ, విషయము కాదు. ఈవిధముగా, చిద్రూపమగు ఆత్మ, ముఖ్యజ్ఞానస్వరూప మనియు, వృత్తిప్రతిఫలిత ప్రతిబింబ చైతన్యప్రకాశము కాదనియు, శ్రుతి తెలుపుచున్నది. కనుక, ఈవిధముగా, వేదాంతవాక్యము వలన, అఖండ బ్రహ్మాత్మాకార వృత్తిచే అవిద్యయొక్క నివృత్తి (నాశము) కలుగగా, అవిద్యా కల్పితమగు సకల అనర్థము అహంకార దేహేంద్రియాది అభిమాన ముచే కలిగిన బంధము ద్వైతప్రపంచము నివృత్తము కాగా, పరమానందరూపుడగుచు, కృతార్థుడు అగునని సిద్ధము.

బ్రహ్మాత్మ సాక్షాత్కారానంతరము ప్రారబ్ధకర్మాధీన, దేహము యొక్క స్థితి, అవిద్యాలేశానువృత్తిచే ఉండును. అవిద్యాలేశ మనగా విక్షేపశక్తి, లేదా వాసన (సంస్కారము) లేక ద్వైత స్ఫురణకు హేతువైన సూక్ష్మశక్తి ఉండుటచే జీవన్ముక్తుడు అగు జ్ఞాని, ఏ దేహమునందు జ్ఞానము కలిగెనో, ఆ దేహముతో కొంత కాలము ఉండును. తరువాత, విదేహముక్తుడగును. "తస్య తావదేవ చిరమ్, యావన్న విమోక్ష్యే, అథ సంపత్స్యే" అను శ్రుతి, ప్రమాణము. జ్ఞానికి విదేహముక్తి లభించుటకు ప్రారబ్ధకర్మాధీన దేహపాతమే విలంబము, భోగముచే ఆ దేహము నశించిన తరువాత, విదేహముక్తుడగును.

సిద్ధాన్తబిన్దుః

శ్లో॥ న స్తౌమి తం వ్యాస మశేష మర్థం
సమ్యక్ న సూత్రైరపి యో బబన్ధ।
వినాఽపి తైః సంగ్రథితాఖిలార్థం
తం శఙ్కరం నౌమి సురేశ్వరం చ॥ ౧

శ్లో॥ లఘురపి బహ్వర్థవహ శ్చిన్తామణిరివ నిబంధోఽయమ్ ।
మధుసూదనేన మునినా విహితో గుణినాం వినోదాయ ॥ ౨

శ్లో॥ యదత్ర సౌష్ఠవం కిఞ్చిత్ తత్ గురోరేవ మే న హి ।
యదత్ర అసౌష్ఠవం కిఞ్చిత్ తన్మమైవ గురో ర్నహి ॥ ౩

శ్లో॥ బహుయాచనయా మయాఽయ మల్పః
బలభద్రస్య కృతే కృతో నిబంధః ।
యదదుష్ట మిహాస్తి యచ్చ దుష్టం
తదుదారాః సుధియో వివేచయన్తు ॥ ౪

ఇతి శ్రీపరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ విశ్వేశ్వరసరస్వతీ భగవత్పాద పూజ్యశిష్య
శ్రీ మధుసూదనసరస్వతీవిరచిత సిద్ధాన్తబిన్దునామక గ్రన్థః
సమాప్తః ।

భావదీపిక

వేదవ్యాసమహాముని, తన సూత్రములచేత సమగ్రముగా వేదాంతార్థమును నింబధనము చేయలేదు. కావున, ఆయనను నేను స్తుతించను. సూత్రములు లేకపోయినను, సర్వవేదాంతార్థమును భాష్యరూపముతో అనుగ్రహించిన శంకరుని, వార్తికకారుడగు సురేశ్వరుని, స్తుతింతును.

ఈ గ్రంథము, అతిస్వల్పమైన దయినను, చింతామణివలె బహువిషయములను ప్రకాశింపజేయును. (సుధీజన వినోదము కొఱకు) మధుసూదనమునిచే ఈ గ్రంథము రచింపబడెను.

ఈ గ్రంథమునందు ఏ సౌష్ఠవము, గుణము కొంచెమైనను

కలదో, అది మా గురువులదే, నాది కాదు. ఏ కొంచెము అసౌష్ఠవము కలదో, అది, నాదియే కాని, గురువులకు చెందదు.

బలభద్రుడు (శిష్యుడు) పరిచర్యాపరాయణుడు బహు పర్యాయములు యాచించుటచేత నాచే ఈ గ్రంథము రచింపబడినది. దీనిలోని గుణదోషములను ఉదారులగు బుద్ధిమంతులు వివేచన చేయుదురుగాక।

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ విశ్వేశ్వరసరస్వతీ భగవత్పాద పూజ్యశిష్య
శ్రీమధుసూదనసరస్వతీ విరచిత సిద్ధాన్తబిన్దు నామక గ్రంథము
సమాప్తము.

ఓం తత్సత్

బ్రహ్మశ్రీ వేమూరి రామబ్రహ్మశాస్త్రి
,, మండలీక వేంకటశాస్త్రి
,, ఉప్పులూరి పున్నయ్యశాస్త్రి
,, దెందుకూరి నరసింహశాస్త్రి
,, పూజ్యశ్రీ సున్దర శాస్త్రి

మహోదయ గురుపరంపరాప్రాప్త
"బ్రహ్మవిద్యాలఙ్కార" సూరి రామకోటిశాస్త్రి ప్రణీతము
"సిద్ధాన్తబిన్దు భావదీపిక" అను
ఆన్ధ్రవివరణము సమాప్తము.

# శ్రీ గురుస్తోత్రమ్

శ్లో॥ బ్రహ్మానన్దం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతమ్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

## తాత్పర్యము

బ్రహ్మానన్దస్వరూపుడును, శిష్యులకు జ్ఞానోపదేశముచే శాశ్వతసుఖము నిచ్చువాడును, కేవల జ్ఞానస్వరూపుడు, ప్రపఞ్చ అతీతుడును, ఆకాశమును పోలినవాడు, 'తత్త్వమసి' మొదలగు జీవబ్రహ్మైక్య మహావాక్యములకు లక్ష్యార్థమైనవాడు, అద్వితీయుడు, నిత్యుడు, శుద్ధుడు, నిర్వికారుడు (కూటస్థుడు), సమస్తములైన బుద్ధివృత్తులకు సాక్షిగా ఉన్నవాడు, బుద్ధిచే గ్రహించుటకు అలవి కానివాడు, సత్త్వ, రజ, స్తమోగుణములు లేనివాడు అగు ఆ సద్గురువును నమస్కరించుచున్నాను.

చోదకుడు, బోధకుడు, మోక్షదుడు అని గురువు మూడు తెరగులుగా ఉండును. (వైదిక కర్మోపాసన)మార్గమును చూపించు వాడు చోదకుడు, పరోక్షజ్ఞానము కలుగజేయువాడు బోధకుడు, అపరోక్షజ్ఞానముచే మోక్షమును ప్రసాదించువాడు మోక్షదుడు.

శ్లో॥ సత్యం జ్ఞాన మనన్త మేక మజరం నిత్యం
విభుం శాశ్వతం
ప్రత్యక్ బ్రహ్మరసాయనం సుఖఘనం పూర్ణం
పరం పావనమ్।

స్వాత్మజ్యోతి రనాదిమధ్యనిధనం మాయావిలాసై ర్మహుః
విశ్వాకారం అపాస్తమాయ మభయం వన్దే విశుద్ధం పరమ్॥

తాత్పర్యము

మూడు కాలములయందు ఉండువాడు, జ్ఞానస్వరూపుడు, అనన్తుడు (దేశ, కాల, వస్తుపరిచ్ఛేదరహితుడు), అద్వితీయుడు, ముసలితనము లేనివాడు, నిత్యుడు, వ్యాపకుడు, శాశ్వతుడు, ప్రత్యగాత్మస్వరూపుడు, బ్రహ్మానందాశ్రయుడు, ఆనన్దఘనుడు, అంతట, నిండియున్నవాడు, పరమ పవిత్రుడు, ఆత్మజ్యోతిః స్వరూపుడు, ఆదిమధ్యాన్తరహితుడు, మాయావిలాసములతో మాటిమాటికి జగదాకారము ధరించువాడు, మాయామోహమునకు లోనుకానివాడు, సంసారభయము లేనివాడు, పరమ విశుద్ధుడు అగు సద్గురువును నమస్కరించుచున్నాను.

శ్లో॥ యస్య ప్రసాదా దహ మేవ సర్వం
మయ్యేవ సర్వం పరికల్పితం చ।
ఇత్థం విజానామి సదాత్మరూపం
తస్యాఙ్ఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యమ్॥

తాత్పర్యము

ఎవరి అనుగ్రహమువలన, నేను సర్వాత్మకుడను అయితినో, నాయందే, సమస్త చరాచర ప్రపఞ్చము కల్పింపబడెనో, ఈవిధముగా, ఎవరివలన, సద్రూపమగు ఆత్మస్వరూపమును తెలిసికొనుచున్నానో, ఆ సద్గురువుయొక్క పాదపద్మములను ప్రతిదినము నమస్కరింతును.

శ్లో॥ వేదాన్తవాక్యపుష్పేభ్యః జ్ఞానామృత మధూత్తమమ్।
ఉజ్జహార అళివత్ యో నః తస్మై సద్గురవే నమః॥

తాత్పర్యము

వేదాన్త వాక్యములనెడు పుష్పములనుండి ఉత్తమ మగు జ్ఞానామృత మధువును (మకరందమును) తుమ్మెదవలె ఎవరు వెలికితీసి మాకు అందించిరో, ఆ సద్గురువునకు నమస్కారము.

శ్లో॥ విద్యయా తారితాస్మో యైః జన్మమృత్యుమహోదధిమ్।
సర్వజ్ఞేభ్యో నమస్తేభ్యః గురుభ్యోఽజ్ఞానపఙ్కిలమ్॥

తాత్పర్యము

ఎవరిచే అజ్ఞానపఙ్కిలమగు జన్మ, మృత్యు, సంసార సముద్రమును తత్త్వజ్ఞానముచే (మేము) దాటింపబడితిమో, ఆ సర్వజ్ఞమూర్తులగు గురువులకు నమస్కారము.

శ్లో॥ జ్ఞానశక్తిం సమారుహ్య తత్త్వమాలావిభూషితే।
భుక్తిముక్తిప్రదాత్రే చ తస్మై శ్రీగురవే నమః॥

తాత్పర్యము

జ్ఞానశక్తిని అధిరోహించి, భుక్తిముక్తులను ప్రసాదించునట్టి తత్త్వమాలావిభూషితుడగు ఆ శ్రీగురువునకు నమస్కారము.

శ్లో॥ అఖణ్డానన్ద చిద్జ్యోతిం గుహాన్తఃస్థం శివం విభుమ్।
తం గురుం పరమానన్దం భజే విజ్ఞానసిద్ధయే॥

తాత్పర్యము

అఖండానన్ద చైతన్యజ్యోతిఃస్వరూపుడు, బుద్ధిగుహాన్తర్వర్తియు, నిరతిశయానన్ద స్వరూపుడు, సర్వోపద్రవరహితుడు, సర్వవ్యాపకుడు, పరమానన్దస్వరూపుడును అగు ఆ గురువును జ్ఞానవిజ్ఞానప్రాప్తి నభిలషించి సేవించుచున్నాను.

శ్లో॥ స్థావరం జఙ్గమం వ్యాప్తం యత్కిఞ్చిత్ సచరాచరమ్।
త్వం పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

## తాత్పర్యము

వృక్ష, పర్వతాది స్థావరములు, క్రిమి, కీట, మనుష్య, దేవాది జఙ్గమములు- ఈ చరాచరములలో దేనియందు అయినను, వ్యాపించియున్న 'త్వం' పదార్థము (జీవస్వరూపము) ఎవరిచే చూపబడినదో (బోధింపబడినదో), ఆ శ్రీ గురువునకు నమస్కారము అగుగాక.

శ్లో॥ అఖణ్డమణ్డలాకారం వ్యాప్తం యేన చరాచరమ్।
తత్ పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

## తాత్పర్యము

ఎవరిచే స్థావర, జఙ్గమ ప్రపఞ్చమంతయు, అఖణ్డజ్యోతిర్మండలాకారముచేత వ్యాపించబడినదో, అట్టి 'తత్' పదార్థము ఎవరిచే చూపబడినదో (బోధింపబడినదో), ఆ శ్రీ గురువునకు నమస్కారము.

శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరమ్।
అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

## తాత్పర్యము

స్థావర, జఙ్గమాత్మకమగు లోకత్రయము సర్వము, చిన్మయము (చైతన్యముతో వ్యాపింపబడినది). 'త్వం' పదార్థ 'తత్' పదార్థములకు ఐక్యము అఖణ్డచైతన్య స్వరూపములో ఎవరిచేత సాక్షాత్కరింపజేయబడినదో, ఆ శ్రీ గురువునకు నమస్కారము.

'త్వం' పదార్థములయిన జీవోపాధులు, 'తత్' పదార్థమైన ఈశ్వరోపాధి, వేఱైనను, ఉపహితము (ఉపలక్షితము) అగు అఖణ్డ చైతన్యము 'తత్త్వమసి' వాక్యార్థము గురువుచే బోధింపబడినది.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం తథా జ్ఞాతా యస్మాదన్యత్ న విద్యతే।
సర్వజ్ఞః సర్వశక్తిః యస్తస్మై జ్ఞానాత్మనే నమః॥

తాత్పర్యము

తెలిసికొనుట, తెలియబడు విషయము, తెలిసికొనువాడు, ఎవనికంటె వేఱు కాదో, ఎవడు సర్వజ్ఞుడు, సర్వశక్తిసమన్వితుడో, ఆ నిత్య జ్ఞాన (చైతన్య) స్వరూపుడగు గురువునకు నమస్కారము.

శ్లో॥ దర్శనం శ్రవణం జ్ఞానం యత్ర నాన్యస్య విద్యతే।
అఖణ్డైకరసం శాన్తం బ్రహ్మ తత్ సముపాస్మహే॥

తాత్పర్యము

చూచుట, వినుట, తెలిసికొనుట దేనియందు కలదో మఱియొకదానికి లేదో, అఖణ్డచిదానన్దఘనము, శాన్తము అగు ఆ బ్రహ్మను ఉపాసించుచున్నారము.

శ్లో॥ యదజ్ఞానప్రభావేన దృశ్యతే సకలం జగత్।
యద్జ్ఞానాత్ శ్రేయ ఆప్నోతి తస్మై జ్ఞానాత్మనే నమః॥

తాత్పర్యము

ఎవరిని, దేనిని తెలిసికొనకపోవుటవలన, సమస్త జగత్తు కనిపించుచున్నదో, ఎవరిని,దేనిని తెలిసికొనుటవలన,శ్రేయస్సును పొందుచున్నాడో, ఆ జ్ఞానస్వరూపునకు నమస్కారము.

శ్లో॥ యేనాత్మనా విలీయన్తే ఉద్భవన్తి చ వృత్తయః।
నిత్యావగతయే తస్మై నమో ధీప్రత్యగాత్మనే॥

తాత్పర్యము

బుద్ధివృత్తులు ఏ ఆత్మచే ఉద్భవించుచున్నవో, మఱియు, లయము చెందుచున్నవో, ఆ బుద్ధివృత్తులకు సాక్షిగా ఉన్న నిత్య జ్ఞానస్వరూపుడయిన ప్రత్యగాత్మకు నమస్కారము.

శ్లో॥ నిత్యానన్దైక కన్దాయ నిర్మలాయ చిదాత్మనే।
జ్ఞానోత్తమాయ గురవే సాక్షిణే బ్రహ్మణే నమః॥

తాత్పర్యము

నిత్యానందమునకు మూలమైనవాడు, విశుద్ధుడు,చిద్రూపుడు,

ఉత్తమ జ్ఞానసంపన్నుడు, గురువు, సాక్షియు నగు ఆ బ్రహ్మకు నమస్కారము.

శ్లో॥ యస్మాజ్జాతం జగత్సర్వం యస్మిన్నేవ ప్రలీయతే।
యేనేదం ధార్యతే చైవ తస్మై జ్ఞానాత్మనే నమః॥

తాత్పర్యము

ఎవనివలన, ఈ చరాచర ప్రపఞ్చ మంతయు జనించినదో, ఏవనియందే లీనమగుచున్నదో, ఎవనిచేత ధరింపబడుచున్నదో, జ్ఞానస్వరూపుడగు ఆ గురువునకు నమస్కారము.

శ్లో॥ ఓం నారాయణం పద్మభువం వశిష్ఠం
శక్తిం చ తత్పుత్ర పరాశరం చ।
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం
గోవిన్దయోగీన్ద్ర మథాస్య శిష్యమ్॥
శ్రీశఙ్కరాచార్య మథాస్య పద్మపాదం చ
హస్తామలకం చ శిష్యమ్।
తం త్రోటకం వార్త్తికార మన్యాన్
అస్మద్గురూన్ సన్తత మానతోఽస్మి॥

తాత్పర్యము

'ఓమ్' అని ఈశ్వరస్మరణము, మఙ్గళార్థము.

నారాయణుడు, బ్రహ్మ, వశిష్ఠుడు, శక్తి, ఆయన కుమారుడగు పరాశరుడు, వ్యాసుడు, శుకుడు, మహనీయుడగు గౌడపాదుడు, గోవిన్దయోగీంద్రుడు, ఆయన శిష్యుడగు శ్రీశఙ్కరాచార్యుడు, ఆయన శిష్యులగు పద్మపాదుడు, హస్తాముకుడు, త్రోటకాచార్యుడు, సురేశ్వరాచార్యుడు, తరువాతివారగు మా గురువులను ఎల్లప్పుడు వినమ్రశిరస్కుడనై నమస్కరింతును.

ఓమ్ తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

# ప్రాతః స్మరణమ్

శ్లో॥ ప్రాతః స్మరామి హృది సంస్ఫుర దాత్మతత్త్వం
సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయమ్।
యత్ స్వప్న జాగర సుషుప్తి మవైతి నిత్యం
తద్ బ్రహ్మ నిష్కల మహం న చ భూతసఙ్ఘః॥ ౧

ప్రాతర్భజామి మనసాం వచసా మగమ్యం
వాచో విభాన్తి నిఖిలా యదనుగ్రహేణ।
యన్నేతి నేతి వచనై ర్నిగమా అవోచం
స్తం దేవదేవ మజ మచ్యుత మాహు రగ్ర్యమ్॥ ౨

పాతర్నమామి తమసః పర మర్కవర్ణం
పూర్ణం సనాతనపదం పురుషోత్తమాఖ్యమ్।
యస్మిన్నిదం జగదశేష మశేషమూర్తౌ
రజ్జ్వాం భుజఙ్గమ ఇవ ప్రతిభాసితం వై॥ ౩

శ్లోకత్రయ మిదం పుణ్యం లోకత్రయవిభూషణమ్।
ప్రాతఃకాలే పఠేద్ యస్తు స గచ్ఛేత్ పరమం పదమ్॥ ౪

ఓమ్ తత్సత్।